# అనుసన్ధాన రత్నావళి

(ఒకబ్రహ్మాభ్యాసకునిమనన సంగ్రహవాక్యసంపుటి)

గ్రంథకర్త
కౌతా మోహనరామశాస్త్రి



ఆత్మవిద్యాశ్రమము
విజయవాడ :: సికింద్రాబాదు
1976

ప్రథమ ముద్రణము
1976



20/- రూపాయలు

ప్రాప్తిస్థానము :
ఆత్మవిద్యాశ్రమము
కౌతా బిల్డింగ్స్
బీసెంటు రోడ్, విజయవాడ-520 002

కౌతా స్వారాజ్య విహార్
10-పద్మానగర్, సికింద్రాబాదు-500 025

ముద్రణ :
స్వారాజ్య ప్రింటింగ్ ఇన్‌స్టిట్యూట్
సికింద్రాబాదు-500 025

బ్రహ్మశ్రీ పూర్వోత్తర మీమాంసా విద్వాన్, పండితప్రవర

**వీరేశ్వరకృష్ణ డోంగ్రేశాస్త్రిగారి**

## అ భి ప్రా య ము



ఆత్మమననానుకూలమగు అనేక ప్రకరణములుగల ''అను సన్ధాన రత్నావళి'' అను ఈ గ్రంథమందు గ్రంథరచనా కౌశలము అంతగా గనుబడక యున్ననూ, స్ఖాలిత్యములేని వేదాన్తశాస్త్ర సిద్ధాన్త నిరూపణమను ఒక గుణ ముండుటచే ''ఏకేనాపి సువృక్షేణవనం సర్వం సుశోభితమ్'', అను న్యాయ ముచే యీ గ్రంథము సువిభూషితమై సాధకులకు పరమ ప్రయోజనకారియై యున్నది.

ఈ గ్రంథకర్తగారిచే లోగడ రచింపబడిన ''బ్రహ్మ విద్యాను సన్ధాన దర్పణము'', ''జ్ఞానామృత సారము'', ''ఆత్మానన్ద ప్రకాశిక'' ఆంగ్లమున ''The Secret of Man and World'' అను గ్రంథములవలె యీ గ్రంథము గూడ గ్రంథకర్తగారి తత్త్వాను సన్ధాన ప్రీతి నిశ్చయదార్ఢ్యతను విశేషముగ తెలుపుచున్నది.

ఇందు వారి మనన పరిపాకముచే స్వయంకృతములగు ''ఆత్మ రసాయన మాల'', "ఆత్మాను భూతి" మొదలగు అనేక ప్రకరణములు విశేషముగ ఆకర్షణీయములై యున్నవి.

యోగ వాశిష్ఠము, శ్రీమద్భగవద్గీత, ఉపనిషత్తులు మరియు అనేక వేదాన్త ప్రకరణ గ్రంథములనుండి సంగ్రహించిన అనేక వాక్య రత్నములు వివరణ ప్రకాశముచే యిందు చక్కగా ప్రకాశించుచు వాచకుల హృదయముల నత్యంత మాకర్షించుచున్నవి.

ఈ గ్రంథము సాధకులకు అత్యంతోపకారకమై యుండునని నా నిశ్చయము.

ఈ రత్నావళి గూర్చిన వేదమూర్తులు బ్రహ్మశ్రీ విరాజితులగు శ్రీ కౌతా మోహన్‌రామ్‌శాస్త్రిగార్కి నిత్య నిరతిశయానన్దముతోపాటు, యీ భౌతికోపాధి గూడ చిరకాలానువృత్తమై, సుదీర్ఘకాలమువరకు యిట్టి సాధకానుగ్రహము జరుగుచుండవలయునని అపేక్షించుట తప్పనిసరియై యున్నది.

విజయవాడ
నలనామ సం॥
ఆశ్వీయుజ శుద్ధ ద్వాదశి
ఇందువాసరము
4–10–1976

ఇట్లు
వీరేశ్వర కృష్ణ డోంగ్రేశాస్త్రి

## బ్రహ్మశ్రీ పి. యస్. ఆర్. శాస్త్రిగారి

## అ భి ప్రా య ము



అను సన్ధాన రత్నావళి యను నీ గ్రంథము, ఉత్తమవేదాన్త గ్రంథములను పఠించి, తత్త్వరహస్యమును స్వానుభవము చేసుకొని, నిరన్తర మనన నిదిధ్యాసనములను చేసిన ఉత్కృష్ట వ్యవసాయఫలరూపమైనది యీ గ్రంథ రత్నము.

వేదాన్త వాక్యముల రత్నమాల యని నాకు స్ఫురించి, దీనిని జదివి ఆనందించితిని. దీనిని ముద్రించిన ముముక్షులోకమునకు అత్యంతోపయోగకర మగునని చాటి చెప్పగలను.

సికింద్రాబాదు
7–9–1976

ఇట్లు
పి. యస్. ఆర్. శాస్త్రి

# ప్రాస్తావికము

ఇది జీవుని పరమార్థ స్వరూపమును, నిత్య నిరతిశయానందమునునైన మోక్షప్రాప్తికి సాక్షాత్సాధనమగు బ్రహ్మాభ్యాస గ్రంథము. ఆత్మమనన, ఆత్మాను సన్ధాన రత్నావళి. బ్రహ్మాభ్యాసమనగా

శ్లో॥ తచ్చింతనం తత్కథనం, అన్యోన్యం తత్ప్రబోధనమ్ ।
ఏతదేక పరత్వంచ, బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః ॥

అని శ్రీ వశిష్ఠ వచనము తెలుపుచున్నది. శ్రీ శంకర భగవత్పాదులు ముముక్షువులకు "స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే" అని భక్తికి ముఖ్యార్థమును నిర్వచించుచున్నారు. ఈ గ్రంథము గ్రంథరూప రచనతోడ నేను వ్రాసినది కాదు. మరేమనిన, గడచిన మూడు నాలుగు సంవత్సరములలో నా బ్రహ్మాభ్యాసమునకుగాను, తీవ్ర ముముక్షు ప్రయత్నముతోడ, నే నప్పుడప్పుడు చూచినట్టి వేదాంత తత్త్వ గ్రంథములలో నాకు మనన ముఖ్యాశయములని తోచిన వాక్యములను సంగ్రహించి నా దినచర్య పుస్తకములలో అనగా డైరీలలో వ్రాసికొనిన నోట్సును అనగా సంగ్రహ వాక్యములను, యివిగాక నేను ఆ డైరీలలో ననే, సంగ్రహముగ వ్రాసికొనిన నా ఆత్మాను సన్ధాన విషయ వాక్యములను గూడ జేర్చిన యొక మనన సంగ్రహ వాక్య సంపుటి ఇందులో నోట్సు రూపమున నున్న దానికంతయు వాక్య పూర్వాపర సందర్భము లన్నిచోట్లను కనుబడవు. ఐనను యీ గ్రంథము ''బ్రహ్మ సత్యం జగన్మిథ్యా'' ''ఏకమేవా ద్వితీయం బ్రహ్మ'' ''నేహనా నాస్తికించన'' మొదలగు వేదాంత వాక్యముల కును, ''తత్త్వమసి'' ''అహం బ్రహ్మాస్మి'' మొదలగు మహావాక్య బోధ సమన్వయమునకును, నుపకరించుచు, నిర్గుణ బ్రహ్మాను సన్ధానాదుల కత్యంతోపయోగము, పరమ ప్రయోజనకారియని నా ఆశయము. తత్త్వ జిజ్ఞాసువులకు మననామృతము.

ఐనను మొదట యిది యంతయు నా మనన ప్రక్రియగా నిరంతరము నేను జూచిన ఉపనిషత్తులు, భగవద్గీతా, పంచదశి, యోగవాశిష్ఠము, నైష్కర్మ్య సిద్ధి, మరియును శ్రీ శంకర భగవత్పాదుల వివేక చూడామణి, మహావాక్య దర్పణము, అపరోక్షానుభూతి, ఉపదేశ సాహస్రి, ఆత్మబోధ,

మొదలగు గ్రంథరాజములనుంచి నా స్వంత ఉపయోగముకొరకు కేవలము నోట్సుగా నా డైరీలలో వ్రాసికొనబడినదేగాన, మొదట దీని ముద్రణతలంపు నాకు లేకుండెను. కాని ఏవో కొన్ని సందర్భములలో కొంతమంది పండిత వర్యులు, దీనిని పరిశీలించుట తటస్థించెను. తదుపరి వారు దీనిని ముద్రించి గ్రంథరూపమున నుంచినయడల, దీని ప్రయోజనము నొందగల జిజ్ఞాసువులు కొందరైనను వజ్రమణులు అరుదుగ నుండునట్లు, యుందురనియు, దీనిని ముద్రణారూపమున నుంచుట, యీ విద్యాభ్యాసకులకు మహోపకారముగ నుండు ననియూ చెప్పి ప్రోత్సాహించిరి.

తదుపరి ధైర్యము నవలంబించి దీనిని ఆత్మాను సన్ధాన గ్రంథరూపమున గావించినాడను. ఇది ఆత్మ విద్య. ఇదియే బ్రహ్మవిద్య, ముముక్షువులకు మోక్షప్రాప్తి సుసాధనము. ముముక్షువులు దీని పూర్తి లాభము నొందుటకు యీ గ్రంథ నామమునుబట్టి సూచింపబడుచున్నట్లు ఆత్మ చింతనాద్యభ్యాస మును, నిరంతరమును అనగా ఆత్మ సాక్షాత్కార పర్యంతమును విసువుజెందక, నభ్యసించుచుండుట ప్రధానము పరమప్రయోజనకారి. ఈ విద్యను గురించిన విషయ విమర్శలను విపులముగ తెలియగోరు మహనీయులకు పైన నుదహరించిన ఆది గ్రంథములతోడ మాచే సవిస్తరముగను శ్రుతి యుక్తి అనుభవరూపము నను తేటతెల్లముగ సులభశైలిలో సిద్ధాంతముగ రచింపబడినట్టి ''బ్రహ్మ విద్యానుసంధాన దర్పణము'' ''జ్ఞానామృత సారము'' ''ఆత్మానంద ప్రకాశిక'' మొదలుగాగల గ్రంథముల శ్రద్ధాపూర్వకముగ సద్గురు ముఖమున అందు విషయముల హృద్గోచరము గావించుకొని పఠించుచు, ఆత్మాను సన్ధానాద్యభ్యాస మును విడువక నభ్యసించుచుండిన యడల, పరమాత్మ జ్ఞానానుభవముకు అత్యంతోపకారముగ, సహకరించునని నా పునరాశయము. గీతా వచనముగూడ ''శ్రద్ధావాన్ లభతే జ్ఞానం'' అని తెలుపుచున్నది.

కావున దీనియందు గల వాక్య పరమ ప్రయోజనమును మాత్రము గ్రహించి, రచనాదోషము లున్నయడల పండితవర్యులు వాటిని పాటింపక మన్నింప వేడుచున్నాను.

—కౌతా మోహనరామశాస్త్రి

# విషయసూచిక

విషయము | పుట సంఖ్య


1. ప్రార్థన శ్లోకములు ... ... 1
2. ఉపోద్ఘాతము ... ... 3
3. మానవునకు జీవసృష్టియే సంసారబన్ధ కారణము గాని ఈశ్వరసృష్టిగాదు ... ... 9
4. ప్రపంచము, ప్రాపంచిక విషయముల యొక్క అవాస్తవికత ... ... 12
5. మాయాస్వరూపము ... ... 16
6. ఆత్మ - అంతఃకరణముల విమర్శ నిరూపణ ... 17
7. మానవునకు పరమపురుషార్థ సాధనము మనస్సే ... 20
8. ముముక్షువులకు కర్తవ్యము ... ... 22
9. కొన్ని నిర్వచనములు ... ... 26
10. పంచదశి సంగ్రహ వాక్యములు ... 28
11. శ్రుతివాక్య మంజరి ... ... 46
12. బ్రహ్మస్వరూప వాక్యములు, అనుసన్ధానము ... 56
13. జీవుని వాస్తవ స్వరూపము ... ... 58
14. ఆత్మజ్ఞాన లాభము ... ... 61
15. తత్త్వదృష్టి ... ... 62
16. తత్త్వజ్ఞుడు ... ... 67
17. ముముక్షు వ్యవహార నిరూపణ ... ... 69
18. జ్ఞాని - అజ్ఞానుల ప్రారబ్ధానుభవము ... 71

| విషయము | | పుట సంఖ్య |
|---|---|---|
| 19. వాశిష్ఠ గ్రంథ సంగ్రహ వచనములు | ... | 73 |
| 20. ఆత్మానుసన్ధాన క్రమము ... | ... | 79 |
| 21. బోధ సారాంశము ... | ... | 82 |
| 22. లోకానుభవ నీతి న్యాయవచనములు | ... | 88 |
| 23. ప్రాస్తావిక శ్లోకములు - నీతి వచనములు | ... | 91 |
| 24. కొన్ని భగవద్గీత సందర్భ శ్లోకములు | ... | 96 |
| 25. మననవాక్య కదంబము ... | ... | 109 |
| 26. బోధ శ్లోక సంపుటి ... | ... | 111 |
| 27. కొన్ని ఉపనిషద్వాక్యముల సంపుటి | ... | 113 |
| 28. వివేక వ్యవహారము ... | ... | 123 |
| 29. అంతర్యామి అన్నను, ఆత్మయన్నను ఒక్కటియే | ... | 127 |
| 30. సిద్ధ గీతలు ... | ... | 131 |
| 31. విద్యావిచారమున కొన్ని వాక్యములు | ... | 141 |
| 32. ఆత్మానుసన్ధానము ... | ... | 144 |
| 33. మరణ మూర్ఛనమ్ ... | ... | 146 |
| 34. సంకల్ప త్యాగము ... | ... | 148 |
| 35. సమాధి-సమాధి లక్షణములు ... | ... | 152 |
| 36. మోక్ష స్వరూపము ... | ... | 155 |
| 37. పరమార్థ బోధ ... | ... | 158 |
| 38. ఆత్మజ్ఞానికి అపూర్వసిద్ధు లుండవలెనను నియమము లేదు ... | ... | 161 |
| 39. అనాది భ్రాంత్యనుభూతి-రెండు విధములు | ... | 163 |
| 40. స్వాత్మాభిన్న-చిదాకాశానుసన్ధానము | ... | 165 |
| 41. జ్ఞాన భూమికలు ... | ... | 172 |
| 42. పరమసుఖ-సుసాధనము ... | ... | 176 |

| విషయము | | | పుట సంఖ్యా |
|---|---|---|---|
| 43. పరమేశ్వరుడు శ్రీ వశిష్ఠ భగవానులకుజేసిన ఆత్మబోధ | ... | ... | 182 |
| 44. స్వస్వరూపాను సన్ధానము | ... | ... | 194 |
| 45. ఆత్మ రసాయనమాల | ... | ... | 197 |
| 46. ఆత్మానుభూతి | ... | ... | 201 |
| 47. ఉపసంహారము | ... | ... | 210 |




# ముముక్షు ప్రాతః స్మరణ

శ్లో॥ ప్రాతః స్మరామి హృది సంస్ఫుర దాత్మతత్త్వం,
సచ్చిత్సుఖం పరమహంసగతిం తురీయమ్ ।
యత్స్వప్న జాగర సుషుప్తమవైతి నిత్యం
తద్బ్రహ్మ నిష్కల మహం నచ భూతసఙ్ఘః ॥

శ్లో॥ ప్రాతర్భజామి మనసాం వచసామగమ్యం
వాచోవిభాన్తి నిఖిలా యదనుగ్రహేణ ।
యన్నేతి నేతివచనై ర్నిగమా అవోచన్
తందేవదేవ మజమచ్యుత మాహురగ్ర్యమ్ ॥

శ్లో॥ ప్రాతర్నమామి తమసః పరమర్కవర్ణం
పూర్ణం సనాతనపదం పురుషోత్తమాఖ్యమ్ ।
యస్మిన్నిదం జగదశేష మశేషమూర్తౌ
రజ్జ్వాం భుజఙ్గమఇవ ప్రతిభాతి తంవై ॥

శ్లో॥ ప్రాతఃస్మరామి శ్రీకృష్ణ పరమాత్మానమవ్యయమ్ ।
స్వాత్మాభిన్నం స్వప్రకాశం సచ్చిదానన్ద లక్షణమ్ ॥

శ్లో॥ ప్రాతఃస్మరామి గాయత్రీం పరబ్రహ్మస్వరూపిణీమ్ ।
జ్ఞానానన్దమయీం శాన్తాం జీవన్ముక్తి సుఖప్రదామ్ ॥

శ్లో॥ స్వాత్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానరూపం
విశ్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యం ।
ఏకం నిత్యం విమలమచలం సర్వధీ సాక్షిభూతం
సర్వాధారం పరమపురుషం స్వస్వరూపం స్మరామి ॥

—X—

# ఆత్మానుసన్ధాన రత్నావళి



## ప్రార్థన శ్లోకములు

శ్లో॥ యదవిద్యా విలాసేన భూత ప్రకృతి సృష్టయః ।
తం నౌమి పరమాత్మానం సచ్చిదానందవిగ్రహమ్ ॥

శ్లో॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గురుర్దేవోమహేశ్వరః ।
గురు స్సాక్షాత్పరంబ్రహ్మా తస్మైశ్రీ గురవేనమః ।

శ్లో॥ గురవే సర్వలోకానాం, భిషజేభవరోగిణామ్ ।
నిధయే సర్వవిద్యానాం, దక్షిణామూర్తయేనమః ॥

శ్లో॥ శంకరం శంకరాచార్యం, కేశవం బాదరాయణమ్ ।
సూత్రభాష్య కృతౌవన్దే, భగవన్తౌ పునః పునః ॥

శ్లో॥ సదాశివ సమారంభాం, శంకరాచార్య మధ్యమామ్ ।
అస్మదాచార్య పర్యన్తాం, వందేగురు పరమ్పరామ్ ।

శ్లో॥ బిల్వేశం సతతం వన్దే, భాస్కరం పరమం గురుమ్ ।
గురుంచ జ్ఞానదాతారం, సూర్యనారాయణం బుధమ్ ॥

శ్లో॥ కౌతాన్వయ సుధాబింబం, సూర్యనారాయణం గురుమ్ ।
వందేఽహం జ్ఞానదాతారం, పితరం జ్ఞానభాస్కరమ్ ॥

శ్లో॥ యస్మిన్సర్వం యతః సర్వం, యః సర్వం సర్వతశ్చయః ।
యశ్చ సర్వమయోనిత్యం, తస్మై సర్వాత్మనేనమః ॥

శ్లో॥ బహిరన్తశ్చ సర్వాత్మా సదాస్వాత్మా సుబుద్ధిభిః ।
వివిధేన క్రమేణైష భగవాన్పరిపూజ్యతే ॥

దీని తాత్పర్యార్థమేమనిన :—

దేనియందు సమస్తముకలదో, దేనినుండి సమస్తము ఆవిర్భవించుచున్నదో, ఏది సమస్తము అయివున్నదో, ఏది అంతటను వ్యాపించియున్నదో, ఏది సర్వమయమై యొప్పుచున్నదో అట్టి సర్వరూపమగు ఆత్మకు సదా నానమస్కారము. మరియును, బాహ్యాభ్యంతరములం దున్నవాడును, సర్వాత్మయు, సదాజీవులయొక్క స్వాత్మరూపుడునునగు ఈ ఆత్మభగవానుడు ఉత్తమ బుద్ధిమంతులచే అనేక విధములుగ పూజింపబడుచుండును.

"అను సన్ధాన రత్నావళి" యను నీ గ్రంథమందంతటను తెలుపబడునట్టివి పరమాత్మాను సన్ధాన వాక్యరత్నములేగాని స్థూల దేహాది సంఘాత పరిదృశ్యమానజగత్సంబంధములు గావు. కాని వీనినన్నింటిని ముముక్షువులు శాస్త్రసాధనక్రమముగ మాత్రము గ్రహించి, వాస్తవమున జీవుని పరమార్థస్వరూపమగు నిత్య నిరతిశయానన్ద పరమాత్మస్వరూపమును నొందవలయును. అభ్యాసకులకు యిట్టి క్రమమును, సాధనములను తెలుపునదియే మోక్షసుసాధనమగు యీ అనుసన్ధాన రత్నావళి. ఇది అనుభవసారము.



# ఉపోద్ఘాతము

ప్రాస్తావికములో తెలుపబడినట్లు యీ గ్రంథమంతయు ఉపనిషదాది అద్వైత గ్రంథ రాజముల సిద్ధాన్త సంగ్రహ మనన వాక్యముల సంపుటి. ఇందు ఆత్మలాభ సాక్షాత్సాధనములగు మనన, స్వస్వరూపాను సన్ధాన ప్రక్రియలు, వివిధములుగ జేర్చబడియున్నవి. బోధ కొరకు విషయ నామములు అనేకములుగ యుదహరించుచున్నను యిందు జెప్పబడు విషయమంతయు "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" యనునదియు "తత్త్వమసి" యను మహావాక్య బోధయు, బలువిధములుగ తెలుపునట్టి మననమేగాని వేరుగాదు. ఈమనన మెందుల కావశ్యకమనిన వివేకులు కోరునట్టి శాశ్వత సుఖ స్వరూపమగు బ్రహ్మాత్మ యీ మననాది ప్రక్రియవలన దెలియబడునని "యదావై మనుతేఽథ విజానాతి", యని శ్రుతిమాత తెలుపుచున్నది. శాస్త్రప్రమాణము ననుసరించి, మనన ప్రయోజనమునకుగాను నేను కొన్ని సంవత్సరములు గావించిన నా మననాభ్యాస వాక్య సంపుటిని, పండితవర్యుల ప్రోత్సాహము వలన, జిజ్ఞాసువుల ప్రయోజనము నుద్దేశించి దీనిని గ్రంథరూపము గావించుచున్నాడను. దీని యావశ్యకతయు, ప్రయోజనము, లేవియనిన— జన్మించిన ప్రతి జీవుడును తన కెల్లప్పుడును సుఖముండవలయుననియు దుఃఖము రాగూడదనియు కోరుచుండును. అనగా అనన్దావాప్తి దుఃఖ నివృత్తిని కోరుచుండును. కాని సుఖానంతరము దుఃఖము, దుఃఖానన్తరము సుఖమును సాధారణముగ జీవులు పొందుదురేగాని శాశ్వత సుఖమును పొందలేకున్నారు. శాశ్వత సుఖము నొందుటకు ఆత్మజ్ఞాన మావశ్యకము. శాశ్వత సుఖమగు కైవల్యము అనగా పరమముక్తి జ్ఞానమువలననే కలుగునని "జ్ఞానాదేవతు కైవల్య

మితి వేదాన్త డిండిమః" అని చెప్పుటచే యితర సాధనములచే పరమ ముక్తి కలుగదని వాక్యమే స్పష్టపరచుచున్నది. ఇచట జ్ఞాన మనగా స్వాత్మ జ్ఞానమేగాని తదితర జ్ఞానములు గావు. ఈ విషయమునే శ్రీ వశిష్ఠ భగవానులు శ్లో॥ కరోతు భువనే రాజ్యం విశత్వాకాశ మంబువా। స్వాత్మ జ్ఞానం వినావిద్వాన్ విశ్రాంతిం నాధిగచ్ఛతి॥ అని తెలుపుచున్నారు. కావున శ్రుతి స్మృతివచనములన్నియు స్వాత్మజ్ఞానము లేక విశ్రాంతి, అనగా శాశ్వతసుఖము నొందశక్యముగాదని స్పష్టము చేయుచున్నవి. కాని కొందరు పుణ్యకర్మలవలన గూడ సుఖమును బొందవచ్చునుగదా యని తలంతురు. ఇదియు శాస్త్రప్రమాణమేనని తలంచవచ్చును. ఇది యధార్థమైనప్పటికిని పుణ్యకర్మవలన గలుగు ఫలము (సుఖము) నశించునదియేయని గూడ పరమాత్మయగు గీతా చార్యులు ద్వితీయాధ్యాయమందే, 40, 41 మరియు 42 శ్లోకములతో కర్మఫలము శాశ్వతముగాదనియు జీవునకు జన్మపరంపర గలిగించు చుండుననియు, యీ ఐశ్వర్యసుఖము వలన పరమాత్మయందు చిత్త సమాధానము గలుగదనియు స్పష్టముగ తెలుపుచున్నారు. కావున పునరా వృత్తి రహితమైన శాశ్వత సుఖమును గోరు విద్వాంసులందరకును స్వాత్మజ్ఞాన మావశ్యకము. బ్రహ్మజ్ఞానమన్నను, స్వాత్మజ్ఞానమన్నను నొక్కటియే. జీవునకు ఆత్మాపరోక్షజ్ఞానమువలన నిత్యనిరతిశయ సుఖస్వరూపమగు పరముక్తి కలుగునని "బ్రహ్మవిదాప్నోతి పరమ్", "బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి" అను మొదలుగాగల శ్రుతి వచనములు చాటి చెప్పుచున్నవి. బ్రహ్మయన్నను, ఆత్మయన్నను, పరమాత్మ యన్నను నొక్కటియే. కాని ఆ శ్రుతిమాతయే "నాయమాత్మా బలహీనే నలభ్యః" అనగా బలహీనునిచేత ఆత్మ పొందబడదు అనిగూడ తెలుపు చున్నది. ఇచట బలమనగా ఏదియని విచారించిన దేహబలము కాదు. మరియేదనిన స్వస్వరూపమగు ఆత్మప్రాప్తికి ప్రీతి నిశ్చయములుగల మనోబలముగాని వేరుగాదు. ఆత్మా పరోక్షప్రాప్తికి మనోబల ప్రీతి

నిశ్చయములుగలవాడే అర్హుడు అనిగూడ శ్రుతిమాతయే "కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్షత్, ఆవృత్త చక్షురమృత త్త్వమిచ్ఛన్", అనగా ఒకానొక ధీరుడు ప్రత్యగాత్మదర్శనమును గోరుచు యిన్ద్రియముల నంత ర్ముఖముగావించి అమృతత్త్వము నిచ్ఛయించుచుండునని తెలుపుచున్నది. ఇంతమాత్రమునకే యిట్లిచ్ఛయించువానిని ధీరుడని యేల చెప్పవలయు ననిన,శ్రుతియే "పరాంచిఖా నివ్యతృణ త్స్వయంభూః తస్మాత్పరాజ్పశ్య తినాన్తరాత్మన్", అనగా జగత్కర్తయైన బ్రహ్మ, సృష్టి ఆదియందే జీవుని యిన్ద్రియములను బహిర్ముఖ వ్యాపారములుగలవిగ సృష్టించెను. జిజ్ఞాసువు శాస్త్ర శ్రవణానన్తరము తాను సాక్షాత్కారమును గోరునట్టి ప్రత్యగాత్మను అన్తరమున దర్శించవలసి యున్నదిగాని బాహ్యమున దర్శించుటకు ఆయన, యిన్ద్రియగోచరుడు గాడు. ఆ ప్రత్యగాత్మ అవిషయుడు, నిర్విషయుడు. ఇన్ద్రియములా, బాహ్య విషయములను గురించియే పోవుచుండునుగాని, నిర్విషయుడగు ప్రత్యగాత్మను తెలిసి కొనజాలవు. కావున ఆత్మజ్ఞానము నిచ్ఛయించు మహనీయులు యిన్ద్రియ ప్రవృత్తిని అరికట్టవలయును. ఇది సామాన్యమైన పనిగాదు. గావున యిన్ద్రియములను నిగ్రహించి ఆత్మదర్శనము నిచ్ఛయించువాడు "ధీరుడు" అని శ్రుతిమాతయే చెప్పుచున్నది. ఇట్టి ధీరత్వమే ఆత్మ జ్ఞానమునకు కావలసిన బలము.

సామాన్యముగ ఇచట నొక శంకకు ఆపాతతః అవకాశ మున్నది. అదియేదనిన సృష్టికాలమందే "బ్రహ్మ" యిన్ద్రియముల నేల బహిర్ముఖ వ్యాపారములనుగానే జేయవలయును ? అనునది. కాని యీ సంశయము సరియైనదిగాదు. ఏలనన బ్రహ్మదేవుడు, యీ ప్రపంచ సృష్టి కల్పించినదియే, జీవుల ప్రారబ్ధ సుఖదుఃఖ భోగములకుగాను. సాధారణముగ జీవులు వారివారి ప్రారబ్ధముల ననుభవింపవలసి యున్నది. ఈ ప్రారబ్ధమనునది జీవుల అనాది అవిద్యా కామకర్మలచే యేర్పడినది. "అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్"

"నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి" అను మొదలుగాగల వచనములు జీవులకు ప్రారబ్ధకర్మ, భోగమువలనగాని నశించదని స్పష్టముజేయుచున్నవి. జీవునకు ప్రారబ్ధక్షయమైనగాని అనగా కర్మ పూర్తిగ నశించినగాని మోక్షము గలుగదు. కావున, ఏ జీవుడైనను విధిగా తన కర్మఫలమును క్షయింపజేసుకుని ఆత్మలాభము నొందవల యునేగాని వేరుదారి లేదు. పరమేశ్వరుడు జీవులకు యిన్ద్రియములను కేవల అంతర్ముఖముగ జేసినయెడల సృష్టియందు జీవునికి ప్రారబ్ధ భోగమునకే అవకాశములేక ప్రారబ్ధము శేషించియుండును. జీవునకు ప్రారబ్ధము, భోగమువలనగాని నశించదని "ప్రారబ్ధం భోగతోనశ్యేత్" అను వచనము తెలుపుచున్నది. ప్రారబ్ధ మెట్టిదైనను, ప్రారబ్ధము నశించినగాని జీవునకు ముక్తిలేదు. ప్రారబ్ధ ఫలమును నశింపజేసుకొను టకు ఒక్క ఆత్మజ్ఞానమే శరణ్యము. ఆత్మజ్ఞానమువలన సంచిత ఆగామి కర్మలు యావత్తు నశించునని "జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురు తేర్జున" అని శ్రీకృష్ణపరమాత్మ తెలుపుచున్నారు. కావున తమ ముక్తి కొరకు కర్మక్షయమును గోరు విద్వాంసులు ఆత్మజ్ఞానమును సర్వప్రయ త్నములచేతను అనగా శ్రవణ మనన నిదిధ్యాసన అభ్యాసముల వలన సాధించవలయునేగాని వేరుదారి లేదు. "శ్రద్ధావాన్ లభతేజ్ఞానమ్" అని శ్రీకృష్ణపరమాత్మ తెలుపుచున్నారు. ఇందులకు సందియము లేదు.

కావుననే ఆదియందు పరమేశ్వరుడు జీవప్రారబ్ధానుభవమునకు గాను ఇంద్రియములను బాహ్యవిషయ ప్రవృత్తములుగ సృష్టించుట ఆవశ్యకమైనది. ప్రత్యగాత్మయో నిర్విషయుడు. ప్రతి జీవునకును ప్రారబ్ధమనునది ఆగన్తుకము. అయినను ఇది భోగమువలనగాని నశిం చదు. ఈ ప్రారబ్ధము నశించినగాని స్వస్వరూపజ్ఞానము గలుగదు. ఇది కలిగినగాని సంసార భయరాహిత్యము గాదు. కావుననే శ్రీకృష్ణభగ వానులు అర్జునునకు ద్వితీయాధ్యాయ ప్రారంభముననే 14 వ, శ్లో

"మాత్రాస్పర్శాస్తు కౌన్తేయ శీతోష్ణ సుఖదుఃఖదాః ।
ఆగమాపాయినోఽనిత్యా స్తాం తితిక్షస్వభారత ॥

తప్పనిసరియగు ప్రారబ్ధము ననుభవించునప్పుడు సుఖ దుఃఖాద్యనుభవములు గలుగుచుండును. కాని యివి ఆగన్తుకములు, నశించునవిగాన వాటిని నీవు సహించవలయునుగాని వేరుదారిలేదని తెలుపుటకే "తితీక్ష" శబ్దమును వాడి బోధించిరి. ఈ తితీక్ష యనునది సర్వాంశముగ (అనగా పరిపూర్ణముగా) కలుగవలెననిన యడల నిది ఆత్మజ్ఞానమువలనగాని గలుగదు. కావున భగవద్గీతయందు మున్ముందరనే ద్వితీయాధ్యాయ 20 వ. శ్లోకమునుంచి 25 వ. శ్లోకము వరకు ఆత్మస్వరూపమును బోధించి తన ప్రారబ్ధ నిర్ణయమైన యుద్ధ మును జేయించి విజయమును గావించిరి. అర్జుననంతటి వానికిగూడ ప్రారబ్ధనిర్ణయమైన యుద్ధము విధిగా నాచరింపవలసి యున్నది. కాని పరిపూర్ణాత్మ జ్ఞానములేమిచే తన ప్రారబ్ధ నిర్ణీతమైన యుద్ధము జేయుటకు శోకమును, భయమును నొందెను. కావున అట్టి భయమును మున్ముందరనే, ఆత్మజ్ఞానముచే తొలగించి నిర్భయముగ యుద్ధము జేయ సమర్ధునిగ అర్జునుని శ్రీకృష్ణపరమాత్మ గావించెను. అర్జునుడు భయము నొందిన యుద్ధము, తన ప్రారబ్ధనిర్ణీతమని ధృవపరచుటకుగానే చిట్ట చివరకు 18 వ అధ్యాయమందు 60 వ శ్లోకములో "కర్తుం నేచ్ఛసి యన్మోహాత్కరిష్య త్యవశోఽపితత్" మోహమువలన నీవు దేనిని జేయననుకున్నావో దానినే అవశుడవయ్యి జేయుదువు, అని ప్రారబ్ధ ఫలబలమును అర్జునునకు సూచించి తెలుపుచున్నారు. అర్జుననంతటి వానికిగూడ ప్రారబ్ధబలమును పరమాత్మ యిట్లు తెలుపుచుండ, సామా న్యుల మాట జెప్పవలసినదేమి యున్నది. కావున ఎంతటి, యెట్టి జీవుడైనను ప్రారబ్ధము ననుభవింపక తప్పదు. ఏ జీవుడైనను తనకు విధింపబడిన శిక్షవంటి, తన ప్రారబ్ధము ననుభవించుచునే మరల తిరిగి తనకు కర్మఫలము లేకుండ జేసికొని ముక్తిని నొందవలయునేగాని

వేరుదారి లేదు. కర్మానుభవము నొందుచు అనగా ప్రారబ్ధానుసరణమున కర్మ నాచరించుచు దాని ఫలము గలుగకుండజేసికొనుటకు ఒక్క ఆత్మ జ్ఞానమే సాధనము. వివేకులందరకును ఆత్మజ్ఞానము అనగా స్వస్వరూప జ్ఞానము జీవదశయందు జీవన్ముక్తికిని, తదుపరి విదేహముక్తియగు శాశ్వతకైవల్య సుఖమునకునూ యావశ్యకము. ఇదియే శరణ్యము. సాక్షాత్సాధనమగు యీ ఆత్మ విజ్ఞానవిషయము, తత్సాధనముల గురించియు, ఆత్మానుసన్ధాన ప్రక్రియ ప్రకారాంతరములుగ, ఉపనిషద్వాక్యములతో, అద్వైత గ్రంథ రాజముల సిద్ధాంత సారవాక్యములతో, ముందు, మనన సంగ్రహవాక్యములందు శాస్త్రప్రమాణముతో విపులముగ నిరూపింపబడియున్నది. ఈ విద్యకు పునరుక్తి, దోషముగాక యావశ్యకము. ఇది ఆత్మవిద్య కావున విద్వాంసులకిది గ్రాహ్యము, దీని అభ్యాసము ముక్తిదాయకము.



# మానవునకు జీవసృష్టియే సంసారబన్ధ కారణముగాని ఈశ్వరసృష్టిగాదు

ఈశ్వరుడనగా మాయాశబళిత బ్రహ్మయే ఈశ్వరుడు. ఈయనయే సృష్టికర్త. ఈయనకు సృష్టికర్తృత్వాదులు కల్పితములు. అయినను ఇవి వ్యావహారిక ప్రయోజనములు. ఈ సృష్టివ్యవహారము జీవుల యొక్క అనాది కామకర్మలయందు ప్రారబ్ధ ఫలభోగమునకుగాను కల్పింపబడినది. ఈశ్వరసృష్టి యనగా పంచభూతములు, వీటి సమ్మేళనముచే జనించిన చతుర్విధ జీవరాసులు, జడపదార్థములును, అనగా జీవజడ సృష్టియంతయు ఈశ్వరునిది. ఈ ఈశ్వరసృష్టి అంతయు జీవప్రారబ్ధ ఫలభోగనిమిత్తము కల్పితము, వ్యావహారికము. అయినను జీవప్రారబ్ధానుభవ క్షయములనిమిత్తము ఈ సృష్టి యావశ్యకము. ప్రతి జీవుడును, వారి వారి ప్రారబ్ధమునననుభవించుచు దాని నశింపజేసుకొనవలయును. ఇట్టి ప్రారబ్ధనాశముతోడగాని యెట్టి జీవుడైనను ముక్తి బడయజాలడు. ప్రారబ్ధము అనుభవమువలనగాని నశింపదని వాక్యము తెలుపుచున్నది. కాన ఈ సృష్టి యావశ్యకతయున్నది. అయినను కేవల ఈ సృష్టి జీవునకు బంధహేతువు కాదు. ఈ సృష్టి పదార్థములయందు వారి వారి వాసనానుసారమున కలుగునట్టి సక్తతాభిమానములు, రాగద్వేషాదులే బంధకారణము. "జీవసృష్టియే బంధహేతువు". జీవసృష్టియనగా విషయములయందు జీవులకు కలుగునట్టి రాగద్వేషాదులు. ఇవి మనోనిష్ఠములు. కేవలం విషయములున్నను నిర్బాధములు. ఒక వ్యక్తియందుగాని, వస్తువుయందుగాని జీవునకు కలుగునట్టి అనుకూల ప్రతికూల జ్ఞానములే రాగద్వేషాదులకు కారణము. ఇవి చిత్త వాసనా సంస్కారములనుబట్టి కలుగుచుండును. కావున ముముక్షువునకు వాసన

లను త్యజించుట యావశ్యకము. అనగా అశుభములగు అనాత్మవాసనలను త్యజించి, శుభములగు ఆత్మవాసనలను వృద్ధిచేసుకొనుచుండవలయును. **ఆత్మజ్ఞానము** ఏకము, అద్వితీయము, అఖండము, నిరతిశయ సుఖ స్వరూపము, నిత్యము. అనాత్మజ్ఞానము, నానాత్వము, ద్వైతము, దుఃఖరూపము. ఈ బాహ్య వస్తుసముదాయము అంతయు ఉన్నను, వీని మిథ్యాజ్ఞాన నిశ్చయముచే ఈ విషయములు అజ్ఞులకువలె, అనగా పామరులకువలె, జ్ఞానులకు బాధకరములు గావు. అయినను ఇది తాత్కాలికము. ముముక్షువునకు దృశ్య ఆత్యంతిక దుఃఖము పోవలయుననిన, ఒక్క సదాత్మజ్ఞానమువలనగాని పోదు. కావున ప్రథమమున మనోమయ ద్వైతమును తొలగించుకొని తదుపరి జీవుడు తన పరమార్థ స్వరూపమగునట్టి ఏకము, అద్వితీయము, అఖండము, పరిపూర్ణ సుఖస్వరూపమును బొందవలెనుగాని వేరుదారి లేదు.

కేవలము బాహ్యవస్తువులుండుట, లేకపోవుటయు జీవునకు సుఖ దుఃఖ కారణమగుట లేదు. తనకు కలుగునట్టి సుఖదుఃఖములకు విషయములను గురించిన, తన అనుకూల ప్రతికూల జ్ఞానమే కారణమగుచున్నది. ఎట్లన దూరదేశమునందున్న తన పుత్రుడు బాగున్నను, మరణించినాడను వార్తవలన కలిగిన జ్ఞానముచే దుఃఖితుడగుచున్నాడు. ఇదిగాకను స్వప్నదశయందు బాహ్యవిషయములు వాస్తవముగ లేకున్నను తన మనోమయ సృష్టిచే దుఃఖముల నొందుచున్నాడు. ఇక సుషుప్తి, సమాధి, మూర్ఛలయందు బాహ్యవస్తువులున్నను సుఖదుఃఖములకు అవి హేతువులగుట లేదు. కావున కేవల బాహ్యవస్తు సముదాయమే తన సుఖదుఃఖ హేతువులనుటకు వీలులేదు. మరేమనిన, అట్టి బాహ్యవస్తువులు మనోమయములైనప్పుడే అవి తన సుఖదుఃఖములకు కారణమగుచున్నవి. ఇచట తనకు కలుగుచున్న జ్ఞానమే తన సుఖదుఃఖములకు కారణము. ఎట్లన దూరదేశముననున్న పుత్రుడు మరణించి కొంతకాలమయినను, అనగా రోజులు, మాసములతరబడి

అయినను, తనకు పుత్రుని మరణవార్త తెలియనంతవరకు దుఃఖము కలుగుటలేదు. ఈ మరణవార్తవలన కలిగిన జ్ఞానమే దుఃఖహేతువగు చున్నది గాని, కేవల పుత్రమరణము దుఃఖహేతువగుటలేదు. కాన మరణజ్ఞానమే దుఃఖమునకు కారణమగుచున్నది. కావున సిద్ధాన్తమేమ నిన, బాహ్యప్రపంచము నశింపకున్నను, దానియందు మిథ్యాత్వనిశ్చ యము కలిగిన జీవునకు అద్వితీయ బ్రహ్మమును తెలుసుకొన సాధ్య మగును. మరియును బాహ్యప్రపంచమున్నను, జీవునకు దానియందు మిథ్యాత్వనిశ్చయము కలిగినయడల ఈ బాహ్యప్రపంచమువలన సుఖ దుఃఖములు పామరునికివలె కలుగవు. ప్రారబ్ధానుసరణమున తాత్కాలిక ముగ క్షీణించి కలుగుచు ప్రారబ్ధాంతమున నశించును. ఇట్లుండునపుడు జీవుడు శాస్త్రీయమానస ప్రపంచమును గ్రహింపకలుగును. శాస్త్రీయ మానస ప్రపంచమనగా, బుద్ధిచే ప్రత్యగాత్మ, పరమాత్మల స్వరూప మును గూర్చి శ్రవణమననాదుల జేయుచుండుట. దీనిచే సాధింపవలసిన బ్రహ్మసాక్షాత్కారము (అనగా సదాత్మ జ్ఞానము) కాలక్రమమున తప్పక కలుగును. తదుపరి వీటి అవసరముగూడ నుండదని శ్రుతి తెలుపు చున్నది. ఎట్లన:— పాకము పూర్తిఅయిన వెనుక కొరువులను పార వైచునట్లు బ్రహ్మ సాక్షాత్కారానన్తరము అభ్యాసముతో పనియుండదు.



# ప్రపంచము, ప్రాపంచిక విషయముల యొక్క అవాస్తవికత

వేదశిరస్సగు ఉపనిషద్వాక్యముల పరమతాత్పర్యమగునట్టి అద్వైతసిద్ధాన్తము, యీ ప్రపంచములేదని ఎన్నడును చెప్పుటలేదు. కాని యీ ప్రపంచము యిందు స్వశరీర ప్రాపంచిక విషయసంఘాత మంతయు అవాస్తవముగనున్నది, వాస్తవముగకాదు అని బోధించుచు, యీ సృష్టిఅంతయు జీవుల ప్రారబ్ధ భోగానుభవములకుగాను కల్పింప బడినదని తెలుపుచున్నది. కల్పితమాత్రము, అవాస్తవము గనుక, అనిత్యమని మానవులకు శ్రుతిమాత బోధించుచున్నది. మరియును యీ ప్రాపంచిక విషయానుభవములన్నియు యెట్టి జీవునకైనను, ఎంతటి మహనీయునికైనను, కాలవ్యత్యాసముతోడ నశించి అశాశ్వతమగు చున్నవి. ఇది సర్వజీవానుభవము. అయినను జీవుడు తన అనాది అజ్ఞాన ముచే దీనినంతయు తనకు నిత్యము, సత్యము అను భ్రాంతితోడ విషయసక్తతాభిమానుడగుచు రాగద్వేషాదులతో పామరత్వము నొందు చున్నాడు. జీవునకు జననమరణ ప్రవాహములతోడ సంసారదుఃఖము నకు స్వశరీర దృశ్య సత్యత్వ భ్రాంతినొందుటయే దుఃఖహేతువగు చున్నది.

ప్రపంచమనగా ఈశ్వర సృష్టి. విషయములనగా జీవానుభవము నకు కల్పింపబడిన స్వశరీరాది సర్వపదార్థ జాలము. వీటియొక్క అనిత్యత్వము, అవాస్తవికతను తెలుసుకొనవలయునన్న యెడల వాస్త వికత యొక్క లక్షణము, అవాస్తవికత యొక్క లక్షణమును బాగుగ సశాస్త్రీయముగ గ్రహించవలెను. ఈ ప్రపంచము యెట్టి ప్రజ్ఞావంతున కైనను, యెట్టి మహనీయునికైనను యెవ్వరికిని నిత్యముగాయుండుట

లేదు. కాని జీవితకాల భేదమునుబట్టి హ్రస్వముగాను, దీర్ఘముగాను కొంతకాలము మాత్రము అనుభవింపబడుచు పర్యవసానమున అనగా ప్రాణవియోగకాలమున తనది యనుకొను సమస్తము తనదగుటలేదు. జీవుడు జడచైతన్య మిశ్రభ్రాంతుడై యున్నాడు. కాని జడ చైతన్యము లకు మిశ్రమము వాస్తవము గాదు. ఏలనన చైతన్యము తనను తాను తెలిసికొని యెదుటిదానిని తెలుసుకొనగలిగిన లక్షణము గలది. ఇది స్వరూపలక్షణము. ఈ లక్షణము ఒక్క ఆత్మకు తప్ప తదితరములకు లేదు వర్తింపదు. ఇది నిత్యము, సత్యము, పరిపూర్ణము, అఖండ పరిపూర్ణానంద స్వరూపము గలది. ఆత్మేతరములగు జడపదార్థము లన్నియు అనిత్యములు, అవాస్తవములు. జడము అనగా తనను తాను తెలిసికొనలేక యెదుటిదానిని తెలిసికొనలేని లక్షణము. అనగా అజ్ఞానము, మాయ ఇదియే సృష్టి. ఇది అంతయు అనిత్యమగు అనాత్మ కోటి లోనిది. చైతన్యము పరిపూర్ణము, అవినాశి, అఖండానంద రూపము జడము ఆత్మచే ప్రకాశింపజేయబడుచు కాలవ్యత్యాసముతోడ నశించునది.

అద్వైత సిద్ధాంతమునుబట్టి జీవుడు పరమార్థ వాస్తవమున బ్రహ్మాభిన్నుడు. అనగా బ్రహ్మకంటె వేరుగాదు. బ్రహ్మయే పర మాత్మ. ఈ ఆత్మయే ఆనన్దస్వరూపము. తదితరములు కావు అనిగూడ "ఆత్మైవానందః" అను శ్రుతివచనము ఏవకారమువలన స్పష్టము చేయుచున్నది. శ్రుతివాక్య మెన్నటికినీ అవాస్తవము కాజాలదు. కావున మానవుడు వాస్తవమున ఆనన్దస్వరూపుడే అయినను అనాది అజ్ఞానము వలన తన పరిపూర్ణానన్దస్వరూపమును మరచి తను పారవేసిన ఆనన్దము అనగా మరచినసుఖమును, తన మెడలోనిహారమును మరచి ఊరంతయు దానికొరకు వెదకునట్లు, వెదకికొనుచుండును. అట్లే మానవుడు తన సుఖస్వరూపమును తెలిసికొనలేక దానికొరకు విషయాన్వేషణము చేయు చుండును. కాని విషయములు జడములుగనుక వాస్తవమున నవి సుఖము

నివ్వజాలవు. అయినను వానిని తన సుఖమున కాధారముచేసికొని, తన మనోనిష్ఠమైన దానిని సుఖమువలె ఆ యా విషయములయందనుభవించు చుండును. ఇది భ్రాంతి. అది ఎట్లనిన కుక్కకుదొరకు ఎండుబొమిక యందు రక్తము ఉండదు. అయినను దానియందు రక్తముండునను భ్రాంతిచే, దానిని నాకి, నాకి, అట్లు నాకుటచే తన నాలుక చీరివచ్చిన రక్తము ఆ బొమికకు అంటుకొనగా, అది బొమిక రక్తమని సంతోష ముతో దానిని నాకి అనందించుచుండును. దీనిని భ్రాంతిగాక మరేమన వచ్చును. ఇట్లే మానవుడు తన అనాది అజ్ఞాన అవిద్యా వాసనాబలముచే, తన వాసనానుసరణమున కోరునట్టి విషయములందు అనగా, భార్యా, పుత్ర, విత్త, క్షేత్ర గృహాదులయందు వాస్తవముగ సుఖము లేకపోయి నను, జీవుడు తన అనాది అజ్ఞాన వాసనాబలముచే వాటియందు, సుఖ బుద్ధిని ఆరోపించుకొని తనలోయున్న వాస్తవ, ఆనన్దస్వరూపచ్ఛాయను వాటియందు సంక్రమింపజేసుకుని శుష్కములగు బొమికలతో సమాన మగు యీ విషయసముదాయమును, భ్రాంతితోడ సుఖమని యనుభవించు చుండును. కాని స్వభావముచే నివియన్నియు సుఖరూపములు గావు. కనుక పర్యవసానమున దుఃఖహేతువులగుచు జీవుని సంసారమునందు భ్రమణము చేయించుచుండును. కావున ముముక్షువునకు యీ భోగ్య భాగ్యాది, అనగా స్వశరీర, కాంతా, కనకాన్నపానాది విషయ విమర్శ. అనగా- వాటి అవాస్తవికత, అనిత్యత్వము, వికారిత్వములను బాగుగ, తన అనుభవము, లోకానుభవములతోడ విచారించుట యావశ్యకము. ఇట్టి శాస్త్రీయ విచారణవలన విరాగముదయించుచుండును. ఇది వృద్ధి యైనకొలది చిత్త విక్షేపము తగ్గుచుండును. చిత్త స్థైర్యము కలుగును. దానివలన ఆత్మవిచారము చేయుటకు సమర్థుడగును. అప్పుడు గుర్వీశ్వ రానుగ్రహములతోడ ఆత్మవిచారము చేయుచుండ కాలక్రమమున, మనసు యీ విషయ నానాత్వభోగములనుంచి మరలి యీ భార్యా పుత్ర విత్త క్షేత్ర గృహాదికములన్నియు తనకు, తన ప్రారబ్ధ ఫలభోగనిమి

త్తముగ నేర్పడినవేగాని వాస్తవములుగావు అని తెలిసి యివి అన్నియు అధ్యస్తమాత్రములను నిశ్చయము కలుగును. ఈ నిశ్చయమువలన యీ స్వశరీర దృశ్య సర్వాధ్యస్తమునకును, అధిష్ఠానమేది? దేనియందు నాకు ఈ అధ్యస్తమంతయు భాసించుచు కాలాంతరమున నశించుచున్నది అను జిజ్ఞాసకలవాడగుచు, ఆత్మవిచారపరుడగును. అప్పుడు సద్గురువువద్ద శ్రవణముగావించి, విన్నదానిని సప్రమాణానుభవముతో మననము గావించును. జిజ్ఞాసువుకు ఈ మననము మహోపకారి. ఏలనన శ్రుతి గూడ, "యదావై మనుతే అథవిజానాతి" అనగా మననము యెప్పుడు చేయునో అప్పుడు తెలిసికొనుచున్నాడు అని తెలుపుచున్నది. కావున స్వశరీర సర్వవిషయములయందునను అనగా అహం, మమేదం రూపమున ఈ ప్రపంచరూపముగ భాసించుచున్న దానియందు శాస్త్రీయదోష దృష్టిచే తనకు వానిని దుఃఖపర్యవసితములుగ నిశ్చయించుకొని, నిత్యమగు తన స్వస్వరూపమును, శాస్త్రబోధ, సద్గురువులవలన బాగుగ గ్రహించి, ఆత్మాపరోక్షానుభవమును సంపాదించుటకు ప్రారబ్ధాంతము వరకును విషయ త్యాగముతోడ స్వస్వరూపాను సంధానాదు లాచరించుటకుగాను, ముముక్షువునకు దృశ్యమిథ్యాత్వజ్ఞానము, అనగా విషయములయొక్క అవాస్తవికతను తెలిసికొనుటావశ్యకము.

# మాయాస్వరూపము

మాయ అనగా యా, మా, సా, మాయా, అనగా ఏది వాస్తవముగ లేనిదో అది మాయ. ఈ మాయ ఆత్మను విడచి స్ఫురింపదు కావున అస్వతంత్రము. కాని స్వతంత్రుడైన ప్రత్యగాత్మను సంగముగలవానినిగా చేసినది గావున స్వతంత్రా స్వతంత్రములుగలదియని శ్రు॥ "జీవేశా వాభా సేనకరోతి" అను వచనము స్పష్టముచేయుచున్నది. ఎట్లనిన :— స్వభావముచేత నిర్వికారుడు, అసంగుడునైన చిద్రూపుని, జగద్రూపునిగా కనబరచుచున్నది. అనగా లేనిదానిని కనబరచుచున్నదని యర్ధము. ఇంకనూ ఈ మాయయే చిదాభాస రూపముచేత జీవేశ్వరులకు భేదము కల్పించి యిద్దరినిగా జూపుచున్నది. ఈ విభాగము మాయా కల్పితము. ఈ దృశ్యమంతయు భ్రాంతి మాత్రమైన మాయా పరిణామమే కాని వాస్తవము గాదు. ఈ మాయయొక్క స్వభావమును తెలుసుకున్నయడల లేనిదేయగును. ఇట్టి మాయనుగురించి శ్రీ విద్యారణ్యు లిట్లు తెలుపుచున్నారు :—

శ్లో॥ ద్రవత్వముదకే, వహ్నౌ వౌష్ణ్యం, కాఠిన్య మశ్మని ।
మాయాయాం దుర్ఘటత్వంచ, స్వతస్సిద్ధ్యతి నాన్యతః॥

అనగా ఉదకమునందు ద్రవత్వమును, అగ్నియందుష్ణత్వమును, రాతియందు కాఠిన్యమును, స్వభావసిద్ధములై యున్నట్లు, మాయ యందును అఘటితఘటనా పటీయసీ రూపమగు శక్తి స్వతస్సిద్ధమై యున్నదేగాని, మరియొక పదార్ధమువలన కలుగునది గాదు.



# ఆత్మ – అంతఃకరణముల విమర్శ నిరూపణ

జీవునకు యీ శరీరము వరిధాన్యమువంటిది. దీనికి, అనగా యీ గింజకు లేక బీజమునకు పైన ఉన్నట్టి, ఊక, తౌడు మొదలగునవి ముఖ్య ప్రయోజనములు కావు. అంతరమునయున్నట్టి బియ్యపు గింజయే మానవునకు ముఖ్య ప్రయోజనము. దేహపుష్టినిచ్చునట్టి సత్తు యిందు లోననే యున్నది. ఇదియే మానవునకు ముఖ్య ఆహారముగా నుండి తృప్తినిచ్చునట్టి పదార్థము. పైనున్న ఊక, తౌడు మొదలగునవి పశువులకు మాత్రమే ఆహారముగానుపయోగించునుకాని, మానవులకు కాదు. అయినను ధాన్యము, యీ ఊక, తౌడుతో యున్నప్పుడే దీని యందు అంకురశక్తియుండి పంటపండుటకు ఉపయోగించునేకాని దంచినట్టి కేవల బియ్యము, అంకురశక్తిలేక ఆహారమునకు మాత్రమే పనికివచ్చును. ఊక, తౌడు, ప్రయోజనము బహుఅల్పము. అనగా పశువులమేతకుగానే ఉపయోగించును, గాని మానవుని ఆహారముగ నుపయోగించదు. పైనున్న ఊక, పొట్టు తీసివేసిన, యీ ధాన్యము యొక్క అంకురశక్తి నశించి అతితృప్తినిచ్చునట్టి మానవుని ఆహారమున కుపయోగించును కాని పై ఊక, పొట్టు, అట్లే యుంచిన ధాన్యము మానవుని ఆహారమునకుపయోగించదు. అట్లే ఆహారమునకుపయోగించుట అవివేకమేకదా? ఈ ధాన్యము ఆహారమునకు కావలెనన్న పైనున్న ఊక, పొట్టు తీసివేసి వాడవలయునేగాని మరి వేరుదారి లేదు. ఇట్లే ఆత్మలాభము నపేక్షించు ముముక్షువు తనకిప్పుడనుభవములోనున్న "అహం" నేను అను ప్రతీతి ఆత్మానాత్మ మిశ్రితమైయున్నందున, తన దేహాది అంతఃకరణ సంఘాతరూపమున నున్నట్టియు, ఊకపొట్టుతో సమానమగునట్టియు జడ అనగా అనాత్మపదార్థమును విడగొట్టి "అహం"

అను తాను, బియ్యమువంటి కేవల ఆత్మస్వరూపుడనని, సద్గురు శాస్త్ర బోధ వలన, బాగుగ తెలిసికొని, సంశయ విపర్యయరహితముగ ఆత్మయే తన శాశ్వతానన్దరూపమను నిశ్చయమునొంది, అట్టి స్వస్వరూపమును మాత్రము, నిత్య నిరంతర ధ్యానానుసన్ధానముల నాచరించుచుండుట. తండుల ప్రాప్తికిగాను, ధాన్యమును దంచుట, చెరుగుటవంటిది. ఇట్లు చేయుటవలన, జీవునకు ఉత్తరజన్మ కారణమగునదియు, భావి ప్రతిబంధమును కలుగజేయునదియు అంకురశక్తి కలదియు, ఊక, పొట్టుతో సమానమగునదియునగు అనాత్మభావము కాలక్రమమున నశించి తనకు, పరమతృప్తినిచ్చు తండుల సమానమగు ఆత్మలాభమును నొందజేయును. ఏలనన, జీవునకు, పరమాత్మ తనయందే, వరిధాన్యమందున బియ్యపుగింజలాగున ప్రకాశించుచుండును. ఇది కేవల జ్ఞానరూపము. జీవునియొక్క పరమార్థ స్వరూపము. వాస్తవమగునట్టిది. తక్కినదంతయు అవాస్తవము అల్ప ప్రయోజనము, వరిధాన్యమందున్నట్టి బియ్యము, యెట్లు అంకురశక్తిలేక, సారవంతమై యుండునో, అట్లే జీవుని సర్వాంతరమున తెలియబడుచున్న కేవల ఆత్మ. ఈయనయే ఆత్మ, ప్రత్యగాత్మ, పరమాత్మ, సాక్షి, కూటస్థుడు, అను పర్యాయపదములచే తెలియబడువాడు. ఈయన ఉత్పత్తినాశములులేనట్టి, అంకురశక్తి లేనట్టి నిత్య, నిరతిశయానన్ద స్వరూపుడు. ఈయనయే అఖండానన్ద స్వరూపుడు. ఈయనను తెలిసికొని స్వానుభవము నొందుటయే మోక్షము. కాని యిచట సామాన్యముగ నొక సంశయము కలుగవచ్చును. అది ఏదియనిన, ఉపమానములో చెప్పబడినయట్టి ధాన్యాదులు కనబడునవి గనుక, ఊక, పొట్టు, బియ్యము, వేరువేరుజేయ సాధ్యము. కాని ఆత్మ ఇన్ద్రియ గోచరముకాని అపరిచ్ఛిన్న పదార్థము. కావున యిది యెట్లు సాధ్యమని తలచవచ్చును. కాని ఈ శంక సరియైనది గాదు. ఇచట ఆత్మానాత్మలను వేరుజేయుట యనగా, శ్రుతిబోధ, యుక్తి అనుభవమునుబట్టి, సశాస్త్రీయముగ, సద్గురు ముఖమున విచారమును

గావించి, ఆత్మనిశ్చయమునొంది, మననాది, నిరంతరాభ్యాసాదుల నాచరించుచుండుటే ధాన్యావఘాతాదులతో సమానము. ఇట్లాచరించు ముముక్షువునకు కాలక్రమమున, అభ్యాస పాటవమునుబట్టి ఆత్మ-అంతః కరణములు వేరువేరుగ స్ఫురించుచుండును. తదుపరి ఈ స్థూల, సూక్ష్మ దేహములు అనగా దేహాది సంఘాతమంతయు జడము, అనాత్మ పదార్థమనియు, తాను జ్ఞానమాత్ర ఆత్మస్వరూపుడనని, అనుభవపూర్వక నిశ్చయము కలుగును. అపుడు ఈ స్వశరీరాది దేహ సంఘాతము గాని, దానికి సంబంధించిన కర్తృత్వ, భోక్తృత్వాది ధర్మములుగాని, తనకు వాస్తవములుగావను నిశ్చయముగలిగి, వాటివలన కలుగునట్టి సుఖ దుఃఖాది అనుభవములు క్షీణించుచుండును. విషయభోగముల యందు వైరస్యముకలిగి, సక్తతాభిమానములుగూడ క్షీణించుచుండును. ఇట్టి స్థితిలో అనుభవింపబడు తన ప్రారబ్ధకర్మ అంతయు, ఊక, పొట్టు తీసివేసిన ధాన్యమువలె అంకురశక్తి నశించి, భావి ప్రతిబంధము గాకుండును. సతత ఆత్మాను సన్ధానాభ్యాసాదులచే అనాత్మరూపమగు అంతఃకరణ సంఘాతమందు సక్తతాభిమానములు నశించి, అవి తనకు వాస్తవమున సంబంధించినవికావని తెలిసికొనుటయే, యిచట విడదీయుట అనుమాటకు అర్థమని పాఠకులు గ్రహింతురుగాక.

# మానవునకు పరమపురుషార్థ సాధనము మనస్సే

సద్వస్తువు - అసద్వస్తువు చేతనా చేతనములకు నడుమ నుండి, నేను, నాది, యను రెండు వృత్తులయందు దిరుగునట్టిదియే మనస్సు. ఈ మనస్సు అచేతనమగు జడమును తీవ్రముగ భావించు చుండుటచే, జడత్వమును బొందుచున్నది. అనగా యీ దృశ్యమునంత యును నేను, నాది, యను భావన చేయుచున్నది. ఈ మనస్సే, సాక్షి చైతన్యము నేనేయని దృఢముగ భావించుటచే ప్రకాశించుచున్న చిద్రూపత్వమును పొందుచున్నది.

శ్లో॥ పౌరుషేణ ప్రయత్నేన, యస్మిన్నేవ పదేమనః ।
యోజ్యతే తత్పదం ప్రాప్య, భవత్య భ్యాసతోహితత్॥

మనస్సు పురుష ప్రయత్నముచే, ఏ విధమగు వస్తువునందు ప్రవేశ పెట్టబడుచున్నదో ఆ విధమగు వస్తురూపమును అభ్యాసమువలన పొందుచున్నది.

శ్లో॥ అతః పౌరుషమాశ్రిత్య, చిత్తమాక్రమ్య చేతసా ।
విశోకం పదమాలంబ్య, నిరాతంకః స్థిరోభవ ॥

కావున పురుషప్రయత్నమువలన, మనస్సుచేతనే, మనస్సును గ్రహించి దుఃఖరహితమగు బ్రహ్మ వస్తువునందు నిర్విఘ్నముగా జేర్చి, స్థైర్యమును పొందినవాడవగుము.

శ్లో॥ మనఏవసమర్థం హిమనసోదృఢ నిగ్రహే ।
అరాజాకిం సమర్థస్స్యా, ద్రాజ్ఞో రాఘవ నిగ్రహే ॥

శ్రీరామచంద్రా-రాజును జయించుటకు రాజే సమర్థుడగునట్లు, మనస్సును జయించుటకు మనస్సే సమర్థతగలదియగుచున్నది (అనగా యితరములు గావు అని భావము).

శ్లో॥ మనసైవ మనశ్ఛిత్త్వా, పాశం పరమబంధనం ।
భవాదుత్తార యాత్మానం, నాసావన్యేనతార్యతే ॥

దృఢముగ బంధించునట్టి మనస్సు అను పాశమును మనస్సు చేతనే తెగకొట్టి, సంసారమునుండి ఆత్మను తరింపజేసికొనుము. ఈ ఆత్మ యింకొక ఉపాయముచే తరింపదు. ఈ విషయమునే "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అను వచనము విశదము చేయుచున్నది. "అభ్యాసాత్ సర్వసిద్ధిః ఇతి వేదానుశాసనం".

శ్లో॥ నాఽహం బ్రహ్మేతి సంకల్పా,త్సు దృఢాద్బధ్యతేమనః
సర్వం బ్రహ్మేతి సంకల్పా,త్సు దృఢాన్ముచ్యతేమనః ॥

మనస్సు, నేను బ్రహ్మనుగాను అను ధృఢమగు సంకల్పమువలన బంధము నొందుచున్నది. ఇంక అంతయూ బ్రహ్మమే అను దృఢమగు సంకల్పమువలన ముక్తినొందుచున్నది.



# ముముక్షువులకు కర్తవ్యము

శ్లో॥ బహుశాస్త్ర కథాకంథారో రోమంథేన వృథైవకిమ్ ।
అన్వేష్టవ్యం ప్రయత్నేన, తత్త్వజ్ఞైర్జ్యోతిరాంతరమ్ ॥

తా॥ అనేక శాస్త్రములను మాటిమాటికి పాఠప్రవచనములచేత నావృత్తిచేసినందున ప్రయోజనమేమియు లేదు. కనుక తత్త్వజ్ఞులగు పురుషులు హృదయ పుండరీకమందుండు, స్వప్రకాశరూపమైన పరబ్రహ్మను ప్రయత్నపూర్వకముగ స్వాత్మాభిన్నముగ తెలిసికొనవలయును. ఇదిగాక కేవల శాస్త్రపాండిత్యమువలన ప్రయోజన మించుకంతయు లేదని యీ వచనము తెలుపుచున్నది :—

శ్లో॥ అధీత్య చతురోవేదాన్, ధర్మశాస్త్రాణ్యనేకశః ।
బ్రహ్మతత్త్వం నజానాతి, దర్వీపాకరసం యథా ॥

ఈ విషయమునే, ఛాందోగ్య శ్రుతి, నారదమహాముని నాలుగు వేదములను, అరువదినాలుగు విద్యలను, సమగ్రముగా చదివినను, బ్రహ్మతత్త్వజ్ఞానము కలుగనందున సనత్కుమారునియొద్దకు వెళ్ళి వారివలన నాత్మతత్త్వమును తెలిసికొని అభ్యసించి కృతార్థతనొందినట్లు తెలుపుచున్నది. "ఏతగ్ం హవావనతపతి" "కిమహగ్ం సాధునాకరవమ్" "కిమహం పాపకరవమితి", అనగా తత్త్వజ్ఞుడు కానివారికి అనగా అవిద్వాంసునకు మరణకాలమందు నేను పుణ్యకర్మను ఎందుకని చేయకపోతిని? పాపకర్మను ఎందుకుచేసితినని పరితాపముకలుగును. ఈ పరితాపమును పుణ్య పాపకర్మలు కలిగించుచుండును. విద్వాంసుడు రెంటియొక్క తత్త్వము నెరిగినవాడుగనుక, (అనగా యివి కల్పిత మాత్రములు అని తెలిసికొన్నవాడుగనుక) అట్టి పరితాపము నొందదు

శ్లో॥ పరిజ్ఞాయోప భుక్తోహి, భోగోభవతితుష్టయే।
విజ్ఞాయ సేవితశ్చోరో, మైత్రీమేతి నచోరతామ్॥

దొంగను దొంగవాడని బాగుగతెలిసికొని వానితో చేయబడు స్నేహము, అపకారముకాని యట్లు, ప్రారబ్ధము కల్పితము, తాత్కాలికము, ఈ ప్రపంచము తన దేహాదికము అనిత్యము, అవాస్తవమను నిశ్చయముతోడ జేయబడు అనుభవములయందు వాటివాటి ప్రాప్తాప్రాప్తములవలన జ్ఞాని అజ్ఞానిలాగున దుఃఖింపడు. భోగములతోడ సక్తతనొందక యథాప్రాప్తముగ అనుభవించుచుండును జిజ్ఞాసువు తానిప్పుడు అనుభవించుచున్న దేహేన్ద్రియాది ప్రపంచముయొక్క అనిత్య, అవాస్తవికత్వములను శాస్త్రీయముగ తెలిసికొని, అట్టి నిశ్చయముతోడ ననుభవించు ప్రారబ్ధ సుఖదుఃఖ భోగములు, భావి ప్రతిబంధములు కాజాలవని విద్యారణ్యముని యిట్లు తెలుపుచున్నారు. ఇట్టి అనుభవములు అగ్నిచే సంస్కరింపబడిన విత్తనములవలె, అంకుర శక్తి నశించినవగుచు, కేవలము భోగమునకు మాత్రము పనికివచ్చును. కనుక విద్వాంసుడు ప్రారబ్ధముననుసరించి, తాననుభవించవలసిన సమస్త సుఖదుఃఖ భోగములను, తాను చేయవలసిన సమస్త కర్మలను ధాన్యాదులను వేయించినట్లు, తన సంయమ జ్ఞానాగ్ని వలన ఆత్మవిచారమను సాధనముతోడ చేయగలిగినయడల అప్పుడే ప్రపంచానుభవములన్నియు, సంభ్రష్టబీజములవలె నంకురశక్తిని కోలుపోయి, అనగా నశించినవగుచు తనకు సంసారబంధ కారణములుగావు. వివేకులు ఇచట గ్రహించవలసిన రహస్యమేమియనిన, ఈ ప్రపంచము యిందలి యుపాధులన్నియును చిత్రవిచిత్రములుగ నుండి జీవునకు మోహము కలుగజేయుచు సంసారమును వృద్ధిపొందించుచుండును. సంసారమనగా జీవునకు జననమరణ ప్రవాహము, వారివారి కర్మఫలానుభవము నొందుటకుగాను కల్పితమై ప్రవాహరూపముగా నుండుటయే ఈ ప్రపంచము. ఈ ప్రపంచ మెందులకిట్లుండుచున్నదియనిన, జీవులుఅసంఖ్యా

కులు. వీరి(జీవుల)అవిద్యాకామకర్మలు అనాది. ఇట్లనాదిగా వచ్చుచున్న జీవులకర్మలు (కర్మఫలములు) నానాగా అనగా భిన్నభిన్నములుగ, చిత్ర విచిత్రములుగనుండును. ఇట్టి నానాచిత్ర విచిత్రకర్మఫలానుభవము లిచ్చుటకే సృష్టి చిత్ర విచిత్రములుగ కల్పింపబడుచుండును. ఈ విషయమునే (కర్మ వైచిత్ర్యాత్సృష్టివైచిత్ర్యమ్) అను వాక్యము తెలుపుచున్నది. మరియును నానావిధములగు ఈ సృష్టి వైచిత్ర్యములే జీవులకు వ్యామోహము కలిగించి సంసారకారణమగుచుండును. ఈ ప్రపంచమనగా నిట్టిదే కావున వివేకియగు మానవుడు అనగా విద్వాంసుడు స్వశరీర సర్వప్రపంచమును వివేకముతోడ తన ప్రారబ్ధ క్షయానుభవమునకు మాత్రమే ఉపయోగించుకొనుచు స్వశరీర జగన్మిధ్యాత్వ నిశ్చయము బాగుగనొంది, యీ సర్వమునకును, అధిష్ఠానమగునట్టి సత్యజ్ఞానానన్త లక్షణములుగల పరమాత్మను స్వాత్మాభిన్నమని స్వానుభవముతోడ గ్రహించవలయును. ఇట్టి నిత్య, నిర్వికార, స్వప్రకాశ, సర్వాధిష్ఠాన, అఖండ పరిపూర్ణ చిద్ఘనానందరూపమును, సాక్షాత్కార పర్యంతము స్వాత్మాభిన్నముగ మనన నిదిధ్యాసనాది సాధనములచే నభ్యసించుచుండవలయును. ఇది మోక్షప్రాప్తికి శీఘ్రఫలదాయకము; పరమముక్తికి సాక్షాన్మార్గము. ఈ మార్గము నవలంబించు సాధకునకు తెలిసికొనవలసిన మరియొక చిన్న రహస్యముగలదు. ప్రతి జీవునకును సుఖదుఃఖ ఫలానుభవమనునది తన ప్రారబ్ధ ఫలమునుబట్టియే కలుగుచుండునుగాని, యెంతటి దగ్గరబంధువులైనను, అనగా తండ్రీ కుమారులకుగాని, అన్నదమ్ములకుగాని, యెవరి ప్రారబ్ధము వారికే యుండునుగాని వారిని విడచియుండదు. ఇట్టి ప్రారబ్ధములను కాకతాళీయముగ, కలసి ఒకచోట అనుభవించుటవలననే యీ బంధుత్వ కల్పనలు కలుగుచున్నవిగాని వాస్తవమాలోచించిన అనగా పరమార్థ వాస్తవమున ఒకరి ప్రారబ్ధముతో మరియొకరికి నెట్టి సంబంధమును లేదు. కావున యీ సంబంధ బాంధవ్యములన్నియు, వ్యవహారకల్పిత వ్యవస్థా మాత్రము

లని, విద్వాంసులు గ్రహించి వారి వారి ప్రపంచానుభవములను శాస్త్ర వ్యవహార లోకమర్యాదా పరిపాలనకు లోపములేకుండ, సంబంధమును నదియే కల్పితమను పారమార్థిక దృష్టితో వ్యవహరించుచు, తమ ప్రారబ్ధ క్షయమును మాత్రము నొందుచుండుటయే పండిత లక్షణమని గ్రహించవలయును. ఇట్టి జ్ఞానముతోడ గావించు కుటుంబానుభవములకు లోపమేమియును కలుగదు. కాని జ్ఞానఫలము కలదు.

# కొన్ని నిర్వచనములు

**చైతన్య - జడ - నిర్వచనములు :—**

చైతన్య లక్షణం:— తనను తాను తెలిసికొనుచు, యెదటి దానిని తెలిసికొనునది అనగా తెలివి, జ్ఞానము. ఈ లక్షణము ఒక్క ఆత్మ పదార్ధమునకే యున్నది.

జడం :— తనను తాను తెలిసికొనక, యెదటి దానిని తెలిసికొన లేనిది— "జడం నామస్వవిషయ, పరవిషయ జ్ఞానశూన్యం, జడమిత్యుచ్యతే"

"నదృష్టేర్ద్రష్టారం పశ్యేత్", ప్రత్యగాత్మ యింద్రియములచే తెలిసికొనబడువాడుకాడు. ఏలనన, ఆయన స్వయంప్రకాశమానుడు. దేహాలీ దీపన్యాయములాగున, అనగా, గడపమీదనున్న దీపము, లోపలను బయటను ప్రకాశమిచ్చునట్లు, అంతర, బాహ్యేంద్రియాది విషయములను సదా ప్రకాశింపజేయుచుండును. ఈయనయే ప్రత్యగాత్మ: ఈయననే శ్రుతిమాత, "అయమాత్మా బ్రహ్మ" అని తెలుపుచున్నది. బ్రహ్మ, ఆత్మ, యనునవి పర్యాయపదములు. ఈయనయే సాక్షి. నిత్యుడు. స్వప్రకాశుడు. ఈయన అనగా సాక్షి స్వరూపభూతమగు, జ్ఞానమునకు యెప్పుడును లోపములేదు. సర్వదా ప్రకాశమానుడై యుండును. ఈయనయే సర్వసాక్షి. ఈ విషయమునే "నహిద్రష్టుః దృష్టేర్విపరిలోపో విద్యతే" అను శ్రుతివచనము తెలుపుచున్నది.

కర్మఫలములు 5.

ఉత్పత్తి, నాశము, ప్రాప్తి, వికారము, సంస్కారము. వీనిలో నేవియును జ్ఞానమునకు లేవు. ఏలనన, అది సిద్ధ వస్తువు.

స్వత్వం, అనగా యథేష్ట వినియోగ యోగ్యత్వమ్—

కర్త యనగా నిర్మించినవాడు లేక తయారుచేసినవాడు. స్వస్వామిత్వము గలవాడు.

భోక్తయనగా అనుభవించువాడు.

తంత్రము అనగా అనేకోద్దేశ్యేన సకృదనుష్ఠానం. (తంత్రం)

శ్లో॥ ప్రపంచోయదివిద్యేత, నివర్తేతన సంశయః।
మాయామాత్ర మిదంద్వైతం, అద్వైతంపరమార్థతః॥

ఈ బ్రహ్మాభ్యాసమును యెట్లు ఆచరించవలెననగా "రసనేవీదినే భుంక్తే భూయోభూయో యథాతథా", రసాయన ఔషధమును, ప్రతి నిత్యము నెట్లు దీర్ఘకాలము సేవించవలయునో, అట్లే మూలాజ్ఞాన నాశ పర్యంతము, నిత్య నిరన్తరముగ యీ ఆత్మానుసన్ధానమను రసాయన మును గూడ సేవింపవలయును. అప్పుడే దాని ముఖ్యప్రయోజనమును స్వస్వరూపలాభము నొందగలుగును.



# పంచదశి సంగ్రహ వాక్యములు

[ పంచదశి పేజి 272 ]

శ్లో॥ విక్షేపోయస్యనా_స్త్యస్య, బ్రహ్మవి_త్త్వం నమన్యతే।
బ్రహ్మైవాహమితి ప్రాహు,ర్మునయః పారదర్శినః ॥

ఎవనికి చిత్తవిక్షేపములేదో వానిని బ్రహ్మవే_త్తయనుటలేదు. వాడు పరబ్రహ్మయేనని మహర్షులు వచించిరి. శాస్త్రీయానుభవము, జీవునకు కలుగుచుండగా అది లేదనుశంక సరిగాదని, "నహిదృష్టేఽనుపపన్నం నామ", యను న్యాయము తెలుపుచున్నది. అనుభవమును బట్టి కూటస్థ చైతన్యమునకును, అవిద్యకును, తమః ప్రకాశములవలె విరోధము కనబడుటలేదు. ఇది అందరకును అనుభవమే. స్పష్టమును గూడ. అవిద్యకు విరోధి- వివేకము, ఆత్మజ్ఞానము. ఘటాకాశము, జలాకాశముచేత కప్పబడుతీరున, జీవునిచేత కూటస్థుడును, మరుగుపరచబడినవాడై అనగా కనబడకుండ జేయబడినవాడగుచుండును. ఇదియే అధ్యాస. ఈ అధ్యాసమునకు మూలావిద్యయే కారణము. దీనికి విరోధి విద్య. అనగా సదాత్మజ్ఞానము. ఇది కలుగువరకును కూటస్థుని స్వరూపము జీవునకు తెలియదు. ఇదియే అనాది అజ్ఞానము, అవిద్యయని శాస్త్రము తెలుపుచున్నది. జీవకూటస్థులకు, సంసారదశయందు భేద ప్రతీతి లేకుండుటయే, అజ్ఞానము. వెలుగువంటిది ఆత్మ; చీకటివంటిది అవిద్య; శుక్తికాస్థలమునందు భ్రాంతిచే కల్పితమైన పదార్థమునకు "వెండి" యను పేరు గలిగినట్లు ప్రత్యగాత్మయందు కల్పితుడైన చిదాభాసుని పేరు "అహం" నేను అని వ్యవహరింపబడుచున్నది. కాని పరమార్థమున ఇది బ్రహ్మచైతన్యమే. ఈ జీవుడు చేతనుడు. కాని

దేహేన్ద్రియాది సంఘాతము అచేతన పదార్థము. మరేమనిన ప్రకృతి ప్రాధాన్యముచేత, అచేతనములకును పాదానకారణము మాయయే. ఇదియే చిదాభాసరూపముచేత జీవులకు కారణమగును. అనగా జీవత్త్వము కల్పితము. మాయ. పరమార్ధ జీవుడు - వాస్తవుడు - బ్రహ్మే భిన్నుడని గ్రహించవలెను. దీనినిగురించి విపులముగ తెలిసికొనుటకు పంచదశి చిత్రదీప ప్రకరణములో 188 నుంచి 200 వరకు గల శ్లోకములను చూడవలయును.

(చిత్రదీప ప్రకరణము 210 వ శ్లోకము)

శ్లో॥ ముక్తిస్తు బ్రహ్మణస్తత్వం, జ్ఞానాదేవనచాన్యథా।
స్వప్రబోధం వినానైవ సస్వప్నోహీయతేయథా ॥

(పై శ్లోకము నుంచి 226 వ శ్లోకమువరకును సిద్ధాన్త దార్ఢ్యమును కోరువారు చూడనగును. Also 234 and 235, to 248) further చి-దీ-ప్ర-262 to 290.

శ్లో 269. గ్రంధి విచ్ఛేదమనగా—

శ్లో॥ నద్వేష్టిసంప్రవృత్తాని, ననివృత్తాని కాంక్షతి।
ఉదాసీనవదాసీన, ఇతి గ్రంథిభిదోచ్యతే ॥

అనగా జ్ఞానియగువాడు అప్రయత్నముగ లభించిన వానిని పరిత్యజించడు. లభింపనివానికై యాశపడడు. ఇంక ఏమిచేయుననగా ఏమియు పనిలేనివానివలె నూరక కూర్చుండును. చిదచిద్గ్రంథి వీడినవాని తీరిట్టిదియని శ్రీకృష్ణపరమాత్మ 14 అ, మందు తెలుపుచున్నారు. చి-దీ-ప్ర. శ్లో॥ 289.

శ్లో॥ జగచ్చిత్రం స్వచైతన్యే పటేచిత్రమి వార్పితమ్।
మాయయాత దుపేక్ష్యైవ, చైతన్యే పరిశేష్యతామ్ ॥

పటమునందున్న చిత్రమువలె మాయాకల్పితమైన యీ ద్వైత ప్రపంచము కల్పితము. కావున మిథ్యయని యీ నానాత్వదృశ్యమును నిరాకరించి, శుద్ధ చైతన్యము మాత్రమే మిగిలియున్నదని (అది తానే నని) సూక్ష్మదృష్టితో తెలియబడుగాక. బృ-శ్రుతి—

శ్లో॥ ఆత్మానంచే ద్విజానీయా, దయమస్మీతి పూరుషః ।
కిమిచ్ఛన్ కస్యకామాయ, శరీరమను సంజ్వరేత్ ॥

కఠ - శ్రుతి

"ఏకోవశీ సర్వభూతాంతరాత్మా,ఏకంరూపం బహుధాయఃకరోతి ।
"తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరా, స్తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్"

దీ-తృ-ప్ర-శ్లో 118

శ్లో॥ ఉపాయః పూర్వమే వోక్త స్తచ్చింతా కథనాదికః ।
ఏతదేక పరత్వేపి నిర్బంధో ధ్యానవన్నహి ॥

తా॥ ప్రత్యగభిన్నమగు పరమాత్మను ధ్యానించెడు విషయమున "తచ్చింతనం తత్కథన మన్యోన్యం" అనెడి శ్లోకంబున నుపాయము చెప్పబడెను. అట్టి పరబ్రహ్మనుగురించియే మాటలాడుచుండుట మొదలగునదియే యుపాయంబగును. ధ్యానమునందువలె నిదిధ్యసనమును జేయుటలో నియమము పనిలేదు. మూర్తి ధ్యానాదులయందు, చిత్త నిశ్చలత, ఏకాగ్రత యావశ్యకమగుచున్నది. అనగా చిత్త నిరోధ మావశ్యకము. కాని బ్రహ్మధ్యాసమున నిట్టి నిర్బంధములేదని,

శ్లో॥ కథనాదౌన నిర్బంధ శ్శృంఖలాబద్ధ దేహవత్ ।
కింత్వ నంతేతిహాసాద్యైర్వినోదో నాట్యవద్ధియః ॥

శ్లో॥ చిదేవాత్మా జగన్మిథ్యే త్యత్ర పర్యవసానతః ।
నిదిధ్యాసనవిక్షేపో నేతిహాసాది భిర్భవేత్ ॥ 123

శ్రుతి॥ తమేవైకం విజానథాత్మాన, మన్యావాచో విముంచథ, అమృతస్యైష సేతుః ॥ తా॥ అద్వితీయుండగు నా పరమాత్మనే తెలిసికొనుడు. అనాత్మ విషయకములగు నితర వ్యాపారములను విడిచిపెట్టుడు. మోక్షమునకు, బ్రహ్మసాక్షాత్కారము చెలియలికట్టవలె హద్దగుచున్నది మరియు "నానుధ్యాయాత్ బహూంఛబ్దాన్వాచో విగ్లాపనం హితత్" అనాత్మకములగు బహుశబ్దములను స్మరింపరాదు. అట్లు స్మరించుటవలన వాక్కునకు శ్రమయేగాని మరేమియు లాభము కలుగదు.

జ్ఞానులగువారుకూడ నెందులకు సంసారమున బ్రవర్తించుచుందురను శంకకు సమాధానము. "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" ప్రారబ్ధకర్మ అనుభవమువల్లగాని క్షయింపదని వచనము తెలుపుచున్నది. కావున ప్రారబ్ధక్షయమునకుగాను జ్ఞానులు సంసారమున ప్రవర్తించుచుందురని నెరుగవలయును.

**జ్ఞాని, అజ్ఞానులయొక్క (దృశ్య) సంసారదుఃఖ వైలక్షణ్యము :—**

శ్లో॥ వివేకేన పరిక్లిశ్య, న్నల్పభోగేనతృప్యతి ।
అన్యథానన్త భోగేఽపి నైవతృప్యతి కర్హిచిత్ ॥

జ్ఞానియగువాడు ఆత్మానాత్మ వివేకముచేత ప్రారబ్ధకర్మ క్షయింపలేదని సంతాపమునొందుచు, కామములేనివాడు గనుక స్వల్పసుఖముచేతనే సంతృప్తినొందుచుండును. అజ్ఞానికి కామము నశించకపోవుటచే ఎంతటి సుఖానుభవములచేత గూడ తృప్తి నొందజాలడు. కావున జ్ఞానియొక్క దుఃఖము వివేకమూలమైనదని గ్రహించవలెను.

శ్లో॥ నజాతుకామః కామానాముపభోగేన శామ్యతి ।
హవిషాకృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే ॥

తృ. దీ. ప్రకరణం, శ్లో॥ 164, 165 and 166

శ్లో॥ భర్జితానితు బీజాని, సంత్య కార్యకరాణిచ ।
విద్వదిచ్ఛాత థేష్టవ్యాఽసత్త్వ బోధాన్న కార్యకృత్ ॥

శ్లో॥ దగ్ధబీజ మరోహేఽపి, భక్షణాయోపయుజ్యతే ।
విద్వదిచ్ఛాఽప్యల్పభోగం, కుర్యాన్నవ్యసనం బహు ॥

శ్లో॥ భోగేన చరితార్థత్వా, త్ప్రారబ్ధం కర్మహీయతే ।
భోక్తవ్య సక్తతాభ్రాంత్యా వ్యసనం తత్రజాయతే ॥

తృ. దీ. ప్రకరణం 174 and 175 శ్లో॥

శ్లో॥ ఇంద్రజాల మిదంద్వైత, మచింత్య రచనాత్వతః ।
ఇత్య విస్మరతో హానిః, కావాప్రారబ్ధ భోగతః ॥

తా॥ అచిన్త్య రచనారూపమగుటవలన ద్వైతమంతయు, నింద్ర జాలమువలె, మిథ్యయను సంగతిని, గుర్తెరింగినవానికి, ప్రారబ్ధఫల మగు సుఖదుఃఖానుభవముచేత, జగన్మిథ్యా త్వానుసంధానమునకును, జగన్మిథ్యా త్వానుసంధానముచేత ప్రారబ్ధభోగమునకును హానిలేదు. ప్రారబ్ధ కర్మభోగంబును, జగన్మిథ్యాత్వజ్ఞానంబును, భిన్న విషయంబు లగుటవలన, భోగమునకు విషయములయొక్క సత్యత్వాపేక్ష లేదు. అనగా రెంటికిని విరోధములేదని భావము.

శ్లో॥ నిర్బంధస్తత్త్వ విద్యాయా, ఇంద్రజాలత్వ సంస్మృతౌ ।
ప్రారబ్ధస్యాగ్రహో భోగే, జీవస్య సుఖదుఃఖయోః ॥ 175

తా॥ తత్త్వజ్ఞానమునకు జగత్తు ఇంద్రజాలమువలె మిథ్యయగు నని తెలుపుటకు శక్తికలదుగాని ప్రారబ్ధకర్మ ఫలభోగమును నశింప జేయుటకు శక్తిలేదు ఇటులనే ప్రారబ్ధకర్మమునకు, జీవునకు సుఖ దుఃఖములనిచ్చుటయందు శక్తికలదు. గాని ద్వైతమునకు సత్యత్వ

మును సంపాదించెడి శక్తిలేదు. అనగా, తత్త్వజ్ఞానము, జగన్మిథ్యాత్వము విషయముగా గలది. ప్రారబ్ధకర్మ జీవునకు సుఖదుఃఖానుభవముల నిచ్చుట విషయముగాగలది. ఇట్లు రెండును భిన్నవిషయములు గలవి యగుటవలన, తత్త్వజ్ఞానమునకున్నూ, జగదనుభవమునకున్నూ పరస్పర విరోధములేదని భావము. జనులు ఇన్ద్రజాలము చూచునపుడుగాని, ఈ కాలములో చలన చిత్రపటములు జూచునపుడుగాని, అందలి వస్తువులను నశింపజేయకయే, అచటి వస్తువులుగాని, దృశ్య ప్రదర్శన సంఘర్షణములుగాని వాస్తవము (నిజము) గాదని తెలిసికొనుచు సుఖదుఃఖానుభవము (కించిత్తుగా) పొందుచున్నట్లు, జీవునిచే ననుభవింపబడునట్టి భోగ్య పదార్థములును, వాని యనుభవమును, మిథ్యయను జ్ఞానము యీ అభ్యాసకునకు కలుగుటకు సందేహము లేదు.

ఐతరేయశ్రుతి

"కోయమాత్మేతి వయముపాస్మహే, కతరస్స ఆత్మేతి ?

ఈ ఆత్మయెవడు ? ఎవనిని మేము పాసించవలెను ? ఆ యాత్మ యెటువంటివాడు ?

తృ. దీ. ప్ర. శ్లో. 213, 214, and 215

శ్లో॥ ఏకఏవాత్మామంతవ్యో, జాగ్రత్స్వప్న సుషుప్తిషు।
స్థానత్రయ వ్యతీతస్య, పునర్జన్మ నవిద్యతే ॥

అవస్థాత్రయమునం దాత్మయొక్కడే. 'నే' నవస్థాత్రయముల నంటనివాడనని, యెరింగినవానికి తిరిగి జన్మములేదు, మోక్షమేయగును.

215 శ్లో॥ త్రిషుధామసుయద్భోగ్యం, భోక్తాభోగశ్చ యద్భవేత్।
తేభ్యో విలక్షణస్సాక్షీ, చిన్మాత్రోఽహంసదాశివః ॥

213 శ్లో॥ జాగ్రత్స్వప్న సుషుప్త్యాది, ప్రపంచం యత్ప్రకాశతే।
తద్బ్రహ్మాహమితిజ్ఞాత్వా, సర్వబంధైః ప్రముచ్యతే ॥

(3)

జాగ్రత్స్వప్న సుషుప్త్యాది, ప్రపంచమును ప్రకాశింపజేసెడి బ్రహ్మమే నేను అని ఎరింగినచో సంసారబంధము నశించును అని కైవల్యోపనిషత్తు తెలుపుచున్నది. తా॥ అవస్థాత్రయమందునను అనుభవరూపమగు (జ్ఞానరూపమగు)నే భోగములుగలవో వాటి కన్నిటికం టె విలక్షణుడై నట్టి ఏ ప్రకాశరూపుడుగలడో ఆ సాక్షియగు పరమాత్మయే నేను, అట్టి నేనే నిత్యనిరతిశయానంద, మంగళస్వరూపుడనని, ముముక్షువు నిశ్చయము నొందవలయును. వివరము :— ఈ పై విధమున పరిశీలించగా తాను నిర్వికారుడనియు, వికారముగల చిదాభాసునికే కర్తృత్వ భోక్తృత్వములనియు స్పష్టపడగలదు. తదుపరి శాస్త్రీయానుభవముచే యీ చిదాభాసుడు మిథ్యారూపుడగును. ఇట్టి జ్ఞానము కలిగిన యడల, మిథ్యారూపుడగు చిదాభాసుడు, తన కర్తృత్వాదులు ఆభాసమాత్రములని తెలిసికొనును. కనుక అపరోక్షజ్ఞానికి వాస్తవమున శరీరము లేనేలేదు.

ఇట్లు తెలిసికొనిన చిదాభాసుడు (వ్యావహారిక జీవుడు) మోక్షకాంక్షచే కూటస్థైక చింతనముగలవాడై యుండును. ఎట్లన :—

శ్లో॥ యౌవరాజ్యేస్థితో రాజపుత్ర స్సామ్రాజ్య వాంఛయా ।
రాజానుకారీభవతి తథాసాక్ష్యను కార్యయమ్ ॥

తా॥ యువరాజు రాజ్యమునుగోరి, రాజును అనువర్తించునట్లు చిదాభాసుడు, మోక్షకాంక్షచే సర్వదా కూటస్థైకచింతనము గలవాడై యుండును. తదుపరి బ్రహ్మత్వమును బొందును. ఇట్టివారిని గూర్చి—

కూటస్థ ఆభాసులవివరణము

శ్రుతి. సహయోహవై తత్పరమం, బ్రహ్మవేద బ్రహ్మైవభవతి నాస్యాఽబ్రహ్మవిత్కులే భవతి, తరతిశోకం, తరతిపాప్మానం, గుహాగ్రంథిభ్యో విముక్తోఽమృతోభవతి''.

**తా॥** ఆ పరబ్రహ్మము నెవడెరుగునో **వాడే పరబ్రహ్మమగును.** లేదా బ్రహ్మవిదుని కులమందు బుట్టును. దుఃఖమును దాటును. పాప విముక్తుడగును ప చకోశ రూపగుహలవలనను, కామక్రోధాది రూప హృదయ గ్రంధులవలనను విముక్తుడగుచు అమృతరూపుడగుచున్నాడు. అని పై శ్రుతివచసము స్పష్టముచేయుచున్నది. కావున శ్రుతిని **తాను** నమ్మి తాను బ్రహ్మమును తెలిసికొనును. ఉభయాత్మకుడగు చిదాభాసుని ప్రారబ్ధభోగము కొంతకాలమునకుగాని ఉపశమింపదు. **అట్టితరి** యెప్పుడైనను 'నేను' మనుజుడను అనిగూడ తలపవచ్చును. ప్రారబ్ధఫల **మును**బట్టి అట్టి భ్రాంతి ఒకవేళ కలిగినను **తాను** సంపాదించిన తత్త్వ జ్ఞానము నశించదు. ఏలనన, తత్త్వజ్ఞానముచేత భ్రాంతిజ్ఞానము నశిం చును. యథార్థజ్ఞానముచే భ్రాంతిజ్ఞానము నశించుట స్వభావము. ఇది వస్తు స్వభావము, చిదాభాసత్వమున్నంతకాలము ప్రారబ్ధకల్పితమగు ఉపాధి ధర్మములు విడువవు.

చిదాభాస నిరూపణము

కూ. దీ. ప్ర. శ్లో॥ 32 and 33 పంచదశి

శ్లో॥ ఈషద్భాసనమాభాసః, ప్రతిబింబస్తథావిధః ।
బింబలక్షణ హీనస్సన్, బింబవద్భాసతె సహి ॥

తా॥ ఆభాసమన ఇంచుక ప్రకాశించునది. అదియే ప్రతిబింబము. అట్టిది బింబలక్షణములేకనే, బింబమువలె భాసించును. కావున ప్రతిబింబ మనినను, చిదాభాసుడనినను, నొక్కటియే. ఆ చిదాభాస చైతన్యమే అవచ్ఛిన్న చైతన్యమనబడును. ఇది పరిభాషమాత్రము. ఈ విషయ మును గురించి విపులముగ తెలియుటకు, పం, కూ, దీ, శ్లో॥ 43 to 48 వరకు జూడవలెను.

౩౩ శ్లో॥ నసంగత్వ వికారాభ్యాం, బింబలక్షణ హీనతా ।
స్ఫూర్తి రూపత్వమేతస్య, బింబవద్భాసనం విదుః ॥

తా॥ బింబలక్షణము లేనిదగుచు, బింబమువలె ప్రకాశించునది ప్రతిబింబము. ప్రతిబింబము దర్పణగత మాలిన్య ధర్మముల జెందును. ఉత్పత్తి, లయ, వికారముల జెందునుగనుక బింబలక్షణములు దాని యందు లేవు. ప్రకాశించుటయే బింబముతో పోలిక, కాని మరి అన్ని లక్షణములయందును గాదు. ఆభాసమనిన నదియే.

42 శ్లో॥ నాహం బ్రహ్మేతి బుద్ధ్యేత, స వినాశీతిచేన్నతత్ ।
సామానాధి కరణ్యస్య, బాధాయామపిసం భవాత్ ॥

తా॥ నశించెడి జీవుడు, నశింపని బ్రహ్మమే నేనని యనుకొనుట విరుద్ధముగాదాయని శంకించవలదు. నేను బ్రహ్మము ననగా నా యొక్క కర్తృత్వస్వరూప మసత్యము. నా నిజరూపము బ్రహ్మమేనని భావము. దీనిని బాధా సామానాధికరణ్యమని భావింతురు. దీని వివరణము :— "స్థాణుః పురుషః" "స్థాణురేషపుమాన్" స్థాణువుగ దోచునది పురుషుడు అను వాక్యమందు పురుషత్వబుద్ధిచేత స్థాణుత్వబుద్ధి నశించుచున్నది. ఇది సామానాధికరణ్యము యొక్క బాధార్థమందు దృష్టాంతమగును. దీనినే బాధా సామానాధికరణ్యమందురు. ఇట్లే "అహం బ్రహ్మాస్మి' అనెడి బోధచేత, నేను కర్తననెడి సంసారబుద్ధి (పరిచ్ఛిన్న అహంబుద్ధి) నివర్తించుచున్నది. ఇట్లే "సర్వం ఖల్విదం బ్రహ్మ" "సర్వం హ్యేతద్బ్రహ్మ", అను శ్రుతివాక్యములందు సర్వము బ్రహ్మయనునపుడు సర్వమనునది యసత్యము. బ్రహ్మయనునది సత్యము, నిజము నని యెట్లు గ్రహించవలెనో అట్లే నేను బ్రహ్మను యనునపుడు, పరిచ్ఛిన్నత్వ కర్తృత్వాదికములతో గూడిన, నేను అనునది అసత్యము. బ్రహ్మమనునదియే నిజము-అదియే నేనని గ్రహించవలయును. అద్వైత సిద్ధాన్తానుసారము జగత్తంతయు బ్రహ్మయందు భ్రమచే కల్పితమై

భాసించుచున్నది. ఇది ఒప్పుకున్నప్పుడు, చిదేకదేశ భూతుడగు చిదాభాసుడు బ్రహ్మమగు కూటస్థునియందు, కల్పితుడనుటకు సంశయమేల? అనగా సంశయింపతగినది కాదు.

బ్రాంతికారణము :—

బుద్ధి ఎట్టిది ? చిదాభాసుడెవడు ? ఆత్మయననెట్టిది ? ప్రపంచమునకు వాస్తవరూపమెట్టిది? ఈ సంసారదుఃఖమెందులకు కలుగుచున్నది ? ఎవరికి ? దీనికి అత్యంతనివృత్తి ఎట్లుకలుగును ? అని విచారించినయడల యిది అంతయు, చిదాభాసుని అజ్ఞానమువలననేయని నిశ్చయమగును. చిదాభాసుడే కల్పితుడగునపుడు అతని అజ్ఞానముగూడ కల్పితమేగదా యగును. కావున బుద్ధి మొదలగునవి తనకంటె వేరనియు, మిథ్యామాత్రములనియు గ్రహించిన మహనీయుడే తత్త్వవిదుడు అతడే ముక్తుడు. అనగా తత్త్వజ్ఞానమే సంసారానర్థ నివర్తకమని, నిశ్చయముగ తెలిసికొనవలయును. కూటస్థుడు, శివుడు, ప్రత్యగాత్మ యనునవి పరమాత్మకు పర్యాయపదములు. వివరణము :— జీవత్త్వమును, ఈశ్వరత్త్వమును లేని, నిర్వికారమగు స్వప్రకాశ పరిపూర్ణచైతన్యమే పరమాత్మ, శివుడు, కూటస్థుడు, ప్రత్యగాత్మయను శబ్దములచే తెలియబడునది. ఇది అద్వితీయ, అఖండ, స్వప్రకాశ, స్వాత్మాభిన్న పరిపూర్ణ సర్వాధిష్ఠాన, అఖండచైతన్యము- బ్రహ్మయని గ్రహించవలయును. స్వాత్మరూపుడగు కూటస్థుడు, అసంగుడు, నిర్వికారుడు, బంధమోక్ష రహితుడు, ఆత్మానన్యుడు, స్వప్రకాశ పరిపూర్ణ, సర్వాధిష్ఠానమిదియేనని, ఇదియే నేను అనుప్రతీతికి పరమ అర్థమని, యిదియే తానని, సర్వదా ముముక్షువు మననానుసన్ధానాదుల జేయుచుండవలయును. స్థూల సూక్ష్మ శరీరములకు సంబంధించిన కర్తృత్వ భోక్తృత్వాది సర్వసుఖ దుఃఖ వ్యవహారములు చిదాభాసునకేగాని, పరమార్థమున, ప్రత్యగాత్మ స్వరూపుడగు తనకు వీనితో నెట్టి వాస్తవసంబంధములేదని ముముక్షువులు నిశ్చయము నొందవలయును. ఈ విషయమునే :—

శ్లో॥ ననిరోధో నచోత్పత్తి, ర్నబన్ధో నచ సాధకః ।
నముముక్షుర్నవై ముక్త, ఇత్యేషాపరమార్థతా ॥

అను వచనము తెలుపుచున్నది. దీనినిబట్టి ఒక్క ఆత్మయే వాస్తవము. ఈ బంధమోక్షములు జీవకల్పితములని గ్రహించవలెను. ఈ కూటస్థుడు లేక ప్రత్యగాత్మ ఎల్లప్పుడును ప్రకాశించుచుండు నిత్యముక్తుడు. మోక్షబంధములు, చిదాభాసునికే. కాని యిచట బోధకొరకు కూటస్థ చిదాభాసులకు తాదాత్మ్యాధ్యాసము అనుభవమునుబట్టి ఉన్నట్లుగ కల్పింపబడినదేగాని వాస్తవమున కూటస్థునకు అధ్యాసయనునదియే లేదు. జ్ఞానాభ్యాసకుడు యిట్లు నిశ్చయముగ తెలిసికొని తన పరమార్థ స్వరూపమగు కూటస్థాత్మను, స్వాత్మాభిన్న, నిత్య నిర్వికార, పరిపూర్ణ చైతన్య స్వరూపముగ ధ్యానించుచుండవలయును.

ధ్యా. దీ. ప్రకరణము. శ్లో॥ 44

శ్లో॥ శమాద్యైః శ్రవణాద్యైశ్చ,యత్రతత్రో దితైఃక్షయమ్ ।
నీతేఽస్మిన్ ప్రతిబంధేఽతస్స్వస్య బ్రహ్మత్వ మశ్నుతే॥

తా॥ శ్రవణమననాదులచేత, వర్తమాన ప్రతిబంధము నశించిన తోడనే "నేను బ్రహ్మను" అని స్వస్వరూపమును సాక్షాత్కరించుకొనుచున్నాడు.

విజ్ఞానమునకు, ఉపాసనకుగల భేదము

బోధ, వస్తుతంత్రము, ఉపాసన కర్తృతంత్రము. ఈ విషయమునే "వస్తుతంత్రో భవేద్బోధః, కర్తృతంత్ర ముపాసనమ్", అని విద్యారణ్యులు తెలుపుచున్నారు. వివరణ :— బోధ, వస్తుయాథార్థ్యమును గనబరచును. ఉపాసన, శాస్త్రవిధియందు విశ్వాసముతో భావించుట. ఎట్లన, సాలగ్రామమును జూచి యిది శిలయని గ్రహించుట-జ్ఞానము, బోధ. ఆ సాలగ్రామమునే మహావిష్ణువని భావించుట ఉపాసనయగును. బోధ కలుగుటెట్లనిన :—

శ్లో॥ విచారాజ్జాయతే బోధోఽనిచ్ఛాయం ననివర్తయేత్ ।
స్వోత్పత్తిమాత్రా త్సంసారే దహత్యఖిల సత్యతామ్ ॥

అనగా వస్తు తత్త్వవిచారమువలన జ్ఞానము కలుగును. ఆజ్ఞానము అక్కరలేదను నిచ్ఛగలిగినను, కలిగిన జ్ఞానమును, ఆయిచ్ఛ నివారింపచేయజాలదు. అట్టి జ్ఞానము కలిగినతోడనే ప్రపంచము అసత్యమని తోచును. అపుడు జిజ్ఞాసువు, పంచదశి, ధ్యా, దీ, ప్ర, శ్లో 76,

శ్లో॥ తావతాకృత కృత్యస్సన్నిత్య తృప్తి ముపాగతః ।
జీవన్ముక్తి మనుప్రాప్య ప్రారబ్ధ క్షయమీక్షతే ॥

అనగా తత్త్వజ్ఞానము కలుగగనే, కృతకృత్యుడగుచు, కైవల్యము కొరకు, ప్రారబ్ధమెప్పుడు తీరునాయని చూచుచుండును.

నిర్గుణ బ్రహ్మోపాసన యొక్క శ్రేష్ఠత :—

శ్లో॥ యావద్విజ్ఞాన సామీప్యం, తావచ్ఛ్రైష్ఠ్యం వివర్ధతే ।
బ్రహ్మజ్ఞానాయతే సాక్షా న్నిర్గుణోపాసనం శనైః ॥

అనగా వృత్తి నిర్గుణ బ్రహ్మ సాక్షాత్కారమునకు ఎంత సమీపించునో, అంత శ్రేష్ఠ్యము ఘటించును. నిర్గుణ బ్రహ్మోపాసనా వృత్తి.బ్రహ్మజ్ఞానమునకు అతిసన్నిహితముగాన బ్రహ్మజ్ఞానమువంటిదే యగును. వృత్తివలన యీ అసంగాత్మ వస్తువును మాటిమాటికి భావించుచుండగా తత్త్వమస్యాది వాక్యబోధవలన "అహం బ్రహ్మాస్మి" యనెడి పరతత్త్వ జ్ఞానము కలుగును.

శ్లో॥ నిర్వికారాసంగనిత్య, స్వప్రకాశైక పూర్ణతాః ।
బుద్ధౌఝడితి శాస్త్రోక్తా ఆరోహంత్య వివాదతః ॥

తత్త్వజ్ఞానము (అనగా) బ్రహ్మ సాక్షాత్కారము (గౌణము)

కలుగగనే వేదాన్తశాస్త్రమందు జెప్పబడిన ఆత్మధర్మములగు నిర్వి కారిత్వ, అసంగత్వ, నిత్యత్వ, స్వప్రకాశత్వ, అద్వతీయత్వ, పరి పూర్ణత్వములనునవి, బుద్ధియందు నిర్వివాదముగను శీఘ్రముగను కలు గును. ఇట్లెవనికి స్వసాక్షికత్వము స్ఫురించునో, వాడే బ్రహ్మవిదుడు, ఇట్టివానికి నిర్గుణ బ్రహ్మను సన్ధానము ఉపేక్షింపతగినది గాదని,

శ్లో॥ ఉపేక్ష్యత త్తీర్థయాత్రా, జపాదీనేవ కుర్వతామ్ ।
పిండం సముత్సృజ్యకరం, లేఢీతిన్యాయ ఆపతేత్ ॥

నిర్గుణోపాసననువదలి, తీర్థయాత్రా జపాదులగావించువారు, చేతిలోని వెన్నముద్దను పారవైచి, వట్టి చేతిని నాకునటువంటి, అవివేకు లని భావము.

ఆత్మవిచారాధికారు లెవరనిన—

శ్లో॥ అవ్యాకులధియాం మోహ, మాత్రేణాచ్ఛాది తాత్మనామ్।
సాంఖ్యనామా విచారఃస్యాన్ముఖ్యో ఝుడితి సిద్ధిదః ॥

స్థిరచిత్తులై కర్తృత్వాది భ్రమమాత్రము కలవారు బ్రహ్మ సాక్షాత్కారమునకు ముఖ్యసాధనమైనట్టి సాంఖ్యమను పేరుగల బ్రహ్మ విచారమొనరింపవలయును. ఇచట సాంఖ్య శబ్దమునకు తత్త్వం పదార్థ విచారమని యర్థము. ధ్యా. దీ. ప్ర. శ్లో॥ 139.

శ్లో॥ నిత్యనిర్గుణరూపం, తన్నామమాత్రేణ గీయతామ్ ।
అర్థతోమోక్ష ఏవైష, సంవాది భ్రమవన్మతః ॥

తా॥ నిర్గుణోపాసనయని పేరేకాని యిది సంవాదిభ్రమవతె మోక్షమేయగును. మోక్షమనినను, బ్రహ్మప్రాప్తియన్నను నొక్కటియే. సగుణోపాసనము చేసినవానికి, యీశ్వరానుగ్రహమువలన, నిర్గుణో పాసనా సామర్థ్య మెట్లుకలుగునో, అట్లే, నిర్గుణోపాసకునకు బ్రహ్మ సాక్షాత్కారము కలుగును. నిర్గుణోపాసనకు మోక్షము ఫలమని

"సోఽకామోనిష్కామ ఆప్తకామ ఆత్మకామో నతస్య ప్రాణా ఉత్క్రామంత్య త్రైవసమవలీయన్తే", "బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి", అని శ్రుతి వాక్యము తెలుపుచున్నది. మరి "నాన్యః పన్థావిద్యతేఽయనాయ" యను శ్రుతి నిర్గుణోపాసనముకంటె, నన్యమగు సాక్షాన్మోక్ష సాధనము లేదని గూడ తెలుపుచున్నది. విద్యారణ్యులునూ :—

శ్లో॥ ఇహవామరణేవాస్య, బ్రహ్మలోకేఽథవాభవేత్ ।
బ్రహ్మ సాక్షాత్కృతిస్సమ్య గుపాసీనస్య నిర్గుణమ్ ॥

అని స్పష్టముచేయుచున్నారు.

ఆత్మబోధ - పంచదశిలోని బ్రహ్మానుసన్ధానము

శ్లో॥ అనుభూతే రభావేఽపి, బ్రహ్మాస్మీత్యే వచింత్యతామ్ ।
అప్యసత్ప్రాప్యతే ధ్యానా న్నిత్యాప్తం బ్రహ్మకింపునః ॥

తా॥ శరీరాభిమానము వదలి తన బుద్ధిచేత మనస్సునందే ఆత్మవిచారముచేసికొని బ్రహ్మ సాక్షాత్కారము నొందవలెను. ధన మపేక్షించువాడు, యెట్లు నిధిపైనుండు రాతిని దీసి, భూమిని తవ్వి, యందలి ధనమును గ్రహించునో అటులనేనని యభిప్రాయము. మరి యును, బ్రహ్మానుభవము లేకపోయినను, నేనే బ్రహ్మనని ధ్యానింప వలెను. ధ్యానమువలన,కానిది సయితము లభించును. అట్టితరి స్వస్వరూప మగు బ్రహ్మము లభించునని వేరుగ జెప్పపనిలేదు. లభించియే తీరునని భావము.

శ్లో॥ దేహాభిమానం విధ్వస్య, ధ్యానాదాత్మానమద్వయమ్ ।
పశ్యన్మర్త్యోఽమృతోభూత్వా, హ్యత్ర బ్రహ్మ
సమశ్నుతే ॥

తా॥ స్వాత్మాభిన్న బ్రహ్మధ్యానము చేయువానికి దేహాభిమానము తొలగును. బ్రహ్మ సాక్షాత్కారము కలుగును. అమృతరూపుడై యీ జన్మమునందే ముక్తుడగును.

నా. దీ. ప్ర శ్లో॥ 1

శ్లో॥ పరమాత్మా వ్యయానందః,పూర్ణః పూర్వం స్వమాయయా।
స్వయమేవ జగద్భూత్వా, ప్రావిశజ్జీవ రూపతః ॥

ఇది ఎట్లనిన :— అజ్ఞానులకు బోధార్థము—

"అధ్యారోపాప వాదాభ్యాం, నిష్ప్రపంచం ప్రపంచ్యతే ।
శిష్యాణాం బోధసిద్ధ్యర్థం, తత్త్వజ్ఞైః కల్పితక్రమః ॥

అను వాక్యన్యాయముచొప్పున "సదేవసౌమ్యేదమగ్ర ఆసీత్", "ఏకమే వాద్వితీయం" "విజ్ఞాన మానన్దం బ్రహ్మ" "పూర్ణ మదః పూర్ణ మిదం" "మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహే శ్వరం", "అనేనజీవేనాత్మ నానుప్రవిశ్య", అను శ్రుతులు తెలుపు చున్నవి. కావున నిర్విశేషంబును, సత్యజ్ఞానానన్ద స్వరూపంబునగు బ్రహ్మ అనిర్వచనీయమగు మాయయొక్క సహాయంబున జగత్తును సృజించి, అందు మాయావశంబుననే తానే జీవుడై ప్రవేశించెను. దీని వివరణము : ఆత్మ యొక్కడైనను ఉత్తమోపాధులయందు ప్రవేశించి దేవత యగును. అల్పోపాధులయందుండుటచే దేవత నుపాసించువాడగును. అనేక జన్మలయందు ఈశ్వరారాధన చేయుటచే ఆత్మవిచారమునందిచ్ఛ గలుగును. విచారముచేయగా మాయ నశించును. మాయ నశింపగా ఆత్మస్వరూపమగు తాను శేషించును. ఇది నిర్విశేషము. ఈ విషయ మును "తద్బ్రహ్మాహమితి జ్ఞాత్వా సర్వబంధైః ప్రముచ్యతే" యను శ్రుతి తెలుపుచున్నది.

శ్లో॥ అద్వయానన్దరూపస్య, సద్వయత్వంచ దుఃఖితా।
బంధః ప్రోక్త, స్స్వరూపేణ, స్థితిర్ముక్తిరితీర్యతే ॥

తా॥ అద్వితీయమగు ఆత్మకు "నేను" సద్వితీయుడను, దుఃఖిని అనుకొనుటయే బంధము. ఇట్టి భ్రమ తొలగి స్వస్వరూపమునందుండు

టయే మోక్షము. కావున బ్రహ్మ విచారముచేయనందున బంధము కలుగును. ఆ బంధము ఆత్మవిచారముచేత నివర్తించును. కావున, జీవాత్మ పరమాత్మ, తత్త్వవిచారము సర్వదా ముముక్షువులు చేయుచుండవలయును. ఈ అర్థమునే

శ్లో॥ అవిచారకృతో బంధో, విచారేణ నివర్తతే ।
తస్మాజ్జీవ పరాత్మానౌ, సర్వదైవ విచారయేత్ ॥

అను శ్లోకముతో శ్రీ విద్యారణ్యులు తెలుపుచున్నారు. ఆత్మ రూపమగు సాక్షి నిష్క్రియుడై తన స్వప్రకాశస్థితిమాత్రమున పని చేయువానిని, పనిని, శబ్దాది విషయములను ఒకేసారిగ ప్రకాశింపజేయుచుండును. ఇదియే సాక్షి చైతన్యమనబడును.

పంచదశి పేజి 219 పరోక్షాపరోక్ష జ్ఞానములు—

శ్లో॥ అస్తిబ్రహ్మేతి చేద్వేద, పరోక్షజ్ఞానమేవతత్ ।
అహంబ్రహ్మేతి చేద్వేద, సాక్షాత్కారస్స ఉచ్యతే ॥

ఘటాకాశము, జలాకాశముచే గప్పబడిన తీరున, జీవునిచేత కూటస్థుడును గ్రమ్మబడియున్నాడు. చిదాభాసుడనెడి జీవుడెన్నడును, కూటస్థుడు తనకంటె వేరుగ నున్నట్లెరుగడు. ఇట్లనాదికాలమునుంచి నెరుగకపోవుటే అజ్ఞానము, అవిద్యయని చెప్పబడుచున్నది. సాక్షియగు కూటస్థుడు స్వయం ప్రకాశమానుడు.

శ్రీ శంకరులు ఆత్మనిర్గుణాను సన్ధానమును ఆత్మబోధలో నిట్లు తెలుపుచున్నారు :

ఆత్మకు సుషుప్తియందు మనస్సు మొదలగునవి యేమియును లేవు. ఆత్మ మాత్రమే యున్నది, ఆ దశయందందరకును సుఖానుభవమున్నది. అందువలన ఆత్మ నిత్యానన్దస్వరూపుడు, పరిపూర్ణుడు, అని

మననము చేయవలసినదిగానున్నది. సిద్ధులయొక్క అనుభవము సాధకులకు అభ్యసనీయము. కావున శంకరులు అభ్యాసకులనుద్దేశించి వారి యనుభవము నిట్లు తెలుపుచున్నారు :

శ్లో॥ నిత్యశుద్ధ విముక్తైక, మఖండానన్ద మద్వయమ్ ।
సత్యం జ్ఞానమనన్తంచ, యత్పరం బ్రహ్మమేవతత్ ॥

శ్లో॥ ఏవం నిరంతరకృతా బ్రహ్మైవాస్మీతి వాసనా
హరత్య విద్యా విక్షేపాన్ రోగానివరసాయనమ్ ॥

తా॥ సర్వోత్తమమైన రసాయనౌషధమును సేవించుటచే వ్యాధులు నశించునట్లు, అభ్యాసకులెల్లప్పుడునూ నేను బ్రహ్మయేకాని, తద్వ్యతిరిక్తముకానను అభ్యాసము జేయుటవల్లకలుగు సంస్కారరూపమైన సద్వాసన- ఆవరణ, విక్షేపశక్త్యాత్మకమైన అవిద్యను, సమూలముగ పోగొట్టునని నిశ్చయముగ నమ్మవచ్చును. అని శ్రీ శంకరభగవానులు తెలుపుచున్నారు.

కృతకృత్యతనుగురించి వశిష్ఠ మహాముని యిట్లు తెలుపుచున్నారు :

శ్లో॥ హృదయాత్సం పరిత్యజ్య, సర్వమేవ మహామనాః ।
య స్తిష్ఠతి గతవ్యగ్రః, సముక్తః పరమేశ్వరః ॥

శ్లో॥ సమాధిమథకర్మాణి, మాకరోతు కరోతువా ।
హృదయేనాస్త సర్వాశో, ముక్తఏవోత్త మాశయః ॥

శ్లో॥ నైష్కర్మ్యేణ నతస్యార్థః, తస్యార్థోఽపి నకర్మభిః ।
న సమాధాన జప్తాభ్యాం, యస్య నిర్వాసనం మనః ॥

శ్లో॥ విచారితమలం శాస్త్రం, చిరముద్గ్రాహితం మిథః ।
సంత్యక్తవా సనాన్మౌనా, దృతే నాస్త్యుత్తమం పదమ్ ॥

**సమష్టి తాత్పర్యార్థము :—**

(1) ఏ పురుషుడు సర్వవిషయములను మనస్సులోనించి తొలగించి (అనగా సకల విషయములు మిథ్యయను నిశ్చయముతోడ వాటి యందు సంకల్ప వర్జితుడై) నిర్విచారముగ నుండునో యా పురుషుడే ముక్తుడనియు. పరమేశ్వరుడని గూడ జెప్పబడును.

(2) కృతకృత్యుడగు పురుషుడు మనస్సుచేత సర్వపదార్థములయం దాశను (జ్ఞానపూర్వకముగ) విడచియున్నందున అట్టివాడు సమాధినిగాని, కర్మలనుగాని చేసినను, చేయకపోయినను ముక్తుడే.

(3) ఎవనియొక్క మనస్సు నిర్వాసనమై యుండునో అతనికి కర్మ సన్యాసముతోగాని, కర్మల ననుష్ఠించుటచేగాని, సమాధితోగాని, మంత్రజపములతోగాని, ప్రయోజనములేదు. అనిచెప్పి యింకను యిట్లు తెలుపుచున్నారు :

(4) సమస్తశాస్త్రములు, మాచేత, సమగ్రముగ నిపుణముగా విచారింపబడినవి. సమానులగు పండితులతో చేరి పరస్పరము బోధింపబడినవి. ఎన్ని విధములచే శాస్త్రములను పర్యావలోచన చేసినా, వాసనాపరిత్యాగ పూర్వకముగ జేయబడు బ్రహ్మవిచారము కంటె, మరియొక శ్రేష్ఠమైన సాధనము గనుబడలేదు అని తెలుపుచు, వాసనామయమగు యీ సంసారము శాంతించు బోధను చేయుచున్నారు.



# శ్రుతివాక్య మంజరి

కఠ. శ్రుతి : "సమృత్యు మాప్నోతి ఇహ నా నేవపశ్యతి", ఎవడిచట నానాత్వమును జూచుచున్నాడో, యతడు మరణ పరంపరను బొందును.

శ్రు॥ "మనసై వేదమా ప్తవ్యం, నేహ నానా స్తికించన" యథా కర్మ యథాశ్రుతమ్"; శ్రుతి॥ వాయుర్య థై కోభువనం, ప్రవిష్టో రూపం రూపం ప్రతిరూపోబభూవ", ఏక స్తథా సర్వభూతా న్త రాత్మా రూపం రూపం ప్రతిరూపో బహిశ్చ", రూపరహితమగు, స్పర్శలక్షణము గల వాయువు ఒక్కటేయైనను, ప్రాణవాయు రూపమున సకల దేహములందున ప్రవేశించి ఆయా రూపములను బొందుచున్నది. అట్లే అద్వితీయమగు పరమాత్మ సకల శరీరములందునను బ్రవేశించి యనేక రూపముల భాసించుచున్నదిగాని స్వయముగ నిర్వికారము. శ్రుతి॥ "హృదా మనీషా మనసాభిక్లుప్తో య ఏతద్విదు రమృతా స్తే భవ న్తి", నిస్సంకల్ప, నిశ్చలమగుబుద్ధిచే, ఆత్మస్వరూపమును మననముజేయుట చేత నయ్యది, యభి ప్రకాశితమగును. ఇట్లాత్మను తెలిసికొనినవారు అమృత త్త్వమును బొందుదురు. శ్రుతి॥ "అ స్తీత్యేవోప లబ్ధవ్య స్త త్త్వ భావేన చోభయోః। అ స్తీత్యేవోప లబ్ధస్య, త త్త్వభావః ప్రసీదతి", సోపాధిక నిరుపాధిక బ్రహ్మముగలదను భావమున్నపుడే ఆత్మోపలబ్ధి కాగలదు. అ స్తిత్వభావోప లబ్ధిచే, నిర్గుణ పరబ్రహ్మము ప్రసన్నమగును. శ్రుతి॥ "మృత్యుర్యస్యోప సేచనం", అట్టి మహనీయునకు మృత్యువుగూడ, భోజనమునందు శాకప్రాయమగును.

మనన నిర్వచనము —శ్రుతస్యార్థస్యోపప త్తి భిశ్చి న్తనమ్-మననం "తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛే త్సమిత్పాణిః "శ్రోత్రియం

బ్రహ్మనిష్ఠం'', "ఏకోదేవః, సర్వభూతేషు గూఢః । సర్వవ్యాపీ, సర్వభూతాన్తరాత్మా । కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః, సాక్షిచేతాకేవలో నిర్గుణశ్చ'' "జ్ఞానీచ విశిష్యతే'' "జ్ఞానీత్వాత్మైవ, మేమతమ్", "నకర్మణా నప్రజయాధనేన త్యాగేనైకే, అమృతత్త్వ మానశుః", ''యస్మాత్పరం నాఽపరమస్తి కించిద్యస్మాన్నాణీయో, నజ్యాయోఽస్తి కశ్చిత్, ''వృక్ష ఇవ స్తబ్ధోదివి తిష్ఠత్యేకస్తేనేదం, పూర్ణం, పురుషేణ సర్వమ్", "యో వేదనిహితం గుహాయాం, పరమే వ్యోమన్, సోఽశ్నుతే సర్వాన్కామాన్ సహ", "నతస్య ప్రాణా ఉత్క్రామన్తి, బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి", "భిద్యతే హృదయగ్రంథిః ఛిద్యన్తే సర్వసంశయాః", "క్షీయన్తే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే". అనగా (పరావరుడనగా బ్రహ్మము, ఆ బ్రహ్మము నేనేయని తెలిసికొనిన మహనీయుల కిట్టి ఫలము) ఛాందోగ్య శ్రుతి, సుషుప్తియందు, "అంధస్సన్ననంధో భవతి", ఇట్లే రోగి మొదలగు బాధితులు. శ్రుతి॥ "విద్వాన్ భవతే నాతివాదీ", కఠ శ్రుతి॥ అవిద్యాయా మన్తరేవర్తమానాః । స్వయం ధీరాః పండితం మన్యమానాః । దన్ద్రమ్యమాణాః పరియన్తిమూఢాః । అంధేనైవనీయ మానా, యథాన్ధాః ॥

కఠ శ్రుతి. నసాంపరాయః ప్రతిభాతిబాలం । ప్రమాద్యన్తం విత్త మోహేన మూఢం । అయం లోకోనాస్తి పరఇతిమానీ । పునః పునర్వశమా పద్యతేమే ॥

ముండక శ్రుతి॥ ద్వాసుపర్ణా సయుజాసఖాయా । సమానం వృక్షం పరిషస్వజాతే । తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి ॥

శ్రుతి॥ సమానేవృక్షే పురుషోనిమగ్నో, అనీశయా శోచతి ముహ్యమానః । జుష్టం యదాపశ్యత్యన్యమీ శమస్య మహిమానమితి వీతశోకః ॥

కఠ శ్రుతి. పరాంచిఖానివ్యతృణత్స్వయంభూ, స్తస్మాత్పరాఙ్ పశ్యతినా న్తరాత్మన్ । కశ్చిద్ధీరః ప్రత్యగాత్మానమైక్ష, దావృత్త చక్షు రమృత త్వ మిచ్ఛన్ ।

బృహ॥ శ్రుతి. ఆత్మానంచే ద్విజానీయా, దయమస్మీతి పూరుషః ।
కిమిచ్ఛన్ కస్య కామాయ శరీరమనుసంజ్వరేత్ ॥

ముండక శ్రుతి. బ్రహ్మైవేదం, విశ్వమిదం వరిష్ఠమ్ । ప్రణవో ధనుః, శరోహ్యాత్మా, బ్రహ్మతల్లక్ష్య ముచ్యతే ॥

శ్రుతి॥ "శ్రవణాయాపి బహుభిర్యో నలభ్యః ।"
"ఆత్మన్యేవ, ఆత్మానంపశ్యేత్ ।"
"దేవం మత్వాధీరో, హర్షశోకౌ జహాతి ।"
"నానుధ్యాయాత్ బహూం ఛబ్దాన్వాచో విగ్లాపనం హితత్"

"అమృతస్యైష సేతుః"; సంసార సముద్రముదాటుటకు, బ్రహ్మసాక్షాత్కారము, ఆనకట్టవంటిది.

కఠ శ్రుతి. "ఏకోవశీ సర్వభూతా న్తరాత్మా । ఏకం రూపం బహుధాయః కరోతి । తమాత్మస్థం యేఽనుపశ్య న్తిధీరాః । తేషాం సుఖం, శాశ్వతం, నేతరేషామ్ ।"

శ్రుతి॥ "శ్రోత్రియస్యచాఽకామహతస్య" బ్రహ్మానన్దరూపమగు శాశ్వత సుఖము, శ్రుతిజ్ఞాన సంపన్నుడును, సర్వకామములు నివర్తించిన వాడిచేతనే పొందబడునని ఆనన్దవల్లి విశదము జేయుచున్నది.

"నాహమన్యే సువేదేతి, నోనవేదేతి వేదచ । యదిమన్యసే సువేదేతి, దభ్రమేవాపినూనం" ।

"నాయమాత్మా బలహీనేన లభ్యః"

"అసన్నేవస భవతి" । "అసద్బ్రహ్మేతి వేదచేత్" । అని శ్రుతిమాత తెలుపుచున్నది.

ఎవడు ఆత్మలేదని తలచునో, వాడే లేనివాడగును. ఏలనన, ఆత్మస్వరూపుడు తానే. "ఆత్మాచ బ్రహ్మ" అని శ్రుతి తెలుపుచున్నది. ఆత్మ మరియొకరిచే తెలియబడునది గాదు. కావున జీవుడు తనను తానే తెలిసికొనుచున్నాడు. "ఇదియే తెలివి", ఆత్మ - స్వప్రకాశము, అని యొప్పుకొనక తప్పదు. "తెలివి", జ్ఞానము లేనిచో, తానే లేకపోవలసి వచ్చును. ఇట్టి అనుభవమెవ్వరికినీ లేదు.

ఛాందోగ్య శ్రుతి, "యదావై మనుతేఽథవిజానాతి" ఎప్పుడు మననము జేయునో అప్పుడు తెలిసికొనుచున్నాడు.

"బ్రహ్మసంస్థోఽమృతత్త్వమేతి",

"యథాసోమ్యైకేన మృత్పిండేన సర్వం మృన్మయం విజ్ఞాతగ్ం స్యాద్వాచారమ్భణం, వికారోనామధేయం, మృత్తికేత్యే వసత్యమ్",

తైత్తిరీయ శ్రుతి. వరుణపుత్రుడగు భృగువునకు తండ్రి బ్రహ్మము నిట్లుపదేశించుచున్నారు.

శ్రుతి॥ "యతోవా ఇమాని భూతాని జాయన్తే। యేన జాతాని జీవన్తి। యత్ప్రయంత్యభి సంవిశంతి।తద్విజిజ్ఞా సస్వ। తద్బ్రహ్మేతి।"

అప్పుడు భృగువు. తపస్సుతోడ పంచకోశనిరాకరణముగావించి-తుదకిట్లు తెలిసికొనెను.

శ్రుతి॥ "ఆనన్దో బ్రహ్మేతివ్య జానాత్। ఆనన్దా ద్ధ్యేవఖల్విమాని భూతాని జాయన్తే। ఆనన్దేనజాతాని జీవన్తి। ఆనన్దం ప్రయంత్యభి సంవిశంతీతి"।

"నతత్ర సూర్యోభాతిన చంద్రతారకం, నేమావిద్యుతో భాంతి కుతోయమగ్నిః। తమేవభాన్తమను భాతిసర్వం తస్యభాసా సర్వమిదం విభాతి"।

తై. శ్రుతి:—"సయశ్చాయం పురుషే। యశ్చాసావాదిత్యే।స ఏకః"

కైవల్య శ్రుతి :— సుషుప్తికాలేసకలేవిలీనే, తమోభి భూత స్సుఖరూపమేతి"।

కఠ శ్రుతి :— యేయం ప్రేతేవి చికిత్సామనుష్యే, అస్తీత్యేకే నాయమస్తీతిచైకే। ఏతద్విద్యా మనుశిష్టస్త్వయాహం, వరణామేష వరస్తృతీయః"।

"ఉత్తిష్ఠత జాగ్రత, ప్రాప్యవరాన్నిబోధత, క్షురస్య ధారా నిశితాదురత్యయా, దుర్గం పథస్తత్కవయో వదన్తి"।

"ఆత్మానం రథినంవిద్ధి, శరీరం రథమేవతు, బుద్ధింతు సారథిం విద్ధి, మనః ప్రగ్రహమేవచ, ఇన్ద్రియాణిహ యానాహుః విషయాంస్తేషు గోచరాన్। ఆత్మేన్ద్రియ మనోయుక్తం, భోక్తేత్యాహుర్మనీషిణః"।

ఆత్మరథికుడు. శరీరము రథము, బుద్ధిసారథి, మనస్సు పగ్గములు, ఇన్ద్రియములు గుఱ్ఱములు, వానికి, విషయములు గమనమార్గములు. వీటియన్నిటితో కూడుకున్న ఆత్మ, భోక్తయని, పండితులు చెప్పుదురు. (వివరము) ఇతడే వ్యవహారజీవుడు, చిదాభాసుడు, ఈ జీవ వ్యవహారమునకు ప్రకాశమిచ్చుచు, స్వసాక్షిగానుండు, నిర్వికారుడే ఆత్మ – ఈయనయే పరమాత్మ, ప్రత్యగాత్మయనబడు వాడు.

శ్రుతి :— "తత్త్వేవభయం విదుషోఽమన్వానస్య", । "ఆత్మైవానన్దః ।"ఏషోస్యపరమ ఆనన్దః"। అని శ్రుతి తెలుపుచున్నది.

శ్రుతి:— "సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్" "ఏకమేవా ద్వితీయం" "నేహనానా స్తికించన", "సర్వంఖల్విదం బ్రహ్మ" । "అతోన్యదా ర్తమ్" "సాక్షీచేతా కేవలోనిర్గుణశ్చ", "తత్త్వమసి", "అయమాత్మా బ్రహ్మ", "ప్రజ్ఞానం బ్రహ్మ" "ఆత్మాచ బ్రహ్మ", ఆత్మైవానన్దః" "బ్రహ్మ విద్బ్రహ్మైవ భవతి" । "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ", "జీవో బ్రహ్మైవ నాపరః".

శ్రుతి — "విజ్ఞాతా రమరేకేన విజానీయాత్" । అనగా దృశ్యమును తెలిసికొనెడి ఆత్మను, ఏ దృశ్యరూపముచే తెలిసికొన సాధ్యము. అనగా యితరముచే ఆత్మను జూడ సాధ్యముగాదు ఆత్మ అనుభవ రూపము గావున స్వానుభవమువల్లనే తెలియనగును. కావున ఆత్మ స్వానుభవైక వేద్యముగాని, మరియొకటి గాదు.

శ్రుతి :— "తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః" వగైరా— ఇచట ఆ, ఈ, అనగా - సర్వాధిష్ఠానమగు పరమాత్మయు, హృదయమునందు తెలియబడు ప్రత్యగాత్మయు - అని గ్రహించవలయును.

ఈశ శ్రుతి :—"ఈశావాస్యమిదం సర్వం, యత్కించ జగత్యాం జగత్ । తేనత్యక్తేన భుఞ్జీథా, మాగృధః కస్యస్విద్ధనమ్"

తైత్తిరీయ శ్రుతి— "బ్రహ్మవిదాప్నోతి పరమ్" । "భీషాస్మా ద్వాతః పవతే । భీషోదేతి సూర్యః । భీషాఽస్మాదగ్నిశ్చేన్ద్రశ్చ । మృత్యుర్ధావతి పంచమఇతి" ।

శ్రుతి :— "యదాహ్యేవైష ఏతస్మిన్నుదరమన్తరంకురుతే । అథతస్య భయంభవతి" । "ద్వితీయాద్వై భయంభవతి" । (1) "రసో వై సః" । "రసగ్ం హ్యేవాయంలబ్ధ్వాఽనన్దీ భవతి" । "కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్" । (2) "యదేష ఆకాశ ఆనన్దోనస్యాత్" । "ఏషహ్యేవానన్ద యాతి" ।

(1) అనగా ఆ బ్రహ్మ రసస్వరూపము. ఈ సమస్త ప్రాణిజాతము, ఆ రసమునుబొంది. యానన్దముగలది యగుచున్నది. తృప్తి కారణమగు మధురాది పదార్ధము రసమని లోకప్రసిద్ధము.

(2) ఈ ఆనన్దము హృదయాకాశముయందు లేనియడల, ఎవడు ఉచ్ఛ్వాస నిశ్వాసరూపమగు ప్రాణమును ధరించగలడు ? ఈ ఆత్మయే లోకమును సుఖపెట్టుచున్నది.

భాష్యము :— "యది ఆకాశే పరమేవ్యోమ్ని, గుహాయాం నిహిత, ఆనన్దోనస్యాత్ నభవేత్" । "సఏవ ఆత్మానన్దరూపోఽవిద్య యా పరిచ్ఛిన్నో, విభావ్యతే, ప్రాణిభిరిత్యర్థః" ।

"ఐతదాత్మ్య మిదం సర్వమ్" ఈ ప్రపంచమంతయు బ్రహ్మాత్మకము.

శ్రుతి :— "శ్రవణాయాపి బహుభిర్యోనలభ్యః । శృణ్వంతో ఽపి బహవోయం నవిద్యుః।ఆశ్చర్యోవక్తా కుశలోఽస్యలబ్ధా, ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః" ।

శ్రుతి:—"యదాసర్వే ప్రముచ్యన్తే కామాయేఽస్యహృదిశ్రితాః । అథమర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మసమశ్నుతే" । "సోఽకామో నిష్కామ, ఆప్తకామ. ఆత్మకామో నతస్యప్రాణా ఉత్క్రామన్తి" । బ్రహ్మైవసన్, బ్రహ్మాప్యేతి" । "అవినాశీవారేఽయమాత్మా" । "ఆత్మనస్తుకా మాయసర్వం ప్రియం భవతి" । "నవాఅరే విత్తస్య కామాయ విత్తం ప్రియం భవత్యాత్మనస్తు కామాయవిత్తం ప్రియం భవతి" । "అసంగోహ్యాం పురుషః", "విదితా విదితాభ్యామన్యద్బ్రహ్మేతి" "జ్ఞానాదేవతు కైవల్యమితి, వేదాన్త డిండిమః" ।

శ్రుతి :— "అయంవా ఆత్మా భూతానాంలోకః" । "నవిత్తేన

తర్పణీయో మనుష్యః", (దారిద్ర్య ధనవత్వములు, తారతమ్య మనః కల్పితములు– అనగా మనోగతములు) వీటికి యియత్తలేదు. ధనాదుల వల్ల అధికవాంఛలు గలుగుచుండునేగాని అవి తృప్తి నివ్వజాలవు.

శ్రుతి –"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ", "ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ", "ఏతదాలమ్బనం శ్రేష్ఠం, ఏతదాలమ్బనం పరమ్" ।

శ్రుతి:– "యోవేద నిహితం గుహాయాం పరమేవ్యోమన్ । సోశ్నుతే, సర్వాన్ కామాన్ సహ" ।

శ్లో॥ చిత్తస్య హి ప్రసాదేన, హంతికర్మ శుభాశుభమ్ ।
ప్రసన్నాత్మాత్మ నిస్థిత్వా, సుఖమక్షయ మశ్నుతే ॥

శ్రుతి :– "తద్యథేషికాతూల మగ్నౌ ప్రోతం ప్రదూయేతైవం, హాస్యసర్వే పాప్మానః ప్రదూయన్తే" ।

స్మృతి వాక్యం :–ఉపపాతకేషు సర్వేషు పాతకేషు మహత్సుచ । ప్రవిశ్యరజనీపాదం, బ్రహ్మధ్యానం సమాచరేత్" ।

బృహదారణ్య శ్రుతి:– ఆత్మ యెవరు ? దాని జ్ఞానలాభమేమి ?

(1) "కతమ ఆత్మేతి ; యోఽయం విజ్ఞానమయః, ప్రాణేషు హృద్యన్తర్జ్యోతిః పురుషః", "ఆత్మాన్తర్యామ్యమృతః, అదృష్టోద్రష్టా అశ్రుతఃశ్రోతా, అమతోమన్తా, అవిజ్ఞాతో విజ్ఞాతా", "నాన్యోఽతోఽస్తి ద్రష్టా, నాన్యోఽతోఽస్తిశ్రోతా, నాన్యోఽతోఽస్తి మన్తా, నాన్యోఽతోఽస్తి విజ్ఞాతా, ఏషత ఆత్మాన్తర్యామ్యమృతః, అతోఽన్యదార్తమ్" ।

(2) "అదృష్టం ద్రష్టృ, అశ్రుతం శ్రోతృ, అమతం మన్తృ, అవిజ్ఞాతం విజ్ఞాతృ, నాన్యదతోఽస్తి ద్రష్టృ, నాన్యదతోఽస్తి శ్రోతృ, నాన్యదతోఽస్తి మన్తృ, నాన్యదతోఽస్తి విజ్ఞాతృ" ।

(3) "సహోవాచ, ఏతద్వైతదక్షరంగార్గి బ్రాహ్మణా అభివదన్తి. "అస్థూల మనణ్వహ్రస్వమదీర్ఘ మలోహితమస్నేహమచ్ఛాయ మతమోఽవాయ్వనాకాశ మసఙ్గమరస మగన్ధమచక్షుష మశ్రో త్రమవాగమనోఽతేజస్కమప్రాణమముఖమమాత్రమనన్తర మబాహ్యమ్, నతదశ్నాతికించన, నతదశ్నాతికశ్చన" ।

"యదాసర్వే ప్రముచ్యన్తే కామాయేఽస్య హృదిశ్రితాః । అథ మర్త్యోఽమృతోభవత్యత్ర బ్రహ్మసమశ్నుతే" ।

శ్రుతి:—"తస్యతావదేవచిరం, యావన్నవిమోక్ష్యే అథసంపత్స్యే" అని ప్రత్యక్ బ్రహ్మైక్యజ్ఞానము కలవానికి, (అనగా) జ్ఞానికి, దేహ పాతానన్తరమందు, విదేహకైవల్యము కలుగునని వాక్యము తెలుపు చున్నది. ఇదియే ఫలము.

ఛాందోగ్య శ్రుతి :— "అథయోవేదస జిఘ్రాణీతి, ఆత్మా", అనగా దీనిని ఆఘ్రాణించుచున్నానని, వ్యవహరించువానిని, ఎవ్వడెరుం గునో (అనగా దాని సాక్షిగా నెవడుండునో) వాడే ఆత్మ.

"అథయోఽన్యాం, దేవతా ముపాస్తేఽన్యోఽసావన్యోఽహమ స్మీతి, నసవేద, యథాపశురేవంసదేవానామ్", "విదితా విదితాభ్యామన్యత్ బ్రహ్మేతి" "తత్త్వేవభయం విదుషోఽమన్వానస్య" "ఆనన్దం బ్రహ్మణో విద్వాన్, నబిభేతి కుతశ్చన", "నహిద్రష్టుర్దృష్టేర్విపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్", "ఏకఏవహి భూతాత్మా, భూతే, భూతే వ్యవ స్థితః"

కేనశ్రుతి :— "నాహమన్యే సువేదే, నో వేదేతి, వేదచ । యోనస్తద్వేదతద్వేద నోనవేదేతి వేదచ", నేను బ్రహ్మను బాగుగ తెలిసికొంటినని తలచను. తెలిసికొనలేదనిగాని, తెలిసికొంటిననిగాని తలచను. ఈ విషయమును మాలో తెలిసికొనినవాడు బ్రహ్మమును తెలిసికొనినవాడగును.

శ్రుతి :— "యదిమన్యసే సువేదేతి దభ్రమేవాపి నూనం", నేను బ్రహ్మస్వరూపమును బాగుగ తెలిసికొంటినని, నెవరైనను తలచిన యడల అది అల్పమే యగును.

శ్రుతి :— "కేనేషితం పతతిప్రేషితం మనః", ఎవనిచే నభి ప్రేతమగు ప్రేరణచే, చోదితమై మనస్సు విషయములనుగూర్చి బోవు చున్నది? వివరణ :— మనస్సుజడం, దీనికి పరప్రేరణము కావలసి యున్నది. దీనినే వాశిష్ఠమందు,"కేనాయం చాల్యతేమనః", ఈ మనస్సు దేనిచే ప్రేరింపబడి వ్యవహరించుచున్నది? అని ప్రారంభించి సమాధాన మును తెలుపుచున్నారు.

శ్రుతి :— "ఆత్మనావిన్దతే వీర్యం విద్యయావిన్దతేఽమృతమ్", ఆత్మవలన బలము కలుగుచున్నది. జ్ఞానమువలన మోక్షము కలుగు చున్నది.

శ్రుతి :— "నచేదిహా వేదీన్మహతీ వినష్టిః", ఈ జన్మమునందే ఆత్మజ్ఞానము నొందనియెడల గొప్ప వినాశము కలుగును. అనగా తీరని నష్టము సంభవించును.

ఈశ శ్రుతి:— అంధంతమః ప్రవిశన్తియేఽవిద్యా ముపాసతే", ఎవరు విద్యకు విరుద్ధమగు కర్మ నాచరించెదరో, వారు అజ్ఞానమున ప్రవేశించెదరు.

బృ. శ్రు:— "యత్రహిద్వైతమివ భవతి", తదితర, ఇతరం, పశ్యతి", అనగా ద్వైతమున్నట్లుగా, కనుపించుచుండిన, నొకడు మరియొకనిని జూచును. ఇట్లే సర్వము జరుగుచుండును. "యత్రత్వస్య సర్వమాత్మైవా భూత్, తత్కేన కంపశ్యేత్", బ్రహ్మవిదునకు సర్వము ఆత్మయైయుండగా దేనిచే దేనిని జూచును? అపుడు "ఏకత్వ మనుపశ్యతి"

✕

# బ్రహ్మస్వరూప వాక్యములు, అనుసన్ధానము

బ్రహ్మ స్వరూపమునుగురించి శ్రీ శంకరభగవత్పాదులు ఉపదేశ సాహస్రియను గ్రంధమందు యిట్లు తెలుపుచున్నారు :—

(1) శ్లో॥ దృశిస్వరూపం గగనోప మంపరం,
సకృద్విభాతం, త్వజమేకమక్షరం।
అలేపకం సర్వగతం, యదద్వయం,
తదేవచాహం, సతతం విముక్తఓమ్ ॥

తా॥ జ్ఞానమాత్ర స్వరూపమై, ఆకాశమువలె నిత్యమై, సర్వ పదార్థములకు అనగా ప్రపంచమునకు కారణమై, స్వప్రకాశమై, జన్మాది వికారములులేనిది, సర్వభేద శూన్యమై, నాశాదివికారరహితమై, పుణ్య పాప వివర్జితమై, సర్వవ్యాపకమై, జీవస్వరూపముకంటె అభిన్నమైన ఏ పరమాత్మ స్వరూపముకలదో అట్టి పరమాత్మస్వరూపము నేను. నేను సర్వదా అవిద్యాదోషములచేత విడువబడియున్నాను.

(2) శ్లో॥ దృశిస్తు శుద్ధోహ మవిక్రియాత్మకో,
నమే஽స్తి కశ్చిద్విషయః స్వభావతః।
పురస్తిరశ్చోర్ధ్వ మధశ్చ సర్వతః,
సంపూర్ణ భూమాత్వజ ఆత్మనిస్థితః ॥

తా॥ నేను శుద్ధమైన జ్ఞానస్వరూపుడను. సర్వవికార రహితుడను. నాకు స్వభావముచేతనే విషయములేవియును లేవు అనగా నేను నిర్విష యుడను. నేను నానాదిక్కులయందు అనగా సర్వవ్యాపకమై, సంపూ ర్ణమై, జన్మాదులులేక స్వస్వరూపమునందున్న వాడను.

(3) శ్లో॥ అజోఽమరశ్చైవ తథాఽజరోఽమృతః,
స్వయం ప్రభస్సర్వగతోఽహ మద్వయః ।
నకారణం కార్యమతీవ నిర్మలః,
సదైవతృప్తశ్చ తతో విముక్తఓమ్ ॥

తా॥ నేను జన్మ, అపక్షయము, ముదిమి, మరణములేనివాడను. స్వయంప్రకాశ స్వరూపుడను. సర్వ వస్తువులయందు వ్యాపించి (అనగా సంపూర్ణముగనిండి) యున్నవాడను. నేను సజాతీయ, విజాతీయ, స్వగత భేదములు లేనివాడను. నేను, కారణములగు పృథివ్యాది భూతముల కంటెను, కార్యములగు దేహేన్ద్రియాదులకంటెను, విలక్షణమైనవాడను. అత్యంత నిర్మలుడను. సర్వకాలములందునను తృప్తి కలవాడను. కనుక నేను ముక్తుడను. అని ఆత్మజ్ఞులెల్లప్పుడును తమ స్వస్వరూపానుసంధాన మందుండి ఆత్మ సాక్షాత్కారమును అనగా విదేహముక్తిని కోరుచుందురు.



# జీవుని వాస్తవ స్వరూపము

శాశ్వత అఖండ నిరతిశయపరమానందమే జీవుని వాస్తవ స్వరూపము. ఆనందమన్నను, సుఖమన్నను, సందర్భానుసారమున యీ షద్భేదమున్నను యిది ఒక్కటియే. ప్రతి జీవునియొక్క వాస్తవ స్వరూపము ఆత్మయే. తాను శాశ్వతానందముతో సుఖముగా నుండవలయును, దుఃఖము నశించవలయును అనగా తనకు రాకూడదని సర్వ జీవులును తలంచుచుండుట నిర్వివాదము. అయినను జీవుని అనాది అజ్ఞానముచే తాను వాస్తవమున కానట్టి, అనాత్మ జడస్వరూపము అగు నట్టియు తన దేహ సంఘాతమునే తాను అనగా నేను అని భ్రమించి సంసారదుఃఖము పాలగుచున్నాడు. జీవుని యీ అనాది అజ్ఞానమునుంచి విముక్తునిగావించుటకే బృహదారణ్యక శ్రుతి "ఆత్మావా రేద్రష్టవ్య, శ్రోతవ్యో, మంతవ్యో, నిదిధ్యాసితవ్యః" అని జీవుని స్వస్వరూపమగు పరమాత్మజ్ఞానమునకుగానుముఖ్యసాధనములుగ శ్రవణాదులనుబోధించు చున్నది. మరియును సద్గురు ముఖమున శాస్త్ర శ్రవణానంతరము "యదావై మనుతేఽథవిజానాతి" అని మననము నుపదేశించుచు "జీవో బ్రహ్మైవనాపరః" "ఆత్మైవానందః" "తత్త్వమసి" అను మొదలగు వాక్యములతోడ జీవుని వాస్తవస్వరూపమును ధ్రువపరచు చున్నది. కావున ఆత్మతత్త్వజ్ఞానమునకు మననము అత్యావశ్యకము. ఈ గ్రంథమంతయు ఒక బ్రహ్మాభ్యాసకుని మనన సంగ్రహవాక్యములే, గాని మరి వేరేమియునుగాదు. ఆత్మ జ్ఞానసాధకులగు జిజ్ఞాసువులకిది సుసాధనము, సులభోపాయము, అమృతతుల్యముగనుండునని విద్వదభిప్రాయము.

ప్రతి మానవుడును తన స్వరూపమును నేను, "అహమ్" అను

ప్రతీతితోడనే తెలిసికొనుచు అనుభవమునొందుచున్నాడు. శోధిత అహం అన్నను ఆత్మయన్నను నొక్కటియే. కాని అనాది అజ్ఞానముచే జీవుడు ఈ అహం పదార్థ పరిశోధన శాస్త్రీయముగ గావింపజాలక, అనాత్మ రూపమగు దేహాది సంఘాతమునే నేను అనుకొనుచున్నాడు. శోధిత అహమే చైతన్య స్వరూపము, ఆత్మ. తాను చైతన్య స్వరూపుడు కావుననే ఆత్మ అవినాశి. పరమార్థ వాస్తవమున జీవుడు ఆత్మస్వరూపుడే గనుక తన నాశమును తాను యే జీవుడును పొందుటలేదు. అనగా తాను లేనికాలము తెలిసికొనలేకున్నాడు. కాని తన ఉపాధినాశము తానని భ్రమించుచున్నాడు. ఇట్టి భ్రమ అజ్ఞానమే గదా. తమనాశము తామెవరును గుర్తించుట లేదు. ఏలనన ఆత్మ అవినాశి, నిత్యము. "నహిద్రష్టుర్దృష్టేర్వి పరిలోపో విద్యతే, అవినాశిత్వాత్". అనగా ఆత్మ చైతన్యమునకు నాశము లేకపోవుటవలన లోపము ఉండదు. ఆత్మ (తాను) లేని కాలమెవరికిని అనుభవములో లేదు. అహం, నేను అను తాను సర్వదా యున్నాడు. ఇట్టి అనుభవమును అవస్థాత్రయ, కాలత్రయములందున సర్వజీవులకును కలదు. కాని విమర్శచేయకుండుటచే తెలిసికొనజాలక యున్నారు. సర్వ జీవులకును జాగ్రత్స్వప్న అవస్థలయందు వారివారి అనుభవము తెలియుచునేయున్నది. ఇట్లే సుషుప్తిస్థితియందుగూడ తన యనుభవము గలదు. ఎట్లన, గాఢ నిద్రనుంచి లేచినవాడు "ఇంతవరకు సుఖముగ నిద్రించితిని, నా కేమియు తెలియలేదు." అని తన సుషుప్తి అనుభవమును తెలుపుచున్నాడు. ఇట్టి అనుభవమును తెలిసికొనువాడు సుషుప్తిలో ఒకడుండినగాని, జాగ్రదవస్థలో దానిని స్మరించుటకు వీలు గాదు. ఒకని యనుభవము, మరియొకని స్మరణకువచ్చుట అసంగతము. ఎవరి స్వప్నానుభవము వారిదేగాని, మరియొకరికి వారు చెప్పినగాని తెలియదుగదా ? కావున జాగ్రత్స్వప్న అవస్థలు రెంటిలాగునే, సుషుప్తి అవస్థయందుగూడ, "అహం" ప్రతీతితో తెలిసికొనుచు, ఆత్మస్వరూపుడగు తాను యున్నాడు. ఇట్లే ప్రతి జీవుడును తన పూర్వ, ప్రస్తుత,

ఉత్తరజన్మలను స్మరించుకొనుచున్నాడు. అనగా కాలత్రయములందునను గూడ తానున్న అనుభవము తనకే గలదు. ఇట్టి అనుభవము కలుగుచుండగా ఆత్మస్వరూపుడగు తాను లేనికాలముగాని, అవస్థగాని ఎట్లు గలుగును? కలుగుటకు వీలులేదు. అనగా జీవుడగు తాను నిత్యుడు. ఇట్టి అనుభవమును లేదనగూడదని "నహిదృష్టేஉనుపపన్నం నామ" అను న్యాయవచనము బోధించుచున్నది. జీవుని పరమార్థస్వరూపమగు ప్రత్యగాత్మ అవినాశి, నిత్యుడు. మరియును జీవుడు తాను కోరునట్టి ఆనందము, సుఖము, తన వాస్తవస్వరూపమగు ఆత్మయేగాని యితరములుగావని "ఆత్మైవానందః" అను శ్రుతివచనము స్పష్టముచేయుచున్నది. ఆత్మేతరములు అనగా విషయములవలన గూడ సుఖము కలుగుచున్నదిగదా యనిన అవి యన్నియు సుఖ ప్రతిబింబములేగాని కేవల సుఖస్వరూపములు కాదు. కేవల సుఖస్వరూపుడు తన స్వస్వరూపమగు ఆత్మయే. అనగా తానే. ఇదియే నిత్య, నిరతిశయ, సుఖస్వరూపము. దీని స్వానుభవము నొందుటయే మోక్షము. ఇదియే జీవుని పరమావధి. మానవునికిదియే పరమలాభము, శాశ్వత సుఖము. దీనికన్న పొందదగిన సుఖమేదియును లేదు.



# ఆత్మజ్ఞాన లాభము

వివేక చూడామణి, శ్లో॥ 565, 566

శ్లో॥ విలక్షణం యథాధ్వాంతం, లీయతె భానుతేజసి ।
తథైవ సకలం దృశ్యం, బ్రహ్మణి ప్రవిలీయతే ॥

శ్లో॥ ఘటేనష్టే యథావ్యోమ, వ్యోమైవ భవతి స్ఫుటమ్ ।
తథైవోపాంధి విలయే, బ్రహ్మైవ బ్రహ్మ విత్స్వయమ్॥

అనగా సూర్యోదయము కాగానే చీకటి, తేజస్సులో లీనమగునట్లు, జ్ఞానము కలుగగనే దృశ్యజాతమంతయు, దృక్రూపమగు బ్రహ్మమునందు లీనమగును. ఎట్లన, ఘటము నష్టముకాగా ఘటాకాశమే మహాకాశమయినట్లు, ఉపాధివిలయము కాగానే (అనగా ప్రారబ్ధాంతమందు) బ్రహ్మవేత్త స్వయముగ బ్రహ్మమేనగును. అని శ్రీ శంకర భగవత్పాదులు తెలుపుచున్నారు.

శ్లో॥ అజ్ఞానైకహతోబాల్యే, యౌవనే మదనాహతః ।
శేషేకళత్ర చింతార్తః, కింకరోతుకదాజడః ॥

# తత్త్వదృష్టి

తత్త్వజ్ఞుని దృష్టి సదా ఎట్లుండవలెననిన :—

తానెక్కడయుండి యేపని చేయుచున్నను-నామరూపాద్యాత్మక మగు యీ ఉపాధి తానుగాననియు యిచటనుండి యీ పనిచేయుచున్నది, పరిచ్ఛిన్నమగు నా ఉపాధియేగాని నేనుగాను- నెనెక్కడయున్నను అచట నా యుపాధియే యుండునుగాని, నేను మాత్రము సర్వ పరిపూర్ణుడుగ జ్ఞానమాత్రరూపముతో సర్వత్ర, సచ్చిదానన్ద రూపముతో, సత్యజ్ఞానానన్తరూపుడనై, అఖండ చిదాకాశరూపమున నున్నవాడను. ఇట్టి నిరంతర చిరకాలాభ్యాసమువలన ప్రారబ్ధానుసరణమున, నెక్కడ యుండినను, యెట్టి సుఖదుఃఖముల ననుభవించుచున్నను, వాటియందు సక్తతాభిమానములు క్రమముగ క్షీణించుచు, అభ్యాస పాటవమునుబట్టి తన పరిపూర్ణ చిదాకాశానన్దరూపము స్ఫురించుచునేయుండును. అప్పుడు అభ్యాసపాటవమునుబట్టి, బ్రహ్మాభ్యాససాధన సౌకర్యముకలిగి, సునాయాసముగ, సదాత్మసంస్థితుడై యుండును. ప్రారబ్ధాంతమున ఆత్మ స్వరూపుడే యగును. అనాత్మ దృశ్య వ్యాపారములు బాధకరములుగాక, నవి యీ ఉపాధియందు యున్నంతకాలము నడచుచుండును. తదుపరి "తస్యకార్యం న విద్యతే" తీవ్ర ముముక్షువుయొక్క నిరన్తరాత్మానుసన్ధాన మెట్లుండవలెనన్న :— "అహం" నేను వాస్తవమున యీ స్థూల సూక్ష్మాది సంఘాతమునందు నేదియుగాను— ఈ శరీరాదులు నాకు నిమిత్తమాత్రములగు సాధనములేగాని, యిందేదియు నేను గాను. ఈ నేను, నాదియను ప్రతీతియంతయు అజ్ఞాన కల్పితము. అయినను నా అజ్ఞాన, అత్యంత నివృత్తికినీ, నా స్వస్వరూపమగు మోక్షప్రాప్తికినీ యీ యుపాధియే సాధనము. దీనివలన నేను పొందవలసిన పరమ

ప్రయోజనము నిత్యనిరతి శయానన్దస్థితి. ఇదియే మోక్షము. ఇదియే నా ఆత్మస్వరూపము, నిత్యము, స్వతస్సిద్ధము, అఖండానన్దరూపము. నా ఆత్మస్వరూప మిట్టిదియైనను, నేనింతవరకును అనగా (అనేక కోటి జన్మలనుంచి) అజ్ఞానావృతుడనై, పరిచ్ఛిన్నత్వ, జడత్వ, దుఃఖిత్వ ముల నొందుచుంటిని. ఇట్లుండగా నా పురాకృత పుణ్యముచే యీ జన్మ యందు నా వాస్తవస్వరూపమును శాస్త్రీయముగ తెలిసికొని నిశ్చయము నొందియున్నాను. సందేహములు లేవు. అయినను చిరకాలాజ్ఞానావృతుడ నగుటంజేసి, యీ దేహతాదాత్మ్యాధ్యాసము, నన్ను విడువకున్నది. అందుచే నా స్వరూపానన్దము స్వానుభూతికి వచ్చుటలేదు. ఒక్కొక్క కాలమున అతి ప్రయత్నముచే కలిగినను అది నిత్యమగుట లేదు. ఏలనన, యీ దేహాదులే నేను, దీనికుపకరించునని తలచినదంతయు నాది, అనగా యీ "అహం" మమేదంరూపమున, అనాది అవిద్యయను అజ్ఞానము శతకోటి జన్మపరంపరగా అనగా అనాదినుంచి యున్నది. ఇది జీర్ణించిన పురాణజ్వరమువలె నన్ను విడువకున్నది. అందుకుగాను పురాణజ్వరదోషము నశించువరకును, ఔషధమును దీర్ఘకాలమెట్లు సేవించవలయునో, అట్లే అజ్ఞానము నివర్తించువరకును, ముముక్షువు నకు శ్రవణానన్తరము, మనన, నిదిధ్యాసనాభ్యాసములు అత్యావశ్యక మగుచున్నవి. పరమార్థ వాస్తవమున తాను కానట్టి, సర్వ ప్రపంచమును నేను, నాదియను భ్రమనొంది సంసారదుఃఖము జీవుడు బొందు చున్నాడు. ఇదియే అనాది అజ్ఞానము, భ్రమ. జీవునకు యీ స్వశరీర దృశ్యానుభవమంతయు దీర్ఘ స్వప్నమువంటిది. స్వప్నము, స్వప్న శరీరము, స్వప్నసర్వానుభవములు యెట్లు సత్యముకాకున్నవో అట్లే కాలాంతరమున, అనగా కొంతకాలమునకు ప్రతి జీవునకును తన స్థూల శరీర ప్రపంచానుభవమంతయు, లేనిదియే యగుచున్నది. అనగా అవాస్తవమగుచున్నది. ఎట్టి జీవునకైనను యీ ప్రపంచము శాశ్వత ముగ నుండుటలేదు. ఏలనన దీని స్వభావమే కొంత కాలమునకు

మార్పు చెందునదియు, నశించునదియునై యున్నది. ఉన్నంతకాల ములో గూడ సర్వదా మారుచుండునట్టి స్వభావముగలది. ఈ మార్పుల వలన జీవుడు తన వాసనాప్రారబ్ధానుసరణమున సుఖదుఃఖ భ్రాంతి నొందుచున్నాడు. ఈ భ్రాంతివలననేజీవుడు చర్వితచర్వణముగ సంసార భ్రమణము జేయుచు, దుఃఖము ననుభవించుచు, శ్లేష్మము, లేక తేనలోపడిన ఈగవలె సంసారవిముక్తిని గాంచలేకున్నాడు. అందుకు గాను వేదమాత జీవులనుద్ధరించుటకే "తత్త్వమసి" "జీవో బ్రహ్మైవనా పరః" అను మొదలగు వాక్యములతో జీవుని స్వస్వరూపమగు పర మాత్మ రూపమును "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" "అఖండ సచ్చిదా నన్ద లక్షణః", అని బోధించుచున్నది. శ్రుతిమాత బ్రహ్మస్వరూప మును అన్వయవ్యతిరేకవచనములతో అనేక విధములుగ బోధించు చున్నది. ముముక్షువు సద్గురుముఖమున వాని యర్ధమును బాగుగ హృద్గోచరము గావించుకొని బ్రహ్మస్వరూపమగు తన స్వస్వరూప మును నిరన్తరము అను సన్ధానధ్యానాదుల నభ్యసించుచు తన ప్రారబ్ధ క్షయమును మాత్రము గావించు ఆశయముతోడ జీవయాత్రను నిర్లిప్తత తోడ అనుభవించుటయే ముముక్షువునకు కర్తవ్యము. అట్టి ఆత్మాను సన్ధానము ఎట్టిదియనిన :– "అహం", నేను యీ దేహాది సంఘాతములో యేదియునుగాను. నేను విశ్వాతీతుడను, గగన సదృశుడను, తత్త్వ మస్యాది వాక్యలక్షణుడను, చిదాకాశ స్వరూపుడను, నిత్య బుద్ధస్వరూపు డను, సర్వాంతర బాహ్యవ్యాపకుడను (అనగా పరిపూర్ణుడను) సర్వా ధిష్ఠానుడను, అఖండ జ్ఞానస్వరూపుడను, నిత్యనిరతి శయానన్దస్వరూపు డను.

ఈ స్వశరీర సర్వప్రపంచము నాయందే మందాంధకారమున త్రాడుయందు తోచు సర్పములాగున తోచుచు భాసించుచున్నది. ఇది భ్రాంతి. ఈ ప్రపంచానుభవము దీర్ఘ స్వప్నమువంటిది. అనిత్యము, నశించునట్టిది. నేనో ఉత్పత్తి నాశరహితుడను, అవినాశిని, పరిపూర్ణు

డను, పరమానన్దస్వరూపుడను, నేను నిర్మల మహాకాశమువంటివాడను, నిస్తరంగ మహాసముద్రమువంటివాడను. త్రివిధ భేదరహితుడను. నేను మహాకాశమువంటి చిదాకాశ స్వరూపుడను. కేవలము అఖండ జ్ఞాన స్వరూపుడను. జననమరణములు, కర్తృత్వ భోక్తృత్వములు, సుఖ దుఃఖములు క్షుత్పిపాసాదులు, యివి అన్నియూ నా యుపాధియగు దేహధర్మములేగాని నాకు వాస్తవమున సంబంధించినవి గావు. ఈ ఉపాధి నా సుఖదుఃఖ ప్రారబ్ధభోగమునకుగాను కల్పితము. అజ్ఞాన కార్యము. దీని గుణధర్మములన్నియు ప్రకృతికి సంబంధించినవే గాని కేవల ఆత్మస్వరూపుడనగు నాకు వాస్తవమున సంబ ధించినవి గావు. ఇట్టి నిశ్చయముతోడనే తత్త్వజ్ఞుడు తన ప్రారబ్ధము ననుభవించు ననియు, సదా యిట్టి అనుభవముతోడనే పుణ్యపాప సంబంధములేక కొలనుయందు తామరాకువలె నుండుచు కాలక్రమమున అనగా ప్రారబ్ధాంతమున పరమాత్మ భావము నొందుననియు గీతాచార్యుడైన శ్రీకృష్ణ భగవానుడు గీత 5 వ అధ్యాయమునందు, 8, 9, మరియు 10, శ్లోకములతోడ నిట్లు తెలుపుచున్నారు :

శ్లో॥ నైవకించిత్కరోమీతి, యుక్తోమన్యేత తత్త్వవిత్ ।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్, నశ్నన్గచ్ఛన్
స్వపన్ శ్వసన్ ।

శ్లో॥ ప్రలపన్ విసృజన్ గృహ్ణన్, నున్మిషన్నిమిషన్నపి ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు, వర్తన్త ఇతిధారయన్ ॥

శ్లో॥ బ్రహ్మణ్యాధాయకర్మాణి, సఙ్గంత్యక్త్వా కరోతియః ।
లిప్యతే నసపాపేన, పద్మపత్ర మివామ్భసా ॥

మరియును యీ గుణకర్మములన్నియు తనకు వాస్తవమున సంబంధించినవిగావని, యెపుడు అభ్యాసకుడు నిశ్చయము నొందునో,

వాస్తవమున, పరమాత్మ స్వరూపుడగు తనను గుణములకంటె అతీతునిగా తెలుసుకొనునో, అపుడు బ్రహ్మత్వమునొందునని గీత 14 అధ్యాయము 19 శ్లోకమువలన స్పష్టపరచుచున్నది.

శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం, యదా ద్రష్టానుపశ్యతి।
గుణేభ్యశ్చ పరం వేత్తి, మద్భావం సోఽధిగచ్ఛతి ॥

కావున జ్ఞానాభ్యాసకుడు తన ప్రారబ్ధము నెట్లనుభవించుచున్నను తన వాస్తవస్వరూపమగు అఖండ సచ్చిదానన్దరూపమును నిర్మల మహాకాశమువలె సర్వదా అనుసన్ధాన ధ్యానాదులను జేయుచుండుటయే ముముక్షువునకు కర్తవ్యము, జన్మ సాఫల్యము నిచ్చునది.



# తత్త్వజ్ఞుడు

ఆత్మ తత్త్వజ్ఞానము కలవాడు, స్వస్వరూపానుభవముచే తృప్తిని బొందుచుండును. కాని అవిద్యా కల్పిత విషయములలో ప్రవర్తింపడు. ఈ ప్రపంచములోనుండు సర్వవిషయములును, అవిద్యా కల్పిత మిథ్యా భూతములని, యాత్మజ్ఞుల నిశ్చయము. కావున వానిని కోరరు. ప్రాపంచిక విషయములెట్టివై యెంతటివైనను ఆత్మజ్ఞానము కలవానిని ఆకర్షింపజాలవు. ఇవి యన్నియును స్వాత్మాభిన్న బ్రహ్మానన్దముకన్న అల్పములేకదా. ఈ విషయమునే శ్రీ వశిష్ఠులవారు :—

శ్లో॥ నకేచనజగద్భావా స్తత్త్వజ్ఞం రంజయంత్యమీ ।
నాగరం నాగరీకాంతం, కుగ్రామ లలనా ఇవ ॥

శ్లో॥ అపిశీతరు చావర్కే సుతీక్ష్ణే చేందుమండలే ।
అప్యధః ప్రసరత్యగ్నౌ, జీవన్ముక్తో నవిస్మయీ ॥

అనగా, పట్టణములందుండి రసికుడైన పురుషుని, గ్రామములోని అరసికులైనస్త్రీలు రంజింపజేయజాలని యట్లు యీ లోకమునందు పదార్థము లెట్టివైనను, బ్రహ్మతత్త్వ జ్ఞానముగల పురుషుని సంతుష్టుని జేయజాలవు. ఇంకను అతితీక్ష్ణతగల సూర్యుడు ఒకానొక కాలమందు చల్లని కాంతిగలవాడైనను, చల్లని స్వభావముగల చంద్రుడు వేడిమి గలవాడైనను, ఎల్లప్పుడును ఊర్ధ్వజ్వాలలుగల అగ్ని క్రిందిభాగమునకు ప్రసరించు జ్వాలలుగలదియైనను, బ్రహ్మతత్త్వజ్ఞాని ఆశ్చర్యము నొందడు. బ్రహ్మవేత్త యితర జనుల కాశ్చర్యమును కలుగజేయు విషయములం దాశ్చర్యము నొందడు. ఏలనన, యీ ప్రపంచతత్త్వమును తెలిసినవాడగుటచే విషయ లాభనష్టములవలన కలుగు వికారహేతువు

అచట యుండదు, గనుక-జ్ఞాని వ్యవహారానుభవముల సుఖదుఃఖములను పామరులవలె నొందడు అవి ఆభాసముగ నుండును.

మరియును "జ్ఞాత్వాదేవం సర్వపాశాపహానిః, క్షీణైః క్లేశైర్జన్మ మృత్యు ప్రహాణిః", అను శ్రుతివాక్యము జ్ఞానికి భావిజన్మ సహిత పరలోకదుఃఖము లేదని విశదముచేయుచున్నది. అనగా పునర్జన్మ యుండదనిభావము. ఇంకను "అధ్యాత్మయోగాధిగమేనదేవం మత్వాధీరో హర్షశోకౌజహాతి", అనగా బ్రహ్మాత్మనాసంస్థితుడు యీ జన్మమునందే విషయ లాభాలాభ నిమిత్త సుఖదుఃఖములను విడుచును. అనగా వాని ప్రాప్తి పరిహారములకు వాస్తవమగు ప్రవృత్తి కలుగదు. అనగా వాటియందు వాస్తవబుద్ధి యుండదు. కనుక ఆత్మవేత్త సంసారదుఃఖమును బొందడు. బ్రహ్మవిదునకు ఎట్టి భయము నుండదని, "ఆనన్దం బ్రహ్మణో విద్వాన్ । నబిభేతి కుతశ్చన ।" అని తెలుపుచు, మరియును యీ విద్వాంసునకు దేహ పతనకాలమందు, తక్కిన జీవులందరకును యుండునట్టి పాపభయముండదని, "ఏతగ్ం హవావనతపతి । కిమహగ్ం సాధునాకరవమ్ । కిమహం పాపమకరవమితి", అయ్యో నేను పాపములే చేసితిని, పుణ్యము నేల జేయకపోతిని, అను చింత తత్త్వజ్ఞానికి కలుగదు. అని వచనములు తెలుపుచున్నవి. ఏలనన ఆత్మజ్ఞునకు నేను బ్రహ్మమాత్రరూపుడనను దృఢనిశ్చయముండును.



# ముముక్షు వ్యవహార నిరూపణ

ముముక్షువు ఆశయము, అమృతత్వసిద్ధి-అనగా పరమ ముక్తి. ఇట్టి స్థితి లోకాతీతము, నిరుపాధికము. వ్యవహారమనగా ఉపాధితోడ చేయునట్టి సర్వక్రియాదికము. ఉపాధి ప్రారబ్ధకల్పితము, ప్రారబ్ధాధీనము. ఈ ఉపాధితో చేయబడునదంతయు, వ్యవహారము. ఉపాధులనన్తములు-భిన్న భిన్నములు. వీటి వ్యవహారములు గూడ భిన్న భిన్నములుగానుండి, చిత్ర విచిత్రములుగా నుండును. ఇట్లుండుటకు కర్మఫలములే కారణములు. ఈ కర్మలను ఆ యా జీవులుతమ శుభాశుభవాసనలను బట్టి చేయుచుందురు. అశుభ వాసన బంధహేతువు. శుభ వాసన ముముక్షువు కోరునట్టి ముక్తికి హేతువు. అనాత్మ జ్ఞానమంతయు అశుభ వాసన. ఆత్మజ్ఞానమంతయు శుభవాసన. కావున నేను అనుప్రతీతికి వాస్తవార్థమేమనిన, నిత్య నిరతిశయ నిర్వికార నిరవయవ నిష్క్రియ కర్తృత్వాదిరహిత నిర్గుణ అద్వితీయ అసంగ అవినాశ స్వాత్మాభిన్న సర్వాధిష్ఠాన స్వప్రకాశ అఖండ సచ్చిదానన్ద చిదాకాశరూపమే గాని, యీకర చరణాది విశిష్టదేహాది సంఘాతము గాదు. స్థూల సూక్ష్మాది దేహమంతయు కల్పితము, అనిత్యము. కావున ముముక్షువు సర్వదా అనాత్మ జ్ఞానమును వదలి, ఆత్మజ్ఞానమును వృద్ధిచేసుకొనుచుండవలయును. దేహేన్ద్రియాది సంఘాత సమస్త ప్రపంచమునకు సంబంధించిన చింతయంతయు అనాత్మ జ్ఞానము. బంధహేతువు. ఆత్మ జ్ఞాన మనగా తన పరమార్థ వాస్తవ స్వరూపము. దానినిగురించి చేయు చింతన అంతయూ ఆత్మజ్ఞానములోనిదే. ఈ దృశ్యానుభవమంతయు జీవ భోగానుభవ నిమిత్తము కల్పితము. అవాస్తవము-ఆభాసమాత్రము-నశించునది. జీవుని, తనయొక్క సదాత్మ

జ్ఞాన పర్యంతము సంసార నిమగ్నునిచేసి దుఃఖముపాలు జేయునది. ఈ అనాత్మ జ్ఞానమునే, అవిద్య, అజ్ఞానము, మాయ, అను పేర్లతో వ్యవహరింతురు. ఈ మాయ చాల బలీయమైనది, కాని దీని బలమెంతది యైనను, నిదియంతయూ ఆత్మజ్ఞానము కలుగునంతవరకే. తదుపరి ఇది ఏమియు చేయలేదు. మృతప్రాయమగును. అపుడు ముముక్షువు తన వాస్తవ స్వరూపమందు స్థితిని పొందగలుగును. దానికిగాను ముముక్షువైనవాడు ప్రారబ్ధ బలమువలన యెంతటి, యెట్టి సుఖదుఃఖముల ననుభవించుచున్నను, వాటి అవాస్తవికత్వమును బాగుగ గుర్తించి నిశ్చయమునొంది తన స్వరూపమును సర్వదా నిట్లు చింతించుచుండవలయును. యీ దేహేన్ద్రియాది సంఘాతములోగాని, దృశ్యమందునగాని నే నేదియుగాను. నేను నా హృదయమందు తెలియబడు నట్టి పరమాకాశ స్వరూపుడను. ఇదియే అఖండము, సర్వాధిష్ఠానము, స్వప్రకాశము, సర్వధీసాక్షిభూతము. ఇదియే నా వాస్తవ స్వరూపము. ఇదియే అఖండ సచ్చిదానన్ద స్వరూపము. అవినాశి, అవికారి, పరిపూర్ణము. ఇదియే నా వాస్తవ స్వరూపము.



# జ్ఞాని - అజ్ఞానుల ప్రారబ్ధానుభవము

జ్ఞాని, అజ్ఞానులకు, విషయ సుఖదుఃఖభోగములు సమానముగా కనబడుచున్నను, వారి వారి నిశ్చయములనుబట్టి జ్ఞాని— అజ్ఞానులకు అనుభవ వైషమ్యముండును. ఈ విషయమునే పంచదశిలో నిరూపించు చున్నారు. పే. 426, శో॥ 240.

శ్లో॥ ఐహికాముష్మికస్సర్వ, సంసారో వాస్తవస్తతః ।
నభాతి నాస్తి చాద్వైత, మిత్యజ్ఞాని వినిశ్చయః ॥

శ్లో॥ జ్ఞానినో విపరీతోఽస్మా, న్నిశ్చయస్సమ్య గీక్ష్యతే ।
స్వస్వనిశ్చయతో బద్ధో, ముక్తోఽహం చేతిమన్యతే ॥

అనగా ఈ లోక సంబంధమైన పుత్ర మిత్ర కళత్ర విత్త క్షేత్రా దులును, పరలోక సంబంధమగు స్వర్గ సుఖాద్యనుభవములునుమాత్రమే వాస్తవములు, అద్వైత బ్రహ్మతత్త్వము, యిప్పుడు గనుబడుట లేదు గనుక అది లేదని అజ్ఞానుల నమ్మకము. ఇక జ్ఞానులకు అద్వైత బ్రహ్మతత్త్వము మాత్రమే సత్యము, తక్కినదంతయు కల్పితము, మిథ్యయను నమ్మకముండును. ఇట్టి నమ్మకముల భేదముచే ప్రయోజనమేమనిన, ఫలములుగూడ, భేదముగ వారి వారి నిశ్చయాను సారముగా నుండును. అజ్ఞాని, అశాస్త్రీయ నిశ్చయముచేత జననమరణ ప్రవాహ రూపమగు సంసార దుఃఖము ననుభవించుచుండును. జ్ఞాని శాస్త్రీయ నిశ్చయముగలిగి, కృతార్థుడగుచున్నాడు. ఇట్లు జ్ఞానికినీ, అజ్ఞానికినీ అనుభవభేదమునుబట్టి ఫలభేదము గలదు. ద్వైతాద్వైత పక్షముల రెంటియందునను, నంతయూ నిపుడే స్ఫురింపకపోవుట యను దోషమున్నను, ఒకటి సత్యమందు దోషము, రెండవది అసత్య

మందు కలిగిన దోషము. సత్యపదార్ధమందు యిప్పుడుయున్న ఉపాధి దోషము నివర్తింపగనే, సత్యస్వరూపసిద్ధి గలుగును. అసత్యమందు గలిగిన దోషము నివర్తించినను, అసత్యము, అవాస్తవానుభవమే గలుగుచుండునుగాని సత్యస్వరూపమగు స్వాత్మాభిన్న అఖండ సచ్చిదానన్ద స్వరూపము నొందజాలడు. స్వాత్మాభిన్నమగు చైతన్యము తనను ప్రత్యక్షముగా తెలిసికొనుటయందు అన్యవస్తువు నపేక్షింపకయే, తెలిసికొను చున్నది. ద్వైతము జడస్వరూపమగుటచేత, అటుల తనను తాను తెలిసికొనలేక చైతన్యాపేక్ష కలిగియుండును.



# వాశిష్ఠ గ్రంథ సంగ్రహ వచనములు

వాశిష్ఠము. పే. 330, 423, 978

శ్లో॥ ఏకంబ్రహ్మ చిదాకాశం, సర్వాత్మక మఖండితమ్ ।
ఇతిభావయయత్నేన, చేతశ్చాంచల్య శాంతయే ॥

శ్లో॥ నిస్సంకల్పో యథాప్రాప్త, వ్యవహార పరోభవ ।
చిదచిత్యోన్ముఖత్వం హి, యాతి సంకల్ప సంక్షయే ॥

శ్లో॥ అహమర్థ విముక్తేన, భావేనా భావరూపిణా ।
సర్వం శూన్యం నిరాలమ్బం, చిద్రూపమితిభావయ ॥

శ్లో॥ చిదాకాశమయం సర్వం, జగదిత్యేవ భావయన్ ।
యస్తిష్ఠత్యుపశాంతోంతః, సబ్రహ్మైకవచీసుఖీ ॥

శ్లో॥ సంసారో మనసాపుంసః, కల్పితోస్తి నవస్తుతః ।
మనః శూన్యే సుషుప్త్యాదౌ, సంసారో నైవదృశ్యతే ॥

శ్లో॥ అద్వైతంతు స్వతస్సిద్ధం, మనసైవాఖిలం జగత్ ।
సాక్షిణ్యారోపితం సర్వం, స్వప్నవత్సర్వదామ్మృషా ॥

శ్లో॥ యత్కించిదపి సంకల్ప్య, నరోదుఃఖే నిమజ్జతి ।
నకించి దపి సంకల్ప్య, సుఖమవ్యయమశ్నుతే ॥

ఆత్మ దేవార్చనము-వాశిష్ఠం. పే. 743.

శ్లో॥ నదేవః పుండరీకాక్షో, నచదేవస్త్రిలోచనః ।
నదేహోదేహ రూపోవా, నదేవశ్చిత్త రూపకః ॥

శ్లో॥ అకృత్రిమమనాద్యన్తం, దేవనందేవ ఉచ్యతే ।
తదేవదేవశబ్దేన, కథ్యతే తత్రపూజయేత్ ॥

శ్లో॥ ఆకారాది పరిచ్ఛిన్నే, మితేవస్తునితత్కృతః ।
అకృత్రిమమనాద్యన్తం, దేవనంచి చ్ఛివంవిదుః ॥

శ్లో॥ అజ్ఞాత శివతత్త్వానా, మాకారాద్యర్చనం కృతమ్ ।
యోజనాధ్వన్యశక్తస్య, క్రోశాధ్వాపరికథ్యతే ॥

శ్లో॥ చిద్వ్యోమైవకిలాఽస్తీహ, పారావార వివర్జితమ్ ॥
సర్వత్రా సంభవచ్చేత్యం, కల్పాంతేషు చ శిష్యతే ॥

శ్లో॥ అకృత్రిమమనాద్యన్త, మద్వితీయ మఖండితమ్ ।
అబహిస్సాధనా సాధ్యం, సుఖం తస్మాదవాప్యతే ॥

పూజించు విధానము-

శ్లో॥ బోధస్సామ్యం శమశ్చేతి, పుష్పాణ్యగ్ర్యాణితస్యతైః ।
శివం చిన్మాత్రమమలం, పూజ్యం పూజావిదోవిదుః ॥

శ్లో॥ శమబోధాదిభిః పుష్పైః, దేవ ఆత్మానమర్చయేత్ ।
తత్తుదేవార్చనం విద్ధి, నాకారార్చనమర్చనమ్ ॥

వాశిష్ఠం 145

"పూజనం ధ్యానమేవాన్త, ర్నాన్యదస్త్యస్య పూజనమ్।
శాస్త్రంచ చోదయేత్, నతుకారయేత్"

వివేకచూడామణి, శ్లో 433

శ్లో॥ అతీతా ననుసంధానం, భవిష్య దవిచారణమ్ ।
ఔదాసీన్య మపిప్రాప్తే, జీవన్ముక్తస్య లక్షణమ్ ॥

జ్ఞాని, అజ్ఞానుల ప్రారబ్ధానుభవము. సంగ. పే. 550

శ్లో॥ జ్ఞానినోఽజ్ఞానినశ్చాత్ర, సమే ప్రారబ్ధ కర్మణీ।
నక్లేశో జ్ఞానినో ధైర్యాత్, మూఢః క్లిశ్యత్య ధైర్యతః॥

శ్లో॥ మార్గేగంత్రోర్ద్వ యోశ్శ్రాంతౌ, సమాయామప్య దూరతామ్।
జానన్ ధైర్యాద్ద్రుతంగచ్ఛ, త్యన్య స్తిష్ఠతి దీనధీః॥

జ్ఞానికి ప్రస్తుతఫలము, "దృష్టదుఃఖేష్వనుద్వేగో విద్యాయాం ప్రస్తుతం ఫలం". జ్ఞానాభ్యాసకుడు "సర్వమిద మహంచ బ్రహ్మ" యను వృత్తిలో సర్వదాయుండుటను అభ్యసింపవలెను. కాని క్రియా రూపము గాదు.

ఆత్మబోధ

శ్లో॥ యల్లాభాన్నా పరోలాభో, యత్సుఖాన్నా పరంసుఖమ్।
యజ్జ్ఞానా న్నా పరంజ్ఞానం, తద్బ్రహ్మేత్యవధారయేత్।

శ్లో॥ శ్రవణాది భిరుద్దీప్తో, జ్ఞానాగ్ని పరితాపితః।
జీవః సర్వమలాన్ముక్తః, స్వర్ణవత్ ద్యోతతేస్వయమ్॥

శ్లో॥ హృదాకాశోదితోహ్యాత్మా, బోధభాను స్తమోఽపహృత్।
సర్వవ్యాపీ సర్వధారీ, భాతిసర్వం ప్రకాశతే॥

శ్లో॥ జీవన్ముక్తస్తు తద్ విద్వాన్, పూర్వోపాధి గుణాన్త్యజేత్।
సచ్చిదానన్ద రూపత్వం, భజేద్భ్రమరకీటవత్॥

అనగా జీవన్ముక్తుడగు విద్వాంసుడు యీ యుపాధికి చెందిన గుణధర్మములను పరిత్యజించి భ్రమరకీటక న్యాయమున బ్రహ్మధ్యాన పరుడే కావలయును. (అట్టిచో అదియే తానగును).

"సాక్షీచేతా కేవలో నిర్గుణశ్చ"

శ్లో॥ ఆత్మజ్యోతిః ప్రణవనిహితం, కేవలం జ్ఞానరూపమ్ ।
విశ్వాతీతం గగనసదృశం, తత్త్వమస్యాది లక్ష్యమ్ ।
ఏకం, నిత్యం, విమలమచలం, స్వస్వరూపం స్మరామి।

శ్లో॥ సమం స్వరూపమమలం, జ్ఞేయం బ్రహ్మపరం విదుః ॥
జ్ఞానాభిగమమాత్రేణ, తత్స్వయం సంప్రసీదతి ॥

పేజి 679

శ్లో॥ దిక్కాలాద్య నవచ్ఛిన్న, మదృష్టోభయ కోటికమ్ ।
చిన్మాత్ర మక్షయం శాన్త, మేకం బ్రహ్మాస్మి నేతరత్ ॥

శ్లో॥ ఇతిమత్వాఽహమిత్యంత, ర్ముక్త్వాముక్త వపుర్మహాన్ ।
ఏకరూపః ప్రశాన్తాత్మా, మౌనీస్వాత్మ సుఖోభవ ॥

అనగా దేశకాల వస్తు పరిచ్ఛేద రహితంబును, ఆద్యన్తరహితంబును, చిన్మాత్రంబును, నగు బ్రహ్మంబే నేనని నిశ్చయించి, అభిమానము లేనందున విడువబడినదియగు శరీరము కలవాడవును శాన్తచిత్తుడవునగుచు, నాత్మానన్దసుఖము ననుభవింపుము.

(రామా) పే. 680 వాశి

శ్లో॥ ఆధ్యాత్మశాస్త్ర మంత్రేణ, తృష్ణా విషవిషూచికా ।
క్షీయతే భావితేనాన్తః, శరదామిహికా యథా ॥

శ్లో॥ బుద్ధిపూర్వం విచార్యేదం, యథావస్త్వవలోకనాత్ ।
సత్తా సామాన్య బోధోయ, స్సమోక్షశ్చే దనన్తకః ॥

అనగా ఈ జగమును శ్రుతి, యుక్తి, అనుభవములచేత నాలోచించి పరమార్థమును నిశ్చయించుటవలన బుద్ధిపూర్వకముగ సత్తా

మాత్రమునందు పర్యవసానముగ జ్ఞానము కలిగెనేని, అదియే పునరావృత్తి రహితమగు మోక్షమగుచున్నది.

శ్లో॥ విచార్యార్యైస్సహాలోక్య, శాస్త్రాణ్యధ్యాత్మభావనాత్ ।
సత్తా సామాన్య నిష్ఠస్స్వం, యత్తద్బ్రహ్మ పరంవిదుః ॥

అనగా అధ్యాత్మ శాస్త్రమును బాగుగజదివి, బ్రహ్మవిదులతో గలసి విచారించి, ఆత్మతత్త్వమును, చిత్తమునద్దనుసన్ధానము జేయుట వలన, సత్తామాత్రంబున యుండునదేదియో దానినే పరబ్రహ్మమునుగా విద్వాంసులు నెరుంగుచున్నారు.

## ఛాన్దోగ్యం

"యదావై మనుతేఽథ విజానాతి" "యదావై శ్రద్దదాత్యథమనుతే" అనగా మననమెపుడుచేయునో అపుడు తెలిసికొనుచున్నాడు. శ్రద్ధచే మననము చేయబడును. "యోవై భూమా తత్సుఖం, నాల్పే సుఖమస్తి" నిరతిశయమగునది యేదిగలదో అది భూమము. అదియే సుఖము. సాతిశయములగు సుఖములన్నియు వాస్తవసుఖములుగావు. అల్పములు.

"కేనేషితం పతతిప్రేషితం మనః", ఎవనిచే ప్రేరితమగుచు, చోదితమై మనస్సు విషయములగురించి పోవుచున్నది.

"కేనాయం చాల్యతేమనః"
దేని ప్రేరణవలన ఈ మనసు పనిచేయుచున్నది.

## భృగువల్లి

"సయశ్చాయం పురుషే", । "యశ్చాసావాదిత్యే" । "స ఏకః"।

## మాండూక్యము

"అమాత్రోఽనన్త మాత్రశ్చద్వైతనోఽపమః శివః, ఓంకారో

విదితోయేన, సమునిర్నేతరోజనః"। అనగా మాత్రావిరహితమై నట్టియు, ద్వైతముయొక్క ఉపశమముచేయునట్టియు, మంగళస్వరూప మైనట్టియు, నోంకార మెవనిచేత తెలిసికొనబడుచున్నదో, వాడు ముని యగుచున్నాడు. అనగా విద్వాంసుడు. ఇతరులు గారు. మాత్రా విభాగము లేనట్టి ఓంకారము తురీయము. మాత్రా శబ్దమునకు కొలమానమర్ధము. (తురీయమునందట్టి విభాగము లేదుగనుక దీనిని తెలిసికొని అభ్యసించు వాడే విద్వాంసుడు అని అర్ధము).

శ్రుతి :– "యథాస్వప్నే ద్వయాభానం, చిత్తం చలతి మాయయా, తథా జాగ్రద్ద్వయాభాసం చిత్తం చలతి మాయయా ॥

శ్రుతి:– "అద్వయంచ ద్వయాభాసం, మనఃస్వప్నే నసంశయః। అద్వయంచ ద్వయాభాసం, తథా జాగ్రన్న సంశయః ॥"

శ్రుతి :– "మనోదృశ్య మిదంద్వైతం, యత్కించిత్స చరా చరమ్। మనసోహ్య మనీభావే ద్వైతం నై వోపలభ్యతే"।

శ్రుతి :– "ఆత్మ సత్యానుబోధేన, నసంకల్ప యతేయదా। అమనస్తాంతదాయాతి, గ్రాహ్యాభావే తదగ్రహమ్"।

శ్రుతి :– "అకల్పకమజం జ్ఞానం, జ్ఞేయాభిన్నం ప్రచక్షతే। బ్రహ్మ జ్ఞేయమజం నిత్య, మజేనాజం విబుధ్యతే"। అనగా సర్వకల్పనా శూన్యము, పుట్టుకలేనిదియగు జ్ఞానము, జ్ఞేయముకంటె వేరుగాదని బ్రహ్మవేత్తలు పలుకుచున్నారు. బ్రహ్మమును తెలిసికొను జ్ఞానము బ్రహ్మముకంటె వేరుగాదు.



# ఆత్మానుసన్ధాన క్రమము

[ వాశిష్ఠము, పే. 544 ]

శ్లో॥ మమేదంతదయంసోఽహమితి, సంత్యజ్యవాసనాః ।
ఏకనిష్ఠతయాంతస్థ సంవిన్మాత్రపరోభవ ॥

శ్లో॥ ప్రలపన్వి సృజన్గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి ।
నిరస్తమననానస్తే, సంవిన్మాత్రపరోభవ ॥

శ్లో॥ మలంసంవేద్య ముత్సృజ్య, మనోనిర్మలయన్పరమ్ ।
ఆశాపాశానలంభిత్వా స్వసంవిత్తి మనాభవ ॥

ఇది నాది, నేను అను మొదలగు వాసనలను విడచి సర్వమునకునూ ఆ బ్రహ్మమే యధిష్ఠానమని నిశ్చయించి లోనున్న చిదాత్మను భావించుచుండుము. ఏ చిదాత్ముని సాన్నిధ్యంబువలన నీవు గ్రహణాగ్రహణాది, గమనాగమనాది, సమస్త కర్మల నాచరింపగలుగుచున్నావో అట్టి నిర్వికల్పుడు, అనన్తుడు, స్వప్రకాశుడేయగు చిదాత్మ నేనే యని భావించుచుండుము. దృశ్యమను మలమును విడచి ఆశలను తెంచి మనసును నిర్మలమైనదానిగా గావించి నీదు చిద్రూపమును సదా భావించుచుండుము.

కఠ శ్రుతి. 6-9-6-12

"నసన్దృశేతిష్ఠతి రూపమస్య నచక్షుషాపశ్యతి కశ్చనైనమ్ః
హృదామనీషా మనసాభిక్లప్తో యఏతద్విదు, రమృతాస్తే భవన్తి ।"

ప్రత్యగాత్మ చక్షురాదీన్ద్రియ గణమున కగోచరము వికల్ప హీనము, నిశ్చలమగు బుద్ధిచే నద్దానిస్వరూపమును మననము చేయుట

చేత ఆత్మస్వరూపము అభిప్రకాశితమగును. ఇట్లాత్మను తెలిసికొనినవారు అమృతత్త్వమును బొందుదురు. "నైవవాచా నమనసా, ప్రాప్తుంశక్యో నచక్షుషా, అస్తీతి బ్రువతోఽన్యత్ర కథంతదుపలభ్యతే" ॥ ఆత్మ సర్వేన్ద్రియాతీతము. వాక్కుచేతగాని, మనసుచేతగాని, చక్షుస్సుచేతగాని, దానిని బొందశక్యముగాదు. అట్టి స్థితిలో ఆత్మయున్నదనిగాని, లేదనిగాని చెప్పుట వీలుగాదు. ఇది యోగమునందుపలభ్యమగుననిగాని చెప్పుటకెట్లు సాధ్యము.

కఠ. 13-14

"యదాసర్వే ప్రముచ్యన్తె కామాయేఽస్యహృదిశ్రితాః । అథ మర్త్యోఽమృతో భవత్యత్ర బ్రహ్మసమశ్నుతే" ॥

హృదయము నాశ్రయించియున్న సర్వకామములు, నెపుడు నశించునో యపుడు మరణశీలుడగు మనుజుడమరణశీలుడై బ్రహ్మత్వమును బొందును.

"నతత్ర సూర్యోభాతి నచన్ద్రతారకం, నేమావిద్యుతో భాన్తికుతో ఽయమగ్నిః, తమేవభాన్త మనుభాతిసర్వం, తస్యభాసా సర్వమిదం విభాతి"॥

అను వచనముచొప్పున తనకు అహమిదములయందు గలుగుచున్న సర్వప్రకాశము అనగా జ్ఞానమంతయు పరిపూర్ణ సంవిద్రూపుడగు ఆత్మదేననియు, అది తానేననియు, విద్వాంసుడు బాగుగ గ్రహించగలుగును.

మాండూక్య శ్రుతి. 26-29

"ప్రణవం హీశ్వరం విద్యాత్సర్వస్య హృదిసంస్థితమ్ । సర్వవ్యాపి నమోంకారం మత్వాధీరో నశోచతి ।"

ప్రణవ మందరియొక్క హృదయమునందున్న ఈశ్వరునిగా

తెలిసికొనవలయును. బుద్ధిమంతు డోంకారమునంతట వ్యాపించినదానిగా నెరిగి దుఃఖింపడు. పరమాత్మ దేశ కాలాదులచే పరిమితుడు కాడు. అట్టి పరమాత్మను గ్రహించగల ఉత్తమాధికారి సర్వశోక విముక్తుడగు చున్నాడు. అతని హృదయ గ్రంథులన్నియు విచ్ఛిన్నములగుచున్నవి.

"అమాత్రోఽనన్త మాత్రశ్చ ద్వైతస్యోపశమః శివః।
ఓంకారో విదితోయేన సమునిర్నేతరోజనః।"

మాత్రావిరహితమైనట్టియు, అంతములేని పరిచ్ఛిత్తి కలిగినట్టియు, ద్వైతముయొక్క ఉపశమనము చేయునట్టియు, మంగళస్వరూపమై నట్టియు, నోంకార మెవనిచేత తెలిసికొనబడుచున్నదో వాడు ముని యగుచున్నాడు. ఇతర జనము మునులుగారు. మాత్రా విభాగములేనట్టి యోంకారము తురీయము. మాత్రా శబ్దమునకు కొలమానమని యర్థము

"యద్రూపేణ యన్నిశ్చితం తద్రూపం నవ్యభిచరతి తత్సత్యం, యద్రూపేణ యన్నిశ్చితం, తద్రూపం వ్యభిచరేత్త దనృతమిత్యుచ్యతే, అతోవికారోఽనృతః।"

తా॥ ఏ పదార్థ మే రూపమున నిశ్చితమగుచున్నదో ఆ రూపము నకు మార్పులేనపు డది సత్యమనబడును నిశ్చితమగు దేని రూపము మార్పును జెందునో అది యసత్యము. రూపము మారుచున్నదనగా నా రూపము వికారమును జెందుచున్నదని భావము. వికారమంతయు నసత్యము, అనృతమును. వికారములేనిది సత్యము. విద్వాంసుడు, సత్యానృతముల భేదమును బాగుగ తెలిసికొని ప్రపంచమును పరమార్థ శూన్యముగ గ్రహించవలెను.

"స్వప్నమాయే యథాదృష్టే, గంధర్వనగరం యథా।
తథావిశ్వమిదం దృష్టం, వేదాన్తేషు విచక్షణైః॥"

తా॥ స్వప్నమాయా గంధర్వనగరము లే విధముగ జూడబడు చున్నవో, ఆ విధముగనే వేదాన్తములయందు విచక్షణుడగు విద్వాం సునిచేత నీ ప్రపంచము చూడబడుచున్నది.

(6)

# బోధసారాంశము

[ వివే చూ. శ్లో॥ 395 ]

శ్లో॥ వక్తవ్యం కిముఽవిద్యతేఽత్ర బహుధా,
బ్రహ్మైవ జీవస్స్వయమ్ ।
బ్రహ్మైతజ్జగదాతతంను సకలం,
బ్రహ్మాద్వితీయం శ్రుతేః ॥
బ్రహ్మైవాహమితి ప్రబుద్ధమతయః.
సంత్యక్త బాహ్యాఃస్ఫుటమ్ ।
బ్రహ్మీభూయ వసన్తిసన్తత,
చిదానన్దాత్మనైతద్ధ్రువమ్ ॥

అనగా విస్తరించి చెప్పదగిన దేమి కలదు ? జీవుడు స్వయముగ బ్రహ్మమే, "బ్రహ్మైవేదం సర్వమ్" అణువు మొదలు సకల ప్రపంచము బ్రహ్మమే. "ఏకమేవాద్వితీయం బ్రహ్మ", బ్రహ్మము ఏకము, అద్వితీయము. "ఆత్మైవేదం సర్వమ్", సర్వము ఆత్మయేనని శ్రుతులు ఘోషించుచున్నవి. కనుక నీ ప్రకారము, "అహం బ్రహ్మాస్మి", నేనే బ్రహ్మను, అని స్వాత్మాభిన్న బ్రహ్మజ్ఞానముగల మహాత్ములు బాహ్య విషయములను స్మరింపక (అనగా వాటియందు సత్యత్వబుద్ధిని వదలి) బ్రహ్మీభూతులై, ఎల్లప్పుడును చిదానన్దరూపముతో ప్రవర్తించుచుందురు. ఇది నిశ్చయము.

"సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ", యను వాక్యమున్నను,

"మృగతృష్ణాం భసిస్నాతః ఖపుష్ప కృతశేఖరః, ఏషవంధ్యా సుతో యాతి శశశృంగధనుర్ధరః" అనగా గొడ్రాలి బిడ్డడు మరుమరీచి

కల యందు స్నానముచేసి యాకాశ పుష్పాలంకృతుడై శశవిషాణ రూపమగు ధనుస్సును ధరించి వచ్చుచున్నాడను వాక్యమువలెనే అర్ధ శూన్యము కాకూడదాయని పూర్వపక్షము. "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" అనెడి వాక్యము యిట్టి అర్ధరహిత వాక్యము గాదనియు, స్వరూపలక్షణములుగల అర్ధవంతమగు వాక్యమనియు, భాష్యములందు నిరూపించి సిద్ధాన్తపరచి యున్నారు.

## జ్ఞాని ప్రారబ్ధానుభవము

తత్త్వజ్ఞానము- జీవుడు అనుభవింపవలసిన సుఖదుఃఖ ప్రారబ్ధానుభవములు, పరమార్ధమున అవాస్తవములు, కల్పితమాత్రము లనియే తెలియజేయునుగాని, ప్రారబ్ధమును నశింపచేయజాలదు కాని యీ తత్త్వజ్ఞానము వాటి భోగ తీవ్రతను తగ్గించును. అనగా సుఖ దుఃఖముల రెంటిని, అల్పదృష్టితోడను, స్వల్పానుభవములతోడను ననుభవించవలయును, గాని ప్రారబ్ధానుసరణానుభవము సాధారణముగ తప్పదు. అయినను యిట్టి క్షీణానుభవములు భావి ప్రతిబంధములుకాక వేయించిన ధాన్యమువలె, వాటియందుండు అంకురశక్తి నశించి, ఆహారమునకు మాత్రమే యెట్లు ఉపయోగించునో, అట్లే యుండును. అనగా భావి ప్రతిబంధమును కలిగింపక అనుభవము నిచ్చి భోగము తోడ చరితార్ధమగును.

శ్లో॥ అహం సర్వమిదం విశ్వం, జ్ఞానమాత్ర స్వరూపతః ।
సర్వసాక్షీ ప్రత్యగాత్మా, పరమాత్మా హమచ్యుతః ॥

శ్లో॥ జ్ఞానమాత్ర స్వరూపోహం, జ్ఞాతృజ్ఞేయ వివర్జితః ।
అఖండ పరిపూర్ణోహం, నిర్మలాకాశ వత్సదా ॥

జ్ఞానికి దేహాత్మభ్రాంతి లేకపోయినను, అజ్ఞానదశయందలి యల వాటునుబట్టి (అనగా దేహధర్మతాదాత్మ్యమునుబట్టి) నేను మనుష్యుడ

నను వ్యవహారము జరుగుచుండును. ప్రారబ్ధము నశించెనేని వ్యవహారము నశించును. అది నశించనంతకాలము ఎంత ధ్యానము చేసినను వ్యవహార ముపశమింపదు. కాని వ్యవహారము యథాప్రాప్తముగ జేయుచుండునుగాని, వానియందు రాగద్వేషాదియుక్తుడై సక్తత నొందడు. ఇట్టి వ్యవహారము భావి ప్రతిబంధమును గలుగజేయజాలదు.

## బ్రహ్మస్వరూప వాక్యము - శ్రుతి

"యస్మాత్పరంనా, పరమస్తి కించిద్యస్మాన్నాణీయో నజ్యాయోస్తికశ్చిత్ । వృక్ష ఇవ స్తబ్ధోదివి తిష్ఠత్యేకస్తేనేదం పూర్ణంపురుషేణ సర్వమ్"

## శ్రుతి - ఆనన్దవల్లి

"రసోవై సః" । "రసగ్గ్ం హ్యేవాయం లబ్ధ్వాఽఽనన్దీ భవతి । కోహ్యేవాన్యాత్కః ప్రాణ్యాత్ । యదేష ఆకాశ ఆనన్దోనస్యాత్ ।"

ఆ బ్రహ్మము రసస్వరూపము. ఈ ప్రాణి జాలమంతయు ఆ రసమునుబొంది ఆనన్దము గలదగుచున్నది. ఈ ఆనన్దము హృదయాకాశమునందు లేనియడల యెవడు ప్రాణాపానచేష్టను చేయగలుగును ? (ie) ప్రాణము జడముగనుక దీని చేష్టకు చైతన్యమొకడుండి తీరవలయును. లేనిచో సాధ్యముకాదు. చైతన్యస్వరూపుడగు పరమాత్మ స్వయముగ నసంగుడైనను, ఉపాధి కల్పితసంబంధముచే దానికి కల్పిత క్రియా కర్తృత్వములు సంభవించుచున్నవి. ఇదియే సర్వచేష్టారూపకమై ఆనన్దమయరూపమున భాసించుచున్నది. స్వతస్సిద్ధముగ బ్రహ్మ ఆనన్దస్వరూపుడు గనుక, బ్రహ్మ అస్తిత్వములేనిదే ఆనన్దము భాసించుటకు వీలులేదు. ఇట్లు పరిపూర్ణానన్దస్వరూపుడై, హృదయ గుహాయందున్న (తెలియబడునట్టి) బ్రహ్మయు, ఆనన్దాభాసముల ననుభవించుచున్న జీవుడునూ, ఒక్కటియే. ఇలా తెలిసికొని స్వానుభవమునొందినపుడే

అభయప్రతిష్ఠ కలుగును. లేక ఏ మాత్రము నేనువేరు, బ్రహ్మవేరు, యని తలచినను భయకారణమగును. "అథసోఽభయంగతో భవతి, యదాహ్యే వైషఏతస్మిన్నుదర మన్తరంకురుతే । అథతస్య భయం భవతి" । అని శ్రుతి తెలుపుచున్నది.

పంచదశి, శ్రుతివాక్య విచారము

శ్రుతి॥ తద్యథేషీకా తూలమగ్నౌ ప్రోతం ప్రదూయేతైవం హాస్య, సర్వే పాప్మానః ప్రదూయన్తే ॥ అనగా లేత గడ్డిపరకలుగాని, దూదిగాని, యెట్లు అగ్నిచే ధ్వంసము చేయబడునో, ఆ విధమున జ్ఞాని యొక్క సంచితకర్మలన్నియు, తత్త్వజ్ఞానమువలన, నశింపజేయబడును. అని యీ శ్రుతివాక్యము తెలుపుచున్నది. ఈ అర్థమునే గీత :—

శ్లో॥ యథైథాంసి సమిద్ధోఽగ్నిర్భస్మ సాత్కురుతేర్జున ।
జ్ఞానాగ్నిః స్సర్వకర్మాణి, భస్మసాత్కురుతేతథా ॥

శ్లో॥ యస్యనాహంకృతో భావో, బుద్ధిర్యస్య నలిప్యతే ।
హత్వాపిస ఇమాన్ లోకాన్, నహంతిననిబధ్యతే ॥

అని తెలుపుచున్నది.

శ్రుతి॥ ఆత్మానంచేద్విజానీయా, దయమస్మీతిపూరుషః ।
కిమిచ్ఛన్కస్యకామాయ, శరీరమనుసంజ్వరేత్ ॥

తా॥ శాస్త్రవిచారముచే కూటస్థాత్మ యొక్క యథార్థస్వరూపమును తెలిసికొని ఆ యాత్మయే నేను అను నిశ్చయముగల జ్ఞాని, ఏ భోక్తయొక్క ప్రీతికొరకు, ఏ ఫలము నిచ్ఛయించుచు, దేహము పరితపించిన యడల, దానితోపాటు తానును పరితపించును. బ్రహ్మము నేను యనెడి నిశ్చయముచే జ్ఞానికి భోక్తృత్వాద్యభిమానము యుండదు. ద్వైతము మిథ్యయనెడి నిశ్చయముచే నది భోగ్యము కాదు అన్న

నిశ్చయముండును. అందుచే జ్ఞానికి కర్తృత్వ భోక్తృత్వములవలన కలిగెడి, యైహికదుఃఖముగాని, అట్టి దుఃఖమువలన తాపముగాని యుండదు. వి॥ సచ్చిదానన్ద బ్రహ్మస్వరూపమందు కల్పింపబడిన నామ రూపాత్మకమగు ప్రపంచ విషయమును విడిచిపెట్టి అనగా మిథ్యా మాత్రమని నిశ్చయించి సచ్చిదానన్ద బ్రహ్మమును మాత్రము చింతించు చున్న బుద్ధికి నిర్గుణ బ్రహ్మమే స్ఫురించుచుండును ఇది నిర్విషయ బ్రహ్మ సాక్షాత్కారమున కుపాయము. సచ్చిదానన్ద స్వరూపమగు, ఆత్మ ప్రకాశము యెప్పుడునూ లోపించుటలేదు, అనగా ఆత్మప్రకాశము నిత్యమని, "నహిద్రష్టు ర్దృష్టేర్విపరిలోపో విద్యతే", అని శ్రుతివాక్యము తెలుపుచున్నది. "నహిదృష్టే అనుపపన్నంనామ", కనుబడుచున్న దానిని లేదనుట సంభవము కాదు. అని శాస్త్రవచనము. "సంహతానాం పరార్ధత్వాత్". ఆర్షవాక్యము.

జీవేశ్వరులిద్దరునూ కల్పితులే

జీవుడును, ఈశ్వరుడునూ యిద్దరునూ మాయాకల్పితులే.

"జీవేశావా భాసేన కరోతిమాయా చావిద్యాచ"।

అని తాపనీయశ్రుతి తెలుపుచున్నది.

ఈ ఆత్మవిచారము అనునది యెట్లు ఫలించుననిన :—

ధ్యా. దీ. ప్ర. శ్లో॥ 36-37

శ్లో॥ బహువారమధీతేఽపి, యదానాయాతి చేత్పునః।
దినాన్తరేఽనధీత్యైవ పూర్వాధీతం స్మరేత్పుమాన్॥

శ్లో॥ కాలేన పరిపచ్యంతే, కృషిగర్భాదయో యథా।
తద్వదాత్మ విచారోఽపి శనైః కాలేన పచ్యతే॥

అని శ్రీ విద్యారణ్యులు తెలుపుచున్నారు. ఈ ఆత్మవిచారమను కృషి, ఎవరికినీ, ఎప్పటికినీ వ్యర్ధముగాదని "శుచీనాం శ్రీమతాంగేహే"

"తత్రతం బుద్ధి సంయోగం", అని స్పష్టముచేయుచు, "పూర్వాభ్యాసేన తేనైవ" అని గీత- 6 అ. 47, 49, 50 శ్లోకములతో, ఇట్టివాడు కైవల్యము అనగా మోక్షమునొందునని తెలుపుచున్నది. శ్రుతులు బ్రహ్మ స్వరూపమును, విధి నిషేధరూప గుణ ప్రకారములతోడ బోధించుచున్నవి. విధి ప్రకారము ఎట్లన "ఆనన్దో బ్రహ్మ" "విజ్ఞాన మానన్దం బ్రహ్మ", "నిత్యశుద్ధో, బుద్ధ,స్సత్యో, ముక్తో, నిరంజనో, విభు, రద్వయ, ఆనన్దః, పరః, ప్రత్యగేకరసః", యనియు, "సత్యమ్ జ్ఞానమనన్తమ్", అను మొదలగు వాక్యములతోడ బోధించును. ఇంక నిషేధ్యగుణము లేవి యనిన, శ్రుతి. "అస్థూల మనణ్వ హ్రస్వం యత్తదద్రేశ్యమగ్రాహ్యం, అశబ్దమ స్పర్శమ రూపమవ్యయం", అను మొదలగు వాక్యములచేతను బోధించుచున్నది. కాని ఈ గుణములన్నిటినీ ఉపలక్షణములుగ తీసుకుని, కేవలమగు బ్రహ్మతత్త్వమే ఉపాసనీయము, అనుసన్ధించవలసినదని జిజ్ఞాసువులు గ్రహించవలెను.

# లోకానుభవనీతి న్యాయవచనములు

1. "నజాతుకామః కామానా ముపభోగేన శామ్యతి, హవిషా, కృష్ణ వర్త్మేవ, భూయ ఏవాభివర్ధతే"
2. "ఆసుప్తే రామృతేః కాలం నయేద్వేదాన్త చిన్తయా"
3. "మిథిలాయాం ప్రదగ్ధాయాం, నమేకించన దహ్యాతి"
4. "ఏతావన్తం కాలం, సుఖమహామస్వాప్సం నకించిదహ మవేదిషమ్"
5. "మనఏవమనుష్యాణాం, కారణం బంధమోక్షయోః"
6. "ప్రక్షాళనాద్ధిపంకస్య, దూరాదస్పర్శనం వరం"
7. "అనుక్తమప్యూహతి, పండితోజనః"
8. "కుశలంచకుతోస్మాకం, సంసారే తిష్ఠతామిహ"
9. "యథాఖరశ్చందన భారవాహీ, భారస్య వేత్తా నతుచన్దనస్య"
10. "జాగ్రతోహి భయంనాస్తి"
11. "సర్వం వస్తుభయాన్వితం భువినృణాం, వైరాగ్యమేవాభయం"
12. "మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవగరీయసీ", "స్వస్వరూపాను సన్ధానం భక్తి రిత్యభిధీయతే"
13. "విజ్ఞాయ సేవితశ్చోరో, మైత్రీమేతి నచోరతామ్"
14. "తరతిశోక మాత్మవిత్"
15. "ప్రయోజన మనుద్దిశ్య నమందోఽపి ప్రవర్తతే"
16. "స్వకర్మసూత్ర గ్రథితోహిలోకః"
17. "యావన్నాభ్యుదితోబోధ, స్తావన్నః కుశలం కుతః"
18. "నచేదిహావేదీ న్మహతీవినష్టిః"

19. "దేహళీ దీపన్యాయం", అనగా గడపమీదనున్న దీపములాగున అట్టిది లోపలను, బయటను గూడ ప్రకాశింపచేయుచుండును. (ఆత్మ ఇటువంటిది)

20. "నహిజ్ఞానేన సదృశం, పవిత్ర మిహ విద్యతె"

21. "యథాకర్మ యథాశ్రుతమ్"

22. "కర్మానుబన్ధీని మనుష్యలోకే"

23. "రక్షన్తి పుణ్యాని పురాకృతాని"

24. "బుద్ధిః కర్మానుసారిణీ"

25. "దర్వీపాకరసం యథా"

26. "నష్టాశ్వదగ్ధరథన్యాయం"

27. "కంఠ చామీకరన్యాయం"

28. "యక్షనురూపో బలిః"

29. "సంహతానాం పరార్థత్వాత్"

30. "శతాంధాః కూపం ప్రవిశన్తి"

31. "బాలాదపి సుభాషితమ్"

32. "మర్కట కిశోరన్యాయం, మార్జాల కిశోరన్యాయం"

33. "నింద్యేష్వపి గుణోగ్రాహ్యః"

34. "శాఖాచంద్రన్యాయం"

35. "జాత్యంధ గజదృష్టిన్యాయం"

36. "హితంబ్రూయాత్, ప్రియంబ్రూయాత్, నబ్రూయాత్కించి దప్రియమ్"

37. "దృశ్యం రంజయత్యపి, మిథ్యైవ, స్వప్నస్త్రీ సురతం యథా"

38. "భారోఽవివేకినః శాస్త్రం, భారోజ్ఞానంచ రాగిణః"

39. "జీవాః అయశ్శలాక సదృశాః పరస్పరమ సంగినః"

40. "ప్రాజ్ఞం ప్రాప్తంనపృచ్ఛంతి, సందిహం తేనరాధమాః"

41. "అనాహూతోఽధ్వరం గచ్ఛేత్"

42. "మాతాపితృ సహస్రాణి, జన్మోర్జన్మనిజన్మని"

43. "అభ్యాసాత్సర్వసిద్ధిః స్యాదితి వేదానుశాసనం"

44. "మహాశనానా మేకాంతే భోజనంహి సుధాయతే"

45. "ప్రాప్తేపి సోమయాజిత్వే, నంబిత్వం నైవముంచతి"

46. "భక్షితేపి లశునే వ్యాధిర్నశామ్యతి"

47. "సతికుడ్యే చిత్ర కర్మాణి"

48. గీత :— "జాతస్యహి ధ్రువోమృత్యు, ర్ధ్రువంజన్మ మృతస్యచ"

వాశి. పే. 982

49. శ్లో॥ నదేవాదండ మాదాయ, దండయన్త్య పరాధినమ్ ।
బుద్ధింతస్యాపకర్షన్తి, తేనాసౌ దండ్యతే స్వతః ॥

స్వత్వమునకు లక్షణము :— యథేష్ట వినియోగ యోగ్యత్వము.



# ప్రాస్తావిక శ్లోకములు – సితి వచనములు

శ్లో॥ పితా రత్నాకరోయస్య, యస్య లక్ష్మీ స్సహోదరీ ।
శంఖూరోదితి భిక్షార్థం, ఫలం భాగ్యానుసారతః ॥

శ్లో॥ సుఖస్య దుఃఖస్య నకోపిదాతా, పరోదదాతీతి కుబుద్ధిరేషా ।
అహంకరోమీతి వృథాభిమానః, స్వకర్మసూత్ర గ్రథితోహిలోకః ॥

"యథాకర్మ యథాశ్రుతమ్"

శ్లో॥ హసద్భిః క్రియతేకర్మ, రుదద్భి రనుభూయతే ।
అకారణహతో వాలీ, తేనేదంకర్మణః ఫలమ్ ॥

శ్లో॥ విషయాభిముఖం దృష్ట్వా, విద్వాంసమపి విస్మృతిః ।
విక్షేపయతిధీదోషై, ర్యోషా జారమివ ప్రియమ్ ॥

వాశి. పే. 800

శ్లో॥ అఖిల మిదమహం, మమైవసర్వం, త్వహమపినాహమథేతరచ్చ నాహమ్ ।
ఇతి విదితవతో జగత్కృతంమే, స్థిరమథవాస్తుగతజ్వరోభవామి ॥

శరీర పోషణకైనను, వ్యవహారము తప్పదుగదా? అట్టితరి యీ నిరన్తర బ్రహ్మాభ్యాసము సాధ్యమాయను శంకకు సాధ్యమేనని తెలుపుచున్నారు—

శ్లో॥ పరవ్యసనినీనారీ, వ్యగ్రాపి గృహకర్మణి ।
తదేవా స్వాదయత్యన్తః, పరసంగ రసాయనమ్ ॥

## బోధ వచనములు

శ్లో॥ దీర్ఘ స్వప్నమిదం విశ్వం, దీర్ఘం వాచిత్త విభ్రమమ్ ।
దీర్ఘంవాపి మనోరాజ్యం, సంసారం విద్ధిరాఘవ ॥

శ్లో॥ చిదాకాశ స్వరూపోహం, పరిపూర్ణ మివామ్బరమ్ ।
భ్రాంతిమాత్ర మిదం విశ్వం, విశ్వమాత్మనికల్పితమ్॥

శ్లో॥ దీర్ఘ స్వప్నమిదం విశ్వం, విశ్వంబ్రహ్మణికల్పితమ్ ।
కల్పితశ్చిత్త విభ్రమాత్, రజ్జు సర్పఇవోదితమ్ ॥

శ్లో॥ సంసారో మనసాపుంసః, కల్పితోఽస్తి నవస్తుతః ।
మనః శూన్యే సుషుప్త్యాదౌ, సంసారో నైవదృశ్యతే ॥

శ్లో॥ యత్రయత్ర మనస్ఫూర్తి, స్తత్రతత్ర జగత్త్రయమ్ ।
యత్రయత్ర మనోనాస్తి, తత్రతత్ర నకించన ॥

శ్లో॥ దీర్ఘ సంసారరోగస్య, విచారోహి మహౌషధమ్ ।
ఆత్మజ్ఞానం వినాసాధో, సంసారో ననివర్తతే ॥

శ్లో॥ నిశ్చింతో విగతాభీష్టో, సర్వం బ్రహ్మేతినిశ్చయే ।
తిష్ఠత్వ మచలోవిద్వాన్, స్వాత్మలాభ పరాయణః ॥

శ్లో॥ కరోతు భువనేరాజ్యం, విశత్వాకాశమంబువా ।
స్వాత్మలాభా దృతేవిద్వాన్, విశ్రాంతిం నాధిగచ్ఛతి ॥

శ్లో॥ నిస్సంగ వ్యవహారిత్వాత్, భవభావన వర్జనాత్ ।
శరీరతత్త్వ దర్శిత్వాత్, వాసనా నప్రవర్తతే ॥

శ్లో॥ మమపుత్రా మమధన, మయంసోఽహమిదం మమ ।
ఇతీయ మిన్ద్రిజాలేన, వాసనైవాధివల్గతే ॥

శ్లో॥ అనుభూతిప్రదం విశ్వ, మపిసర్వం నవా స్తవమ్ ।
రంజయత్యపి మిథ్యైవ, స్వప్నస్త్రీ సురతం యథా ॥

శ్లో॥ దేశక్రమేణ ధనమల్ప విగర్హణేన, తేనాంగ సాధుజన
మర్జయ మానపూర్వమ్ ।
తత్సంగమోత్థ విషయాద్య వహేళనేన, సమ్యగ్విచార
విభవేన తవాత్మలాభః ॥

శ్లో॥ అనాగతానాం భోగానా, మవాంఛన మకృత్రిమమ్ ।
ఆగతానాంచ సంభోగ, ఇతిపండిత లక్షణమ్ ॥

శ్లో॥ నధనానినమిత్రాణి, నశాస్త్రాణి నబాంధవాః ।
నరాణా ముపకుర్వన్తి, మగ్నస్యాత్మ సముద్ధృతౌ ॥

శ్లో॥ మనోమాత్రేణ సుహృదా, సదైవ సహవాసినా ।
సహకించి త్పరామృశ్య, భవత్యాత్మా సముద్ధృతౌః॥

శ్లో॥ ననిరోధో నచోత్పత్తి, ర్నబద్ధో నచసాధకః ।
నముముక్షు ర్నవైముక్త, ఇత్యేషా పరమార్థతా ॥

శ్లో॥ వాగ్వైఖరీశబ్ద ఝరీ, శాస్త్రవ్యాఖ్యాన కౌశలమ్ ।
వైదుష్యం విదుషాంతద్వత్ భుక్తయేనతు ముక్తయే ॥

శ్లో॥ వీణాయా రూపసౌందర్యం, తంత్రీవాదన సౌష్ఠవమ్ ।
ప్రజారంజన మాత్రంతు, నతుసామ్రాజ్య సిద్ధయే ॥

శ్లో॥ అనుభూతింవినా మూఢో, వృథాబ్రహ్మణి మోదతే ।
ప్రతిబింబిత శాఖాగ్ర, ఫలాస్వాదన మోదవత్ ॥

శ్లో॥ బద్ధముక్తో మహీపాలో, గ్రామమాత్రేణ తుష్యతి ।
పరైరబద్ధోఽనాక్రాంతో, నరాష్ట్రం బహుమన్యతే ॥

శ్లో॥ ఊర్ధ్వబాహుర్విరౌమ్యేష, నచకశ్చి చ్ఛృణోతిమే ।
అసంకల్పః పరంశ్రేయః, సకిమన్తర్న భావ్యతే ॥

శ్లో॥ కిలతూష్ణీం స్థితేనైవ, తత్పదం ప్రాప్యతే పరమ్ ।
పరమం యత్రసామ్రాజ్య, మపిరామతృణాయతే ॥

శ్లో॥ దేవాదేరపిదేహోఽయం, ద్వయాత్మైవ స్వభావతః ।
అజ్ఞమస్త్వథ తజ్జంవా, యావత్స్వాన్తం శరీరకమ్ ॥

శ్లో॥ అహేతు రక్రమంభాతి, చితికల్ప క్రియాగణః ॥
క్షీణేనైవ యథాస్వప్నే, మృతిజన్మాది సత్వరాః ॥

శ్లో॥ అనుభూతేరభావేఽపి, బ్రహ్మాస్మీత్యేవ చింత్యతామ్ ।
అప్యసత్ప్రాప్యతే ధ్యానా న్నిత్యాప్తం బ్రహ్మకింపునః ॥

శ్లో॥ అవిచారకృతోబన్ధో, విచారేణ నివర్తతే ।
తస్మాజ్జీవ పరాత్మానౌ, సర్వదైవ విచారయేత్ ॥

వాశి. పే. 1110, 1184, 1188

శ్లో॥ ఏకదేశస్థితాత్పుంసో, దూరాయాతస్యచేతసః ।
యద్రూపం సకలం మధ్యే, తద్రూపం పరమాత్మనః ॥

శ్లో॥ పదార్థ జాతం శైలాది, యథాస్వప్నే పురాదిచ ।
చిదేవైకం పరంవ్యోమ, తథా జాగ్రత్ పదార్థభూః ॥

శ్లో॥ చిత్స్వభావే యథాస్వప్నే, ఆస్తేసర్గ ఇవేహయః ।
అసర్గేసర్గవద్భాతి, తథాపూర్వం మహామ్బరే ॥

శ్లో॥ యథాస్వప్న పురంజన్తో, శ్చిన్మాత్ర ప్రవిజృమ్భితమ్ ।
తద్వైవసర్గః సర్గాదౌ, శుద్ధచిన్మాత్ర జృమ్భితమ్ ॥

శ్లో॥ భావ్యభావక భావాది, భూమీనాం భావనం భృశమ్।
సర్వం చిన్నభఏవాచ్ఛ, మాత్మనాత్మని సంస్థితమ్॥

శ్లో॥ ఏవంస్థితే కుతఃసర్గః, కుతోవిద్యా క్వచాజ్ఞతా।
బ్రహ్మైశాన్తం ఘనం సర్వం, క్వాహంకారాదయః స్థితాః॥

శ్లో॥ వాసనాయా స్తథా వహ్నే, ఋణవ్యాధి ద్విషామపి।
స్నేహవైర విషాణాంయః, శేషః స్వల్పోఽపిబాధతే॥

జీవునకు సంసారదుఃఖ కారణము, "సర్వానర్ధహేతు రాత్మాఽనవబోధఏవ", అని వార్తికకారులు తెలుపుచున్నారు.

శ్లో॥ యయాయయా భవేత్పుంసాం, వ్యుత్పత్తిః ప్రత్యగాత్మని।
సాసైవప్రక్రియేహస్యా, త్సాధ్వీత్యా చార్య భాషితమ్॥



# కొన్ని భగవద్గీత సందర్భ శ్లోకములు

శ్లో॥ బ్రహ్మాది స్తంబపర్యన్తా, మృషామాత్రా ఉపాధయః ।
తతఃపూర్ణం స్వమాత్మానం, పశ్యేదేకాత్మ నాస్థితమ్ ॥

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపిమాంవిద్ధి, సర్వక్షేత్రేషు భారత ।
క్షేత్ర క్షేత్రజ్ఞయో ర్జ్ఞానం, య త్తత్ జ్ఞానం మతంమమ ॥

శ్లో॥ అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం, త త్త్వజ్ఞానార్ధ దర్శనమ్ ।
ఏతత్ జ్ఞాన మితిప్రో క్త, మజ్ఞానం యదతోఽన్య థా ॥

శ్లో॥ జ్యోతిషామపితజ్జ్యోతిః, తమసః పరముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం, హృదిసర్వస్య ధిష్ఠితమ్ ॥

శ్లో॥ సమంసర్వేషు భూతేషు, తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।
వినశ్య త్స్వవినశ్య న్తం, యఃపశ్యతిసపశ్యతి ॥

శ్లో॥ ప్రకృత్యైవ చకర్మాణి, క్రియమాణాని సర్వశః ।
యఃపశ్యతి తథాత్మాన, మకర్తారం సపశ్యతి ॥

శ్లో॥ అనాదిత్వా న్నిర్గుణత్వాత్, పరమాత్మాహమవ్యయః ।
శరీర స్థోపికౌ న్తేయ, నకరోతి నలిప్యతే ॥

శ్లో॥ యథాసర్వగతం సౌక్ష్మ్యాదాకాశం నోపలిప్యతే ।
సర్వత్రావస్థితో దేహే తథాఽఽత్మానో పలిప్యతే ॥

శ్లో॥ యథాప్రకాశ యత్యేకః, కృత్స్నం లోకమిమం రవిః ।
క్షేత్రం క్షేత్రీ తథాకృత్స్నం ప్రకాశయతి భారత ॥

శ్లో॥ క్షేత్ర క్షేత్రజ్ఞయోరేవ మన్తరం జ్ఞానచక్షుషా ।
భూతప్రకృతి మోక్షంచ యేవిదుర్యాన్తితే పరమ్ ॥

ఏది నిత్యమో, నిర్వికారమో, నిరవయవమో, అజమో, అవినాశియో, సర్వాధారమో, సర్వధీసాక్షి భూతమో, అవ్యయయో, అఖండ సచ్చిదానన్ద స్వరూపమో, సత్యజ్ఞానన్తమో, స్వాత్మాభిన్న, స్వప్రకాశ, సర్వాధిష్ఠాన, అఖండ పరిపూర్ణ చిద్ఘనానన్దరూపమో, అదియే నేను, "అహం" అని ధ్యానించుచుండుము.

బ్రహ్మ విద్యాభ్యాసకునకు తనకీవిద్య ఫలించునా? ఎప్పుడు తనకీ విద్య ఫలించునని తెలిసికొనుటకు పరీక్షగా, గీతా 2 అ. శ్లో. 52, 53 లు చూడవలయును.

శ్లో॥ యదాతేమోహకలిలం, బుద్ధిర్వ్యతితరిష్యతి ।
తదాగన్తాఽసి నిర్వేదం, శ్రోతవ్యస్య శ్రుతస్యచ ॥

శ్లో॥ శ్రుతి విప్రతిపన్నాతే, యదాస్థాస్యతి నిశ్చలా ।
సమాధావచలాబుద్ధి, స్తదాయోగ మవాప్స్యసి ॥

అనగా, ఎప్పుడు నీ బుద్ధి దేహాభిమానమనెడు కాలుష్యమును విడుచునో, అప్పుడు నీవు వినదగిన దానికి, విన్నదానికినీ, వైరాగ్యమును బొందుదువు.

ఎప్పుడు వేదాన్త వాక్యములు వినుటచే నీ బుద్ధి నిశ్చలమై యుండి సమ్యక్ జ్ఞానమునందు నిశ్చలమైయుండునో, అప్పుడు నీకీ యోగఫలము తప్పక సిద్ధించును.

మరియును, గీత 6 అ. శ్లో॥ 18, 19, 20, 21, 22, 23 లు గ్రంథమందు చూడదగును.

శ్లో॥ యత్రోపరమతేచిత్తం, నిరుద్ధం యోగసేవయా ।
యత్రచైవాత్మనాఽఽత్మానం, పశ్యన్నాత్మనితుష్యతి ॥

శ్లో॥ సుఖమాత్యన్తికం యత్త, ద్బుద్ధి గ్రాహ్యమతీన్ద్రియమ్ ।
వేత్తియత్ర నచైవాయం, స్థితశ్చలతి తత్త్వతః ॥

శ్లో॥ యంలబ్ధ్వా చాపరంలాభం, మన్యతే నాధికంతతః ।
యస్మిన్‌స్థితో నదుఃఖేన, గురుణాఽపివిచాల్యతే ॥

శ్లో॥ తం విద్యాద్దుఃఖ సంయోగ, వియోగం యోగసంజ్ఞితమ్।
యోగినో యతచిత్తస్య, యుఞ్జతో యోగమాత్మనః ॥

శ్లో॥ యదావినియతం చిత్త, మాత్మన్యే వావతిష్ఠతే ।
నిస్పృహస్సర్వకామేభ్యో, యుక్త ఇత్యుచ్యతే తదా ॥

శ్లో॥ యథాదీపో నివాతస్థో, నేఙ్గతేసోపమాస్మృతా ।
యోగినో యతచిత్తస్య, యుఞ్జతో యోగమాత్మనః ॥

శ్లో॥ ప్రశాన్త మనసంహ్యేనం, యోగినం సుఖముత్తమమ్ ।
ఉపైతి శాన్తరజసం, బ్రహ్మభూత మకల్మషమ్ ॥

ఎప్పుడు యోగానుష్ఠానముచే, నిరుద్ధమగు చిత్తము ఉపరతిని అనగా శాంతిని బొందుచుండునో, యెప్పుడు అభ్యాసముచే పరిశుద్ధమగు అంతఃకరణముచేత ఆత్మ జ్యోతిస్సును తనలో జూచుచు సంతోషము నొందుచుండునో,

ఎప్పుడు ఇన్ద్రియములకు గోచరముగాక మనస్సుచేతనే తెలియ దగు, ఆనన్దము ననుభవించుచుండునో, యెప్పుడు తత్త్వరూపమగు బ్రహ్మానన్దమును నొందుచున్నవాడై చలనమును అనగా సంశయ, విపర్యయముల నొందడో,

ఏ లాభమును పొందుచుండుటవలన, యితర లాభములను అంతకన్న హెచ్చుగా తలంపడో, యే యాత్మతత్త్వమందున్నవాడగుచు, గొప్ప దుఃఖములొచ్చినను చలింపకుండునో, దానినే దుఃఖము లేని యోగముగా తెలిసికొని అట్టి అభ్యాసమును పట్టుదలతో విసువు జెందని మనసుతోడ నాచరించుచుండవలయును

ఎప్పుడు ఏకాగ్రముగ చిత్తమాత్మయందు నిలుచునో, యెప్పుడు కోరికలన్నియూ క్షీణించునో, లేకపోవునో అప్పుడు యోగము సిద్ధి చుచున్నదని తెలిసికొనవలయును.

చిత్త నిరోధము చేసికొని అనగా చిత్త విక్షేపము తగ్గి ఆత్మానుసన్ధానముజేయు యోగికి, గాలిలేనిచోట దీపమెట్లు చలించక యుండునో, అట్లే చిత్తవిక్షేపము అనగా చిత్తచలనము లేకుండ యుండును అనగా యోగము సిద్ధించుచున్నట్లు తెలిసికొనవలయును.

బాగుగ శాంతించిన మనస్సుగలవాడును, రజోగుణము క్షీణించిన వాడును అగు యోగికి, ఉత్తమమగు జీవన్ముక్తి, దాని సుఖము లభించును.

ఆత్మజ్ఞాన సాధనములను, అభ్యాసమును తెలుపునట్టి శ్లోకములు

గీత 13 అ. శ్లో. 8, 9, 10, 11, 12

శ్లో॥ అమానిత్వ మదమ్భిత్వ, మహింసా క్షాన్తిరార్జవమ్ ।
ఆచార్యోపాసనం శౌచం, స్థైర్యమాత్మ వినిగ్రహః ॥

శ్లో॥ ఇన్ద్రియార్థేషు వైరాగ్య మనహంకార ఏవచ ।
జన్మ మృత్యుజరావ్యాధి, దుఃఖదోషాను దర్శనమ్ ॥

శ్లో॥ అసక్తి రనభిష్వంగః పుత్రదార గృహాదిషు ।
నిత్యంచ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు ॥

శ్లో॥ మయిచానన్యయోగేన, భక్తి రవ్యభిచారిణీ।
వివిక్తదేశసేవిత్వ, మరతిర్జన సంసది॥

శ్లో॥ అధ్యాత్మజ్ఞాన నిత్యత్వం, తత్త్వజ్ఞానార్థ దర్శనమ్।
ఏతత్ జ్ఞానమితిప్రోక్త, మజ్ఞానం యదతోఽన్యథా॥

## కర్తృత్వాది నిర్ణయము — (గీతాబోధ)

శ్రద్ధాళువులగు జిజ్ఞాసువులగువారు ఇంతవరకును మనము జేసిన ఆత్మవిచారణనుబట్టి, యిపుడు కర్తృత్వభోక్తృత్వాదులు ఆభాసములను నిశ్చయము నొందుటకుగాను భగవద్గీతలనుండి కొన్ని శ్లోకముల సంపుటిజేసి నిచట అర్థసహితముగ నుదాహరించుచున్నాడను.

మానవునకు కర్తృత్వ భోక్తృత్వ సంబంధమంతయు, ప్రారబ్ధ ఫలము ననుభవించుటకు కల్పితమైన యీ స్థూల సూక్ష్మోపాధి సంఘాతమునదేగాని, పరమార్థమున ఆత్మస్వరూపుడగు తనది వాస్తవముగ కాదు. ఇవి యన్నియు ప్రకృతి అనగా అనాది అజ్ఞానరూపమగు త్రిగుణాత్మకములేగాని, వాస్తవమున తనవి కావు. పరమార్థ వాస్తవమున జీవుడు ఆత్మస్వరూపుడు. ప్రకృతి అనాది అజ్ఞానము. గుణత్రయము, దీని వలన కలుగుచున్నట్టి రాగద్వేష సుఖదుఃఖాదులన్నియు యీ గుణ ధర్మములు. కావున ముముక్షువు యీ దేహముతోడ ప్రారబ్ధానుసరణమున గావించు సమస్త కర్మలును, అంతఃకరణమందున ప్రకాశించు చిత్ప్రతిబింబునివేగాని, కేవల చిత్స్వరూపుడగు తనవి కావను నిశ్చయమును శాస్త్ర శ్రవణాదులవలన నొందవలయును. కాని అజ్ఞానముచే మానవుడు యీ కర్మాదికమంతయు నేనే జేయుచున్నాను, దీని ఫలమంతయు నాదియని భ్రమించుచున్నాడు. శాస్త్రీయ కర్మఫలములనైనను, చిదాభాసుడే నొందుచున్నాడుగాని, ఆత్మస్వరూపుడగు తాను కాదు. కాని నేనే జేయుచున్నానని జీవుడు వ్యామోహితుడగుచు కర్మబంధమున

చిక్కుబడి సంసార చక్రమున ఆవృతుడగుచున్నాడు. ఈ రహస్యమును తెలుపునట్టి కొన్ని శ్లోకముల, భగవద్గీతనుంచి యిచట తాత్పర్యార్థము తోడ నుదాహరించుచున్నాడను—

శ్లో॥ అవ్యక్తాదీనిభూతాని, వ్యక్తమధ్యాని భారత ।
అవ్యక్త నిధనాన్యేవ, తత్రకా పరివేదనా ॥

శ్లో॥ ప్రకృతేః క్రియమాణాని, గుణైః కర్మాణి సర్వశః ।
అహంకార విమూఢాత్మా, కర్తాహ మితిమన్యతే ॥

శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో ! గుణకర్మ విభాగయోః ।
గుణాగుణేషు వర్తన్త, ఇతిమత్వాన సజ్జతే ॥

శ్లో॥ ప్రకృత్యైవచ కర్మాణి, క్రియమాణాని సర్వశః ।
యఃపశ్యతి తదాత్మాన, మకర్తారం సపశ్యతి ॥

శ్లో॥ సత్త్వం రజస్తమ ఇతిగుణాః ప్రకృతి సంభవాః ।
నిబధ్నన్తి మహాబాహో, దేహేదేహినమవ్యయమ్ ॥

శ్లో॥ నాన్యం గుణేభ్యః కర్తారం, యదా ద్రష్టానుపశ్యతి ।
గుణేభ్యశ్చ పరంవేత్తి, మద్భావం సోఽధిగచ్ఛతి ॥

వీని తాత్పర్యార్థమేమనిన :—

1. అర్జునా ! శరీరాదిభూతములు వ్యక్తముగాని ఆదిగలవియు, కొంతకాలమువరకు వ్యక్తమగునట్టి మధ్యావస్థగలవియు, చివరకు వ్యక్తముగానిలయము గలవియు అనగా ఏమైనది తెలియక నశించునట్టివియునై యుండును. ఇట్టి శరీరాదిభూతముల గురించి నీకు దుఃఖ మెందులకు ?

2. ప్రకృతియొక్క గుణములచేతను జేయబడుచుండు, కర్మములన్ను

అహంకారముచేత కప్పబడిన అంతఃకరణము గలవాడై అన్ని విధములచేతను సర్వకర్మలను నేనే జేయుచున్నానని తలంచుచుండును– (ఇదియే జీవునకు పరమ అవివేకము).

3. అర్జునా ! గుణముల విభాగముయొక్కయు, కర్మముల విభాగముయొక్కయు తత్త్వమును అనగా యధార్థమును దెలిసికొన్నవాడు, ఇంద్రియ రూపములగు గుణములు విషయరూపమగు గుణములయందు ప్రవర్తించుచున్నవిగాని, ఆత్మస్వరూపుడగు తాను ప్రవర్తించుట లేదను నిశ్చయముతోడ కర్మలయందు సక్తుడుగాడు.

4. ఎవడు ప్రకృతిచేతనే సర్వప్రకారములుగ జేయబడుచుండు కర్మములను జూచుచుండునో, ఎవడు ఆత్మకర్త గాదని చూచుచుండునో అనగా నిశ్చయముతోడ తెలిసికొనునో వాడే బాగుగ జూచువాడు. (అనగా తదితరుడు జ్ఞానికాడు అని భావము).

5. అర్జునా ! సత్వము, రజస్సు, తమస్సు, అను గుణములు మూడును ప్రకృతివలన బుట్టినవగుచు, దేహమునందు, తాదాత్మ్యముగనున్న ఆత్మను నిబంధించుచున్నవి

6. అభ్యాసకుడు ఎప్పుడు వివేకమును బొంది, గుణములకంటె నితరునిగా కర్తను జూడకుండునో, ఆత్మను గుణములకంటె పైవానినిగ అనగా గుణరహితునిగ తెలిసికొనునో అప్పుడు వాడు బ్రహ్మత్వమును బొందును.

అభ్యాసకుడు అప్పుడు :—

శ్లో॥ గుణాతీతా నతీత్యత్రీన్, దేహీదేహస ముద్భవాన్ ।
జన్మమృత్యు జరాదుఃఖై, ర్విముక్తోఽమృతమశ్నుతే ॥

అనగా-దేహాద్యాకారముగా బరిణమించు నీ మూడు గుణముల నతిక్రమించి దేహి (చిదాభాసుడు) జన్మము, మృత్యువు, జర, మొద లగు దుఃఖములచే విడువబడినవాడగుచు బ్రహ్మానందము నొందును.

అనగా స్వస్వరూపమగు అఖండ చిద్భావము నొందుచుండును. ఇదియే స్వస్వరూపానందానుభవము-కాని వృత్తిచే ననుభవింపబడు చున్నది గనుక, చరమవృత్తి సాక్షాత్కారమువరకు నిది ఉభయాత్మక ముగ నుండును. తదుపరి అఖండాకార నిత్యనిరతిశయ సుఖస్వరూప మగును. (ఇదియే మోక్షము). ఇట్లు తెలిసికొని కర్మల నాచరించు బ్రహ్మవేత్త యెల్లప్పుడును తన కర్మ కర్తృత్వాదులను గురించి :—

శ్లో॥ నైవకించిత్కరోమీతి యుక్తోమన్యేత తత్త్వవిత్ ।
పశ్యన్, శ్రుణ్వన్, స్పృశన్, జిఘ్రన్నశ్నన్గచ్ఛన్,
స్వపన్. శ్వసన్ ॥

శ్లో॥ ప్రలపన్ విసృజన్, గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి ।
ఇన్ద్రియాణీన్ద్రియార్థేషు వర్తన్త ఇతిధారయన్ ॥

అనగా కర్మముల నాచరించు బ్రహ్మవేత్త— చూచుచు, వినుచు, స్పృశించుచు, వాసనచూచుచు, తినుచు, నడచుచు, నిదురించుచు, ఊపిరి విడచుచు, మాటలాడుచు, మలమూత్రముల విసర్జించుచు, కనులు మూయుచు, తెరచుచునున్న వాడైనను (అనగా సర్వకాల సర్వావస్థల యందునను) యీ క్రియలన్నియు ఆ యా ఇంద్రియములు నిర్వర్తించు చున్నవేగాని, చిత్స్వరూపుడనగు నేనేమియు జేయుటలేదను నిశ్చయము తోడ, తన పరమాత్మ స్వరూపమును తలంచుచుండును. కర్మల నిట్లాచ రించుట వలన—

శ్లో॥ బ్రహ్మణ్యాధాయ కర్మాణి, సంగంత్యక్త్వాకరోతియః ।
లిప్యతే నసపాపేన, పద్మపత్ర మివాంభసా ॥

అనగా ఎవడు, ఫలాసక్తిలేకుండ కర్మలను బ్రహ్మజ్ఞానపరుడై, నాచరించునో, వాడు నీరు తామరాకుని యంటనట్లు, పుణ్యపాపములచే స్పృశింపబడక సంసార బంధవిముక్తుడగునని తాత్పర్యము.

ఇచట సాధకులకు నొక సంశయము కలుగవచ్చును— త్రిగుణము లన్నియు ప్రకృతికి సంబంధించినవిగదా, యీ ప్రకృతి బలీయము దీనిని దాటుట కష్టమని గూడ గీతలలోననే చెప్పబడి గూడ యున్నది గదా, దీనిని దాటుట యెట్లు? ఇది సంభవమా యనునది. కాని దీనికి సమాధానముగూడ శ్రీకృష్ణ పరమాత్మ గీతయందే నిట్లు తెలుపుచున్నారు—

శ్లో॥ దైవీహ్యేషా గుణమయీ, మమమాయా దురత్యయా।
మామేవయే ప్రపద్యన్తే, మాయామేతాం తరన్తితే॥

త్రిగుణాత్మికయు దైవసంబంధినియునగు నా మాయ (ప్రకృతి) అతిక్రమింప వీలులేనిది సుమా! కాని పరమాత్మనగు నన్నే నెవరాశ్ర యింతురో వారు మాత్రము త్రిగుణాత్మకమైన యిట్టి మాయను సులభముగా నతిక్రమింతురు. కాని—

శ్లో॥ బహూనాం జన్మనామన్తే, జ్ఞానవాన్ మాం ప్రపద్యతే।
వాసుదేవస్సర్వమితి, సమహాత్మా సుదుర్లభః॥

అనేక జన్మములు కడచిన పిమ్మటను, పరమాత్మ జ్ఞానముగలవాడై "సర్వమును భగవంతుడే" అని ప్రత్యగాత్మ స్వరూపుడనగు నన్ను (పరమాత్మను) బొందునట్టి మహాత్ముడు దొరకుట కష్టమని గూడ శ్రీకృష్ణ పరమాత్మయే తెలుపుచున్నారు— ఇది కృష్ణావతార పరమాత్మ. పరమాత్మ యెన్ని అవతారములెత్తినను సదా ఒక్కడేయుండునుగాని అనేకులుండరు గదా!

## ఆత్మస్వరూప నిర్ణయము, దాని సాక్షాత్కార పరమ లాభము
## (గీతాబోధ)

మానవులు సాధారణముగ నే విషయమునైనను యదార్థముగ, అనగా సత్యముగ తెలుపుచున్నామను, నుద్దేశ్యముతోడ, ఆ విషయమును "నా ఆత్మసాక్షిగ" తెలుపుచున్నామని ఆత్మ, సాక్షి యను రెండు పదములను, నుపయోగించుచు, జెప్పుచుందురు. కావున ప్రతిమానవుడును తాను "ఆత్మ" యనియు "సాక్షి" యనియూ గూడ స్వభావముగ వాడుచుందురు. నే నాత్మ కాదనువారు యుండుట అరుదు. కాని యీ ఆత్మస్వరూప సాక్షి స్వభావములను యథార్థముగ గుర్తించలేక దేహాది సంఘాత పరిచ్ఛిన్న భావముతోడనే అనాది అజ్ఞానముతోడ తమ ఉపాధి, ఉపాధి ధర్మములనే ఆత్మ, సాక్షి యని భ్రమించి సంసారదుఃఖమును నొందుచున్నారు. ఇట్టి భ్రమను నివర్తింపజేయుటకే భగవద్గీత, ద్వితీయాధ్యాయమందు ఆత్మస్వరూపమును శ్రీకృష్ణపరమాత్మ యిట్లుబోధించుచున్నారు: ఏలనన ఆత్మస్వరూప యథార్థజ్ఞానముచే జీవునకు సంసార దుఃఖము క్షయించును—

శ్లో॥ నాసతో విద్యతేభావో, నాభావో విద్యతేసతః ।
ఉభయోరపి దృష్టోఽన్త, స్త్వనయోస్తత్త్వ దర్శిభిః ॥

శ్లో॥ అవినాశితు తద్విద్ధియేన సర్వ మిదంతతమ్ ।
వినాశమవ్యయస్యాస్యనకశ్చిత్కర్తుమర్హతి ॥

శ్లో॥ యఏనం వేత్తిహన్తారం, యశ్చైనం మన్యతేహతమ్॥
ఉభౌతౌ నవిజానీతో, నాయంహన్తి నహన్యతే ॥

శ్లో॥ నజాయతే మ్రియతేవాకదాచి, న్నాయం భూత్వాభవితా
వానభూయః ।
అజోనిత్యశ్శాశ్వతోఽయం పురాణో, నహన్యతేహన్య
మానే శరీరే ॥

శ్లో॥ వేదావినాశినం నిత్యం, యఏనమజ మవ్యయమ్ ।
కథం సపురుషః పార్థ, కంఘాత యతిహన్తికమ్ ॥

శ్లో॥ వాసాంసి జీర్ణాని యథావిహాయ, నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
తథా శరీరాణి విహాయజీర్ణా, న్యన్యాని సంయాతినవాని దేహీ ॥

శ్లో॥ నైనంఛిన్దన్తి శస్త్రాణి, నైనందహతి పావకః ।
నచైనం క్లేదయంత్యాపో, నశోషయతి మారుతః ॥

శ్లో॥ అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ, మక్లేద్యోఽశోష్యఏవచ।
నిత్యస్సర్వగతః స్థాణు, రచలోయం సనాతనః ॥

శ్లో॥ అవ్యక్తోఽయమచింత్యోఽయ,మవికార్యోఽయముచ్యతే।
తస్మాదేవం విదిత్వైనం, నానుశోచితుమర్హసి ॥

వీని తాత్పర్యార్థమేమనిన—

1. అసత్తగు దేహాదులు ఉండవు. సత్తగునాత్మకు లేమి అనగా—లేకుండుట యనునది లేదు. తత్త్వజ్ఞానము గలవారు యీ రెంటి యొక్క నిశ్చయమును గనిపెట్టియున్నారు.

2. ఏ ఆత్మ ఈ ప్రపంచమంతయు నిండియున్నదో, ఆ ఆత్మకు నాశములేదని తెలిసికొనుము. అవ్యయమగు నీ యాత్మకు నాశమును కలుగజేయునది యేదియును లేదు.

3. ఈ ఆత్మను జంపెడివానినిగాను, చంపబడువానినిగాను తలచెడివారు మూఢులు అనగా తెలియనివారు. ఏలనన, ఈ ఆత్మ చంపునదియు, చంపబడునదియూ గూడ గాదు.

4. ఈ ఆత్మ ఎన్నడునూ పుట్టుకగలది కాదు మరణము గలదియూ గాదు. కొంతకాలముండి నశించునదిగాని, కొన్నాళ్ళకు ఉత్పత్తి అనగా పుట్టునదిగాని కాదు. ఏలనన ఆత్మ పుట్టుకలేనిది. ఎల్లప్పుడును ఒక్క రీతిగనే యుండునది. అనగా మారునది గాదు. అవికారి. స్థిరమైనది. అనాదియైనది. శరీరము పోయినను పోవునది గాదు.

5. అర్జునా! ఎవడు యీ ఆత్మను నిత్యమైనదానిగను, వినాశము లేనిదానిగను, పుట్టుక లేనిదానిగను, అవ్యయమైనదానిగను, తెలిసికొనుచున్నాడో, ఆ పురుషుడు ఎవనిని ఎట్లు చంపును? ఎట్లు చంపించును?

6. మనుష్యుడు చినిగిపోయిన వస్త్రములను విడిచి కొత్త వస్త్రములను కట్టుకొనునట్లు ఆత్మ; జీర్ణములైన శరీరములను విడచి క్రొత్తవియగు శరీరములను పొందుచుండును.

7. ఈ ఆత్మను శస్త్రము లుఛేదింపజాలవు; అగ్ని కాల్పజాలదు; ఉదకము తడుపజాలదు; గాలి శోషింపజేయలేదు.

8. ఆత్మ ఛేదింపదగినదిగాని, దహింపదగినదిగాని, యెండింపదగినదికాని కాదు. ఎప్పుడును ఏకరూపముగా నుండునది. అఖండముగ అంతటను నిండియుండునది. స్థిరమైనది. అచలమైనది. సనాతనమైనది.

9. ఆత్మ చక్షురాదీంద్రియముల కగుపడదు. మనసుచే నాలోచించుటకు వీలులేనిది. ఏ వికారములు ఆత్మకు లేవు. అని తత్త్వజ్ఞులు చెప్పుదురు. కనుక ఆత్మ యిట్టిదియని తెలిసికొని యుద్ధము చేయుటకై దుఃఖింపకుము అని శ్రీకృష్ణపరమాత్మ

తెలుపుచున్నారు. ఇచట తత్త్వరహస్య మేమనిన— అనాత్మ జ్ఞానము, నానాత్వమును చూపించుచు జీవుని సంసార దుఃఖము పాలు జేయుచున్నది. ఇది దుఃఖరూపము. జిజ్ఞాసువు యీ సంసార దుఃఖమునుంచి విముక్తు డగుట— పరమ సుఖరూపమగు ఆత్మజ్ఞానమువలనగాని కలుగదు. కావున ఆత్మజ్ఞానము నుపదేశించి, అర్జునుని సంసార భయమును నిర్మూలించి యుద్ధము జేయించి, జయమునిచ్చి యుండిరి. సంసార భయము వేరు ఉపాయమున నశించదు.



# మననవాక్య కదంబము

సాంఖ్య శబ్దమున కర్థము— జ్ఞానము. అనగా తత్త్వపదార్థ విచారణ. యోగమనగా ఉపాసన. (సగుణ నిర్గుణము లేవియైనను కావచ్చును).

శ్లో॥ నాహందేహో నేన్ద్రియాణ్యంతరంగం,
నాహంకారః ప్రాణవర్గోన బుద్ధిః।
దారాపత్య క్షేత్ర విత్తాదిదూరః,
సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివోహమ్ ॥

శ్లో॥ నాహంజాతో నప్రవృద్ధోన నష్టో,
దేహస్యోక్తాః ప్రాకృతాః సర్వధర్మాః।
కర్తృత్వాదిశ్చిన్మ యస్యాస్తినాహం—
కారస్యైవ హ్యాత్మనోమే శివోహమ్ ॥

శ్లో॥ మత్తోనాన్య త్కించిదత్రాస్తి విశ్వం,
సత్యం బాహ్యం వస్తుమాయోప క్లృప్తమ్।
ఆదర్శాంతర్భాసమానస్య తుల్యం,
మయ్యద్వైతే భాతితస్మాత్ శివోహమ్ ॥

శ్లో॥ యావద్విజ్ఞాన సామీప్యం, తావచ్ఛ్రైష్ఠ్యం వివర్ధతే।
బ్రహ్మజ్ఞానవినాశాయ నిర్గుణోపాసనం శనైః ॥

అనగా వృత్తి నిర్గుణ బ్రహ్మ సాక్షాత్కారమున కెంతెంత సమీపించు చుండునో, అంతంత అత్యంత శ్రేష్ఠము. నిర్గుణోపాసన వృత్తి బ్రహ్మజ్ఞానమునకు సన్నిహితముగాన బ్రహ్మజ్ఞానమువంటిదే యగును.

**వివరణము :—**

సంవాదిభ్రమ తాను యథార్థము గాకపోయినను, వస్తు యథార్థమును గలిగించునట్లు నిర్గుణోపాసన గూడ యథార్థమగు బ్రహ్మ సాక్షాత్కారమును గలిగించును. సంవాది భ్రమలో మణి (రత్న) యథార్థ జ్ఞానమునకు గారణమగునట్లు, నిర్గుణోపాసన బ్రహ్మ సాక్షాత్కారమునకు గారణంబగును. కావున నిర్గుణోపాసన బ్రహ్మజ్ఞానమునకు అతి సన్నిహితము. తక్కినవి పరంపరా సాధనములు మాత్రము.

## ఆత్మజ్ఞానానుసన్ధాన విషయము

శ్లో॥ యదభావి నతద్భావి, భావిచేన్నత దన్యథా ।
ఇతిచింతా విషఘ్నోయం, బోధోభ్రమ నివర్తకః ॥

అనగా లోకవ్యవహారమునకు ప్రారబ్ధము బలము. లేనిదేదో యది కానేరదు. కాదగినది కాకమానదు. మనుష్యనకు కలిగెడి విచారములను విషమును పోగొట్టునట్టి యిట్టి జ్ఞాననిశ్చయము భ్రాంతిని, వ్యాకులతను బోగొట్టును. గీతా. 18 అ శ్లో. 37.

శ్లో॥ యత్తదగ్రే విషమివ, పరిణామేఽమృతోపమమ్ ।
తత్సుఖం సాత్వికం ప్రోక్త, మాత్మబుద్ధి ప్రసాదజమ్॥



# బోధశ్లోక సంపుటి

శ్లో॥ సంసారో మనసాపుంసః, కల్పితోఽ స్తి నవస్తుతః ।
మనఃశూన్యే సుషుప్త్యాదౌ, సంసారో నైవదృశ్యతే ॥

శ్లో॥ యత్రయత్ర మనస్స్ఫూర్తిః, తత్రతత్ర జగత్త్రయం ।
యత్రయత్ర మనోనాస్తి, తత్రతత్ర నకించన ॥

శ్లో॥ భ్రాంతిమాత్ర మిదంవిద్వాన్, విశ్వమాత్మ నికల్పితమ్ ।
ఆత్మజ్ఞానం వినాజీవ, సంసారో నోపశామ్యతి ॥

శ్లో॥ దీర్ఘ సంసారరోగస్య, విచారోహి మహౌషధమ్ ।
ఆత్మజ్ఞానం వినాసాధో, సంసారో నోపశామ్యతి ॥

శ్లో॥ నిశ్చింతో విగతాభీష్టో, సర్వం బ్రహ్మేతి నిశ్చయే ।
తిష్ఠత్వమచలో విద్వాన్, స్వాత్మలాభ పరాయణః ॥

శ్లో॥ మమపుత్రా మమధన, మయంసోహ మిదంమమ ।
ఇతీయ మిన్ద్రజాలేన, వాసనైవాధి వల్గతే ॥

శ్లో॥ నిస్సంగ వ్యవహారిత్వా, ద్భవభావన వర్జనాత్ ।
శరీర నాశదర్శిత్వా, ద్వాసనా నప్రవర్తతే ॥

శ్లో॥ నాహం దుఃఖీనమేదేహః, బంధఃకస్యాత్మ నిస్థితః ।
ఇతి భావానురూపేణ, వ్యవహారేణ ముచ్యతే ॥

శ్లో॥ అనాగతానాం భోగానా, మవాంఛన మకృత్రిమమ్ ।
ఆగతానాంచ సంభోగ, ఇతి పండిత లక్షణమ్ ॥

శ్లో॥ అతో౽రాఘవ తత్త్వజ్ఞో, వ్యవహారేషు సంస్థితః ।
నష్టం నష్టముపేక్షస్వ, ప్రాప్తం ప్రాప్తముపాహర ॥

శ్లో॥ పరిజ్ఞాయోప భుక్తోహి, భోగో భవతితుష్టయే ।
విజ్ఞాయ సేవితశ్చోరో, మైత్రీ మేతినచోరతామ్ ।

తాత్పర్య మేమనిన, ఈ ప్రపంచమును అవాస్తవమను నిశ్చయముతోడ తెలిసికొని భోగము నొందవలెను. దొంగను దొంగయని తెలిసికొని వానితోచేసిన స్నేహమువల్ల వాని దొంగతనము మనను బాధించదు.



# కొన్ని ఉపనిషద్వాక్యముల సంపుటి

## కఠోపనిషద్వచనములు

"అంధంతమః ప్రవిశన్తియేఽవిద్యాముపాసతే" । ఎవరు విద్యకు విరుద్ధమగు కర్మ నాచరించెదరో వారు అజ్ఞానమున బ్రవేశించెదరు. అవిద్యా శబ్దమునకు కర్మాచరణ మర్థము. కేవల కర్మాచరణపరులజ్ఞాన రూపమగు అంధకారమున బ్రవేశించెదరు. వారు పరమార్థ దర్శన సమర్థులు గానేరరు నేను, నాది, అహం, మమాభిమానములు, అన్యశబ్దమున కర్థము. అట్టివారు పరమాత్మ జ్ఞానవిరుద్ధమగు నజ్ఞానమును బడయుదురు.

శ్రుతి॥ యేయం ప్రేతే విచికిత్సా మనుష్యేఽస్తీత్యేకేనాయ మస్తీతి చైకే, ఏతద్విద్యా మనుశిష్ట స్త్వయాహం, వరాణామేష వర స్తృతీయః। మనుజుడు మరణశీలుడు. అతడు చనిపోగా నిట్టి విచారణము కలుగుచున్నది. దేహేన్ద్రియములకు భిన్నమగు నాత్మ యనునది యొకటి గలదని కొందరు, అట్టిది లేదని మరికొందరు చెప్పుచున్నారు. నీచే శాసింపబడినవాడనై నేనీ విషయమును తెలిసికొనెదను. ఇదియే నేను గోరు మూడవవరము.

"దేవైరత్రాపి విచికిత్సితం పురా"

ఈ విషయమునుగూర్చి దేవతలకు గూడ సంశయము గలదు. "శతాయుషః పుత్రపౌత్రాన్ వృణీష్వ బహూన్ పశూన్ హస్తి హిరణ్యమశ్వాన్ । భూమేర్మహ దాయతనం వృణీష్వ స్వయంచ జీవశరదో యావదిచ్ఛసి ॥ ఏతత్తుల్యం యదిమన్యసే వరం వృణీష్వ విత్తం చిరజీవికాంచ । మహాభూమౌ నచికేత స్త్వమేధి, కామానాన్త్వా కామభాజం

కరోమి ॥ యేయేకామా దుర్లభామర్త్యలోకే, సర్వాన్ కామాగ్ంశ్ఛం దతః ప్రార్థయస్వ । ఇమారామాః సరథాః సతూర్యా నహీదృశాలంభ నీయామనుష్యైః । ఆభిర్మత్ప్రత్తాభిః పరిచారయస్వ, నచికేతో మరణం మానుప్రాక్షీః॥" శతసంవత్సర జీవులగుపుత్రులను, పౌత్రులను గవాది పశుబాహుల్యమును, గజములను, అశ్వములను, ధనమును, విస్తీర్ణ మగు భూమండల సామ్రాజ్యంబును, వీని ననుభవించుటకు నీకు స్వయ ముగా శతాయుష్యమును గోరుము. కావలసినయెడల వీనితో సమాన మగు మరియొక వరమును గోరుము. హిరణ్య రత్నాది ప్రభూత ధనము, చిరాయుస్సును గోరుము. మహాభూమండలమునకు నీవు రాజువు గమ్ము. మానుషములు, దివ్యములునగు నే యే కోరికలుగలవో వానినన్నిటిని నీ వనుభవించునట్లు నేను చేసెదను. నేను సత్య సంకల్పుడను. దుర్లభ ములు, కోరదగినవియగు కోర్కెలనన్నిటిని నీ యిచ్ఛానుసారముగ గోరుము. రథతూర్య నినాదములతోగూడిన యప్సరః స్త్రీలు మనుష్యు లకు దుర్లభము. నే ననుగ్రహించు నిట్టి యప్సరః స్త్రీల యుపచారముల నొందుము. మరణ సంబంధమగు ప్రశ్ననుమాత్ర మడుగకుము.

"నవిత్తేన తర్పణీయో మనుష్యః" తా॥ ఎంత ధనమిచ్చినను మనుష్యుడు తృప్తినొంద నేరడు. శ్రేయస్సు వేరు, ప్రేయస్సు వేరు. వీని ప్రయోజనములు వేరు. శ్రేయోమార్గము నవలంబించువానికి శుభము కలుగును. ప్రేయోమార్గము నాశ్రయించువాడు పరమ పురుషార్ధమునుంచి విదూరు డగును. శ్రేయస్సన- నిఃశ్రేయస్సు లేక పరమపురుషార్ధము. పరమపురుషార్ధముకంటె శ్రేయస్తరమగునది మరియొకటి లేదుగనుక నది యత్యంతమగు శ్రేయస్సగుచున్నది. ప్రియమగునది ప్రేయస్సు. ఈ రెండును విభిన్నములు. నిఃశ్రేయస్సు జ్ఞానఫలము. ప్రేయస్సు, లేక అభ్యుదయము కర్మానుష్ఠాన ఫలము. విరుద్ధములగు ప్రయోజనములతోను, సాధనములతోను గూడుకొనిన నిఃశ్రేయోభ్యుదయము లొక్కమారుగ నేరికి నాలంబనీయములు గానేరవు. అభ్యుదయాభిలాషియగు నజ్ఞా

నికి నిఃశ్రేయః స్వరూపమగు బరమపురుషార్థము లభింపనేరదు వివేకి యగువాడవిద్యారూపమగు ప్రేయస్సును వదలి శ్రేయోమార్గమునే యవలంబించును.

జ్ఞానియైనవాడు ప్రేయస్సుకంటె శ్రేయస్సు శ్రేష్ఠతరమగుటచే వాంఛనీయమని గ్రహించి, హంస నీటినుంచి పాలను విడదీసి గ్రహించి నట్లు ప్రేయస్సునుంచి శ్రేయస్సును విడదీసి గ్రహించును మందబుద్ధి యగువాడు సదసద్వివేక సామర్థ్యములేనివాడగుటం జేసి శరీరాద్యుప చయ రక్షణ నిమిత్తములగు యోగక్షేమములకు గారణమగు ప్రేయస్సు నాశ్రయించుచున్నాడు.

"దూరమేతే విపరీతే విషూచీ అవిద్యాయా చవిద్యేతి జ్ఞాతా"

తా॥ శ్రేయః ప్రేయస్సులను నీ రెండు మార్గములకును గడు దూరము. ఒకటి వివేకముచే లభించును. మరియొకటి యవివేకముచే సంభవించును. విరుద్ధములగుటచే నవి యొకదానినొకటి త్రోసిపుచ్చును. తమః ప్రకాశమువలె నీ రెండు నొకచోట నుండశక్యము గాదు ఒకటి మోక్షకారణము. రెండవది సంసార హేతువు ప్రేయోమార్గమవిద్యా కల్పితమనియు, శ్రేయోమార్గము విద్యావిషయమనియు బండితులు తెలిసికొనుచున్నారు.

"ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ, ఏతద్ధ్యేవాక్షరం పరమ్", "ఏతద్ధ్యే వాక్షరం జ్ఞాత్వా, యోయదిచ్ఛతి తస్యతత్"। ఓంకారమను నీ యక్షరము పరాపరబ్రహ్మమునకే ప్రతీకమగుచున్నది. "ఏతదాలమ్బనగ్ం శ్రేష్ఠ, మేతదాలమ్బనం పరమ్। ఏతదాలమ్బనం జ్ఞాత్వా, బ్రహ్మలోకే మహీ యతే"। "అజోనిత్యః శాశ్వతోఽయం పురాణోనహన్యతే హన్యమానే శరీరే"। "ప్రణవో ధనుశ్శరో హ్యాత్మా బ్రహ్మతల్లక్ష్య ముచ్యతే"।

### వాశి-539. ఆత్మజ్ఞాన పరమలాభము

శ్లో॥ అయంసోహ మిదంతన్మ ఇతిమజ్జత్య నాత్మవాన్ ।
సర్వమేవాహ మేవేతి, తత్త్వజ్ఞానాన్నసీదతి ॥

తా॥ ఆత్మజ్ఞానములేనివాడు భేదభావన గలవాడగుచు, సంసారమున నిమగ్నుడగును. తత్త్వజ్ఞానము గలవాడు సర్వంబు నేనే యని భావించుచు, అభేద భావంబుగలవాడై తరించును.

శ్లో॥ విప్రాపర్యవసానేయం మాయా సంసృతి నామికా ।
ఆత్మచింతనయైవేయం క్షయమాయాతి నాన్యథా ॥

సంసారమను పేరుగల మాయ అంతములేనిది. ఇట్టిది ఆత్మ భావన చేతనే అంతమొందునుగాని యింకొక విధమున నశింపనేరదు.

### వాశి. పే. 544-ఆత్మానుసన్ధాన క్రమము

శ్లో॥ మమేదంతదయంసోఽహమితి సంత్యజ్య వాసనాః ।
ఏకనిష్ఠతయాంతస్థ సంవిన్మాత్ర పరోభవ ॥

శ్లో॥ ప్రలపన్వి సృజన్గృహ్ణ న్నున్మిషన్నిమిషన్నపి ।
నిరస్తమన నానన్తే, సంవిన్మాత్ర పరోభవ ॥

శ్లో॥ మలంసంవేద్య ముత్సృజ్య మనోనిర్మల యన్పరం ।
ఆశాపాశానలం ఛిత్వా స్వసంవిత్తి మయోభవ ॥

ఇది నాది, నేను, అను మొదలగు వాసనలను విడచి సర్వమునకునూ ఆ బ్రహ్మమే యధిష్ఠానమని నిశ్చయించి లోనున్న చిదాత్మను భావించుచుండుము. ఏ చిదాత్మని సాన్నిధ్యంబువలన నీవు గ్రహణాగ్రహణాది, గమనాగమనాది సమస్తకర్మలు నాచరింపగలుగుచున్నావో అట్టివాడగు నిర్వికల్పుడు, అనన్తుడు, స్వప్రకాశకుడేయగు చిదాత్మ

నేనేయని భావించుచుండుము. దృశ్యమను మలమును విడచి ఆశలను తెంచి మనసును నిర్మలమైనదానిగా గావించి నీదు చిద్రూపమును సదా భావించుచుండుము.

కఠ శ్రుతి. 6-9, 6-12

"నసన్దృశేతిష్ఠతి రూపమస్య నచక్షుషాపశ్యతి కశ్చనైనమ్।
హృదామనీషా మనసాభిక్లప్తో యఏతద్విదు, రమృతాస్తే
భవన్తి ॥"

ప్రత్యగాత్మ చక్షురాదీన్ద్రియ గణమున కగోచరము. వికల్ప హీనము, నిశ్చలమగు బుద్ధిచే నద్దాని స్వరూపమును మననముచేయుట చేత ఆత్మస్వరూపము అభిప్రకాశితమగును. ఇట్లాత్మను తెలిసికొనినవారు అమృతత్త్వమును బొందుదురు. "నైవవాచా, నమనసా, ప్రాప్తుంశక్యో నచక్షుషా, అస్తీతి, బ్రువతోఽన్యత్రకథం తదుపలభ్యతే॥" ఆత్మ సర్వేన్ద్రియాతీతము, వాక్కుచేతగాని, మనసుచేతగాని, చక్షుస్సుచేతగాని, దానిని బొందశక్యము గాదు. అట్టి స్థితిలో ఆత్మయున్నదనిగాని, లేదనిగాని చెప్పుట వీలుగాదు. ఇది యోగమునం దుపలభ్యమగుననిగాని చెప్పుట కెట్లు సాధ్యము.

కఠ శ్రుతి. 13-14

"యదాసర్వే ప్రముచ్యన్తే కామాయేఽస్య హృదిశ్రితాః। అథ మర్త్యోఽమృతోభవత్యత్ర బ్రహ్మసమశ్నుతే ॥"

హృదయము నాశ్రయించియున్న సర్వకామములు నెపుడు నశించునో యపుడు మరణశీలుడగు మనుజుడ మరణశీలుడై బ్రహ్మత్త్వము నొందును."నతత్ర సూర్యోభాతి నచంద్రతారకం, నేమావిద్యుతో భాంతికుతోఽయ మగ్నిః, తమేవభాంతమను భాతిసర్వం, తస్యభాసా సర్వమిదం విభాతి"। అను వచనముచొప్పున తనకు అహమిదముల

యందు గలుగుచున్న సర్వప్రకాశము అనగా జ్ఞానము అంతయు పరిపూర్ణ సంవిద్రూపుడగు ఆత్మదేననియు, అది తానేననియు విద్వాంసుడు బాగుగ గ్రహించగలుగును.

మాండూక్య శ్రుతి. 26-29

"ప్రణవం హీశ్వరం విద్యాత్సర్వస్య హృది సంస్థితమ్। సర్వవ్యాపిన మోంకారం మత్వాధీరో నశోచతి ॥"

ప్రణవమందరి యొక్క హృదయమునందున్న ఈశ్వరునిగా తెలిసికొనవలయును. బుద్ధిమంతు డోంకారమునంతట వ్యాపించినదానిగా నెరిగి దుఃఖింపడు. పరమాత్మ దేశకాలాదులచే పరిమితుడు కాడు. అట్టి పరమాత్మను గ్రహించగల ఉత్తమాధికారి సర్వశోక విముక్తుడగుచున్నాడు. అతని హృదయగ్రంధు లన్నియు విచ్ఛిన్నము లగుచున్నవి.

"అమాత్రోఽనన్తమాత్రశ్చ ద్వైతస్యోపశమశ్శివః। ఓంకారో విదితోయేన సమునిర్నేతరోజనః॥" తా॥ మాత్రా విరహితమైనట్టియు, అంతములేని పరిచ్ఛిత్తి కలిగినట్టియు, ద్వైతముయొక్క ఉపశమనము చేయునట్టియు, మంగళస్వరూపమైనట్టియు, నోంకార మెవనిచేత తెలిసికొనబడు చున్నదో, వాడు ముని యగుచున్నాడు. ఇతర జనము మునులుగారు. మాత్రా విభాగములేనట్టి యోంకారము తురీయము. మాత్రా శబ్దమునకు కొలమానమని యర్థము.

"యద్రూపేణ యన్నిశ్చితం తద్రూపం నవ్యభిచరతి తత్సత్యం, యద్రూపేణ యన్నిశ్చితం, తద్రూపం వ్యభిచరేత్త దనృత మిత్యుచ్యతే, అతోవికారోఽనృతః॥ ఏ పదార్థ మేరూపమున నిశ్చితము కాబడుచున్నదో ఆ రూపమునకు మార్పులేనపుడది సత్యమనబడును. నిశ్చితమగు దేనిరూపము మార్పునుజెందునో అది యసత్యము. రూపము మారుచున్నదనగా రూపము వికారమును చెందుచున్నదని భావము.

వికారమంతయు నసత్యము, అనృతము. వికారములేనిది సత్యము. విద్వాంసుడు సత్యానృతముల భేదమును బాగుగ తెలిసికొని ప్రపంచమును— 'మృగతృష్ణాం భసిస్నాతః, ఖపుష్ప కృత శేఖరః, ఏషవంధ్యాసుతో యాతి శశశృంగ ధనుర్ధరః" । అర్ధము :— గొడ్రాలిబిడ్డడు మరుమరీచికలయందు స్నానముచేసి యాకాశ పుష్పాలంకృతుడై శశవిషాణ రూపమగు ధనుస్సును ధరించి వచ్చుచున్నాడను వాక్యమువలెనే అర్ధశూన్యమని నిశ్చయించును.

శ్లో॥ "స్వప్నమాయే యథాదృష్టే గంధర్వనగరం యథా ।
తథావిశ్వ మిదం దృష్టం వేదాన్తేషు విచక్షణైః" ।

తా॥ స్వప్నమాయా గంధర్వనగరము లేవిధముగ చూడబడుచున్నవో, ఆ విధముగనే వేదాన్తములయందు విచక్షణుడగు విద్వాంసుని చేత నీ ప్రపంచము చూడబడుచున్నది.

## తైత్తిరీయం, ఆనన్దవల్లి

శ్రుతి॥ భీషాస్మాద్వాతః పవతె, భీషోదేతి సూర్యః । భీషాస్మాదగ్ని శ్చేన్ద్రశ్చ । మృత్యుర్ధావతి పంచమఇతి ॥ తా॥ పరబ్రహ్మ భయముచేతనే, వాయువు, సూర్యుడు, అగ్ని, ఇంద్రుడు, అయిదవ వాడగు మృత్యువును స్వస్వవ్యాపారములయందు శ్రద్ధతోడ ప్రవర్తించుచున్నారు. "సయశ్చాయం పురుషే । యశ్చాసావాదిత్యే । సఏకః" పురుషునియందే పరబ్రహ్మ స్వరూపమున్నదో అదియు, సూర్యమండలము నందున్న పరబ్రహ్మము నొక్కడే.

శ్రుతి :— యతోవాచో నివర్తన్తే । అప్రాప్య మనసాసహ ॥

## బృహదారణ్యకము

"అన్యోసావన్యో హమస్మీతి, నసవేద"

కఠ॥ "మనసైవేదమాప్తవ్యమ్", 4. "మనసైవాను ద్రష్టవ్యమ్".

ఈ పై రెండు వాక్యముల సమన్వయ వివరణము :—

అసంస్కృత మనస్సుకు గ్రాహ్యముకాదనియు, సంస్కృత మనస్సుకు గ్రాహ్యమనియు వాక్యద్వయమున కర్థము. బ్రహ్మము సర్వవ్యాపియైనను నద్దాని సాక్షాత్కారమునకు హార్దాకాశము ప్రత్యేకముగ నిర్దేశింపబడుచున్నది. మనస్సుచేతనే తెలిసికొనబడవలయునని శ్రుతి చెప్పుచున్నది. హార్దాకాశము బుద్ధిస్థానము. కనుక సత్యజ్ఞానానన్తాది లక్షణములచే సూచింపబడు మార్గమున నిర్మలమగు చిత్తైకాగ్ర్యముతో పరమార్థతత్త్వమును విచారణచేసినపుడది బుద్ధియందు భాసించుచున్నదని, "యోవేదనిహితం గుహాయాం" అను వాక్యమున కర్థము. శబ్దప్రసారక యంత్రమునుండి (Broad casting) వెలువడుచున్న శబ్దజాలము సర్వవ్యాపియైనను, సునిశితము, సుసంస్కృతమునగు రేడియో యంత్రమునందు సుగ్రాహ్యమగుచున్నది. 'నేను' అను శబ్దముచే సర్వలోక ప్రతీతి నొందిన యాత్మ హార్దాకాశమున తెలియబడుచున్నది. కనుక పరబ్రహ్మము హార్దాకాశమున నాత్మరూపమున తెలిసికొనదగి యున్నదని 'యోవేద' యను వాక్య తాత్పర్యార్థము.

శ్లో॥ కోఽహం, ముక్తిః కథం, కేన సంసారం ప్రతిపన్నవాన్।
ఇత్యాలోచన మర్థజ్ఞా, స్తపశ్శంసన్తి పండితాః ॥

నేనెవడను? ముక్తి యెట్టిది? దేనిచేత సంసారమును బొందితిని? అను ఈ విషయములను పరిశీలించుటయే తపస్సని పండితులు అనుచున్నారు.

## ముండకోపనిషత్తు

"సబ్రహ్మ విద్యాం సర్వవిద్యా ప్రతిష్ఠా। మథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ"। అతడు సమస్త విద్యల కాశ్రయభూతము. స్వయ

మభివ్యక్తమునగు బ్రహ్మవిద్యను తన జ్యేష్ఠపుత్రుడగు అథర్వునకు ఉపదేశించెను. ' కస్మిన్ను భగవో విజ్ఞాతే, సర్వమిదం విజ్ఞాతం భవతి " । ఏ వస్తువును తెలిసికొనిన "ఇదం" అని చెప్పబడుచున్న ఈ ప్రపంచమంతయు తెలియబడినది యగునో, అట్టి వస్తు వొకటి కలదా? అట్టిది ఉన్నయడల నా కుపదేశింపుము.

"యథానద్యః స్యన్దమానాః సముద్రేఽస్తంగచ్ఛన్తి నామరూపే విహాయ ।" "తథావిద్వాన్ నామరూపా ద్విముక్తః, పరాత్పరం పురుషముపైతి దివ్యమ్" । "తరతి శోకం తరతి మృత్యుం" ।

## ఐతరేయోపనిషత్తు

"ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్", ఈ ప్రపంచము సృష్టింపబడక పూర్వము, ఆత్మ తానొక్కటిగనే యుండెను. అనగా ఆత్మ సజాతీయ, విజాతీయ స్వగతభేదము లేనివాడు. అపరిచ్ఛిన్న చైతన్య స్వరూపుడు అని తాత్పర్యము. మరియు, "నాన్యత్కించనమిషత్" ఇతరమైనదేదియును, యే వ్యాపారము కలిగినదియునూ లేదు అని తెలుపుచున్నది.

## ఛాందోగ్యోపనిషత్తు

శ్రుతి॥ "యదావై మనుతేఽథ విజానాతి" అనగా మననమెపుడు చేయబడునో, అపుడు తెలిసికొనుచున్నాడు. అనగా శ్రవణానన్తరము, బాగుగ జేయునట్టి మననమువలనగాని సదాత్మ జ్ఞానము కలుగదు అని తాత్పర్యము.

## ముండకశ్రుతి

"విజానన్ విద్వాన్ భవతే నాతివాదీ" । అనగా సర్వాత్మభూతమగు పరబ్రహ్మము తానేయని తెలిసికొనిన విద్వాంసుడు దానిని అతిక్రమించి ప్రసంగింపడు. అనగా దానినిగురించి వ్యర్థవివాదము చేయడు. అనగా తాను నిశ్చయాత్మకుడుగానే నుండునని తాత్పర్యము.

## కఠోపనిషత్తు

"ఋతంపిబన్తౌ సుకృతస్యలోకే, గుహాం ప్రవిష్టౌ పరమేపరార్ధే, ఛాయా తపౌ, బ్రహ్మవిదోవదన్తి"

స్వయంకృతమగు కర్మఫలము ననుభవించునట్టి యాత్మ, శరీరము నందలి శ్రేష్ఠమైన బ్రహ్మస్థానమగు, బుద్ధి గుహను బ్రవేశించునట్టి ఆత్మ, యీ ఆత్మలు రెండునూ ఛాయాతపములవలె విలక్షణమగు చున్నవి. ఈ విధముగ బ్రహ్మవిదులు తెలియజేయుచున్నారు.

## ఛాందోగ్య శ్రుతి

శ్రుతి :— "తత్త్వమసి" అని జీవబ్రహ్మైక్యమును అనగా ఏక త్వమును బోధించుచు, కార్యమగు ప్రపంచము కారణమగు బ్రహ్మ కంటె వేరుగాలేదని :—

శ్రుతి ॥ యథాసౌమ్యైకేన, మృత్పిండేన సర్వంమృన్మయం విజ్ఞాతగ్ం స్యాద్వాచారంభణం వికారో నామధేయం, మృత్తికేత్యేవ సత్యమ్" । అను మొదలగు వాక్యములతో బోధించుచున్నది. మరియు నీ విషయమున కలిగెడి సందేహముల, నివారించుటకై తొమ్మిది విధ ములుగ తొమ్మిది సార్లు పై మహావాక్యార్థమును బోధించి, పర్యవ సానముగ—

శ్రుతి :— ఐతదాత్మ్యమిదగ్ంసర్వం, తత్సత్యగ్ం, సఆత్మా, తత్త్వమసిశ్వేతకేతో" అని జీవుడు బ్రహ్మస్వరూపుడే యని, నిర్ధారణ చేసి బ్రహ్మయొక్క అద్వితీయత్వమును అనగా బ్రహ్మ భిన్నముగ నేమియు వాస్తవమున లేదు అని తెలుపుచున్నది.



# వివేక వ్యవహారము

[ వాశి. పే. 406 ]

శ్లో॥ పూర్ణాంద్రుష్టిమవష్టభ్య, ధ్యేయత్యాగ విలాసినీమ్ ।
జీవన్ముక్త తయాస్వస్థో, లోకేవిహర రాఘవ ॥ 1

శ్లో॥ అంతస్సంత్యక్త సర్వాశో, వీతరాగో వివాసనః ।
బహిస్సర్వ సమాచారో, లోకేవిహర రాఘవ ॥ 2

శ్లో॥ బహుఃకృత్రిమ సంరంభో, హృదిసంరంభ వర్జితః ।
కర్తా బహిరకర్తాంత, ర్లోకేవిహర రాఘవ ॥ 3

శ్లో॥ త్యక్తాహం కృతిరాసుప్త, మతిరాకాశ శోభనః ।
అగృహీతకలం కాంకో, లోకేవిహర రాఘవ ॥ 4

శ్లో॥ ఉదారపేశలాచార, స్సర్వాచారాను వృత్తిమాన్ ।
అన్తస్సర్వ పరిత్యాగీ, లోకేవిహర రాఘవ ॥ 5

శ్లో॥ అన్తర్నైరాశ్య మాస్థాయ, బహిరాశో న్ముఖేహితః ।
బహిస్తప్తోఽన్తరాశీతో, లోకేవిహర రాఘవ ॥ 6

శ్లో॥ అయంబన్ధు రయంనేతి, గణనాలఘు చేతసామ్ ।
ఉదార చరితానాన్తు, వసుధైవ కుటుమ్బకమ్ ॥ 7

శ్లో॥ బంధుత్వే భావితోబన్ధుః, పరత్వే భావితః పరః ।
బన్ధుమిత్ర సుతస్నేహ, ద్వేషమోహ దశామయః ॥ 8

శ్లో॥ మాతాపితృ సహస్రాణి, సమతీతానితే సుత ।
పుత్రబాంధవ బృందాని, జంతోర్జన్మనిజన్మని ॥ 9

శ్లో॥ అతో రాఘవత త్త్వజ్ఞో, వ్యవహారేషు సంస్థితః ।
నష్టం నష్టముపేక్షస్వ, ప్రాప్తం ప్రాప్తముపాహర ॥ 10

శ్లో॥ పరిజ్ఞాయోప భుక్తోహి, భోగో భవతితుష్టయే ।
విజ్ఞాయ సేవితశ్చోరో, మైత్రీమేతి నచోరతామ్ ॥ 11

శ్లో॥ సంసారో మనసాపుంసః, కల్పితోస్తి నవస్తుతః ।
మనఃశూన్యే సుషుప్త్యాదౌ, సంసారో నైవదృశ్యతే॥ 12

శ్లో॥ యత్రయత్ర మనస్స్ఫూర్తి, స్తత్రతత్ర జగత్త్రయమ్ ।
యత్రయత్ర మనోనాస్తి, తత్రతత్ర నకించన ॥ 13

శ్లో॥ నిశ్చింతో విగతాభీష్టో, సర్వమాత్మేతి నిశ్చయే ।
తిష్ఠత్యచలో విద్వాన్, స్వాత్మలాభ పరాయణః ॥ 14

శ్లో॥ కరోతు భువనేరాజ్యం, విశత్వాకాశ మంబువా ।
స్వాత్మలాభాదృతే విద్వాన్, విశ్రాంతిం నాధిగచ్ఛతి ॥ 15

శ్లో॥ మమపుత్రా మమధన, మయంసోఽహ మిదంమమ ।
ఇతీయ మిన్ద్రియజాలేన, వాసనైవాధి వల్గతే ॥ 16

శ్లో॥ నిస్సంగ వ్యవహారిత్వాత్, భవభావన వర్జనాత్ ।
శరీరత త్త్వ దర్శిత్వాత్, వాసనా నప్రవర్తతే ॥ 17

శ్లో॥ అవశ్యమేవ జాతేన, కించిత్సు విభవాదికమ్ ।
ప్రాప్తవ్యం పురుషేణేతి, లాభేష్వ ర్ధేషుకోమదః ॥ 18

శ్లో॥ దేశక్రమేణ ధనమల్ప విగర్హణేన,
తేనాంగ సాధుజన మార్జయమాన పూర్వమ్ ॥
తత్సంగమోత్థ విషయాద్య వహేళనేన ।
సమ్యగ్విచార విభవేన తవాత్మలాభః ॥ 19

శ్లో॥ యదభావి నతద్భావి, భావిచేన్నత దన్యథా ।
ఇతిచింతా విషఘ్నోయం, బోధోభ్రమ నివర్తకః ॥ 20

అనగా లోకవ్యవహారమునకు ప్రారబ్ధము బలము. కాదగినది కాకమానదు. ఏది కాదో అది కానేరదు. ఇట్టి జ్ఞాననిశ్చయము సంసార విచార దుఃఖమును భ్రాంతిని పోగొట్టును.

శ్లో॥ హృదయాత్సం పరిత్యజ్య, సర్వమేవ మహామతిః ।
యఃతిష్ఠతి గతవ్యగ్రః, సముక్తః పరమేశ్వరః ॥

అనగా ఏ పురుషుడు సకల విషయములను, మనస్సులోనుంచి తొలగించి, అనగా సకల విషయములును, మిథ్యయను నిశ్చయముతోడ వాటియందు నిష్కాముడై నిర్విచారముగ నుండునో, యా పురుషుడే ముక్తుడనియు, పరమేశ్వరుడనియు గూడ చెప్పవచ్చును.

గీత. అ. 15-5

శ్లో॥ నిర్మాన మోహాజిత సంగదోషా, అధ్యాత్మనిత్యా విని
వృత్తకామాః ।
ద్వంద్వైర్విముక్తా స్సుఖదుఃఖ సంజ్ఞైర్గచ్ఛన్త్య మూఢాః
పదమవ్యయంతత్ ॥

ఇట్లుండుటకు ఏది సాధనము ?

శ్లో॥ ఉద్ధరేదాత్మ నాఽఽత్మానం, నాత్మాన మవసాదయేత్ ।
ఆత్మైవహ్యాత్మనోబన్ధు, రాత్మైవరిపురాత్మనః ॥

శ్లో॥ బన్ధురాత్మాఽఽత్మన స్తస్య, యేనాత్మై వాత్మనాజితః ।
అనాత్మనస్తు శత్రుత్వే, వర్తేతాఽఽత్మైవ శత్రువత్ ॥

అను గీతావచనములకు (6 అధ్యాయము, 5, 6 శ్లోకములకు) సంక్షేప వివరణము :—

ఈ శ్లోకములయందు జీవాత్మ, పరమాత్మలకు, కలసియే, ఆత్మ శబ్దమును నుపయోగించిరి. ఇందు జీవాత్మ కల్పితుడు. అనగా జీవత్వ భ్రాంతినొందిన ఆత్మ, ఈయనయే చిదాభాసుడు. ఈయన సాధనకోటి లోనివాడు, వ్యవహారి. పరమాత్మ-సిద్ధుడు. అవ్యవహారి. కేవల ప్రకాశ మానుడు. సాక్షి. ఈయనయే నిత్యుడు. నిరతిశయానన్ద స్వరూపుడు. జీవునియొక్క పరమార్థ వాస్తవస్వరూపము. ఈయన, స్వప్రకాశ అఖండ పరిపూర్ణుడు. ఈయనను యథార్థముగ గ్రహించి స్వానుభవము నొందుటయే మోక్షము. ఈ జీవాత్మ సత్యానృత మిశ్రమము. ఇందు అనృతమగునట్టిది దేహాత్మవాసన. అనాది భ్రాంతిచే జీవునకు పరిచ్ఛిన్న దుఃఖిత్వములు దేహాత్మభావన ద్వారా కలుచున్నవి. ఇదియే జీవునకు సంసార కారణము. అనాది భ్రాంతి. ఇట్టి భ్రాంతినుండి ముక్తి నొందుటకు జీవాత్మయే సమర్థుడు. కావున చిదాభాసుడగు జీవాత్మ ఎప్పుడు శాస్త్ర జ్ఞానముచే వివేకమునొంది, వాస్తవమున తన పరమార్థస్వరూపమగు స్వాత్మాభిన్న అఖండ సచ్చిదానన్ద పరమాత్మరూపమును గ్రహించి స్వానుభవము నొందునో అపుడు ఈ జీవాత్మ తనను తాను ఉద్ధరించుకున్నవాడగును. ఆత్యంతిక దుఃఖనివృత్తిని పొందును. నిత్యనిరతిశయ సుఖస్వరూపుడగును. అట్లుగాక దేహాత్మ భ్రాంతిలోననే యుండి, యీ పరిచ్ఛిన్న దుఃఖిత్వములతోడ సంసారావృతుడగు చుండునేని, అపుడు తనకు తాను శత్రువేయగుచు తీరని అపకారము చేసికొనుచున్నవాడగును.



# అంతర్యామి అన్నను, ఆత్మయన్నను ఒక్కటియే

శ్రుతి :— "ఏషత ఆత్మాంతర్యామ్యమృతః", అంతర్యామియే ఆత్మ. జరామరణములు లేనివాడు.

శ్రుతి :— "అదృష్టోద్రష్టా, అశ్రుతః శ్రోతా, అమతోమంతా, అవిజ్ఞాతో విజ్ఞాతా", ఆ అంతర్యామి పరులచే చూడబడకుండ సర్వ మును చూచువాడు, వినబడక సర్వము వినువాడు. సంకల్పింపబడక సంకల్పించువాడు, తెలిసికొనబడక తెలిసికొనువాడు.

శ్లో॥ అధీత్య చతురోవేదాన్, ధర్మశాస్త్రా ణ్యనేకశః ।
బ్రహ్మతత్త్వం నజానాతి, దర్వీపాకరసం యథా ॥

శ్లో॥ బహుశాస్త్ర కథాకంథా, రోమంథేన వృథైవకిమ్ ।
అన్వేష్టవ్యం ప్రయత్నేన, తత్త్వజ్ఞైర్జ్యోతిరాంతరమ్ ।

ముండకోపనిషత్తు

"అథపరాయయాతదక్షర మధిగమ్యతే, యత్తదద్రేశ్యం, మగ్రాహ్యం, మగోత్ర, మవర్ణ, మచక్షుశ్రోత్ర, మేతదపాణిపాదం, నిత్యం, విభుం, సర్వగతం, సుసూక్ష్మం తదవ్యయం, యద్భూతయోనిం, పరిపశ్యన్తి ధీరాః", "కస్మిన్ భగవో విజ్ఞాతే సర్వమిదం, విజ్ఞాతం", "దివ్యోహ్యమూర్తః పురుషః, సబాహ్యాభ్యంతరో హ్యజః" ॥ జగత్కా రణమగు పురుషుడు స్వప్రకాశుడు, నిర్వికారుడు, లోపల వెలుపల

నొక్క రూపముతో నుండువాడు. జననమరణములు లేనివాడు. "అవికారీవా అరేఽహ్యాయ మాత్మా అస్థూలమనణు, అజరోఽమరః"। "అభయం వై జనక ప్రాప్తోసి" "ఏకోదేవః సర్వభూతేషు గూఢః'। శాస్త్రము ఈ ప్రపంచము, ప్రపంచానుభూతియు, అనిత్యము, అవాస్తవము అని యెంతగ తెలుపుచున్నను, జీవునకు అనగా మానవునకు ఈ జగన్మిథ్యాత్వ నిశ్చయము నొందుట కష్టతరము, సంశయకరముగా నుండును. ఎట్లన— ఈ ప్రపంచము సమస్త జీవులకును అనుభూతినిచ్చుచుండగా అందుగూడ జీవులు, వారి వారి ఆనన్దమును యీ దృశ్యమునుంచి పొందుచుండగా యిది అవాస్తవము, మిథ్యయని యనుకొనుట ఎట్లని సంశయము. కాని యీ సంశయము సరిగాదు. ఈ ప్రపంచమునుంచి మానవులు వారి వారి సుఖదుఃఖములను, వారి వారి మనోనిష్ఠమగు వాసనా సంస్కారములచే పొందుచున్నారుగాని యీ సుఖదుఃఖములు బాగుగ విచారించిన వస్తు నిష్ఠములుగావు. ఈ విషయమును శాస్త్రీయ విమర్శతో వివేకులు గ్రహింపగలరు.

ఇదిగాకను అనుభవమిచ్చునట్టి దృశ్యము, లేకవస్తుజాలమంతయు వాస్తవము, నిత్యమైనదిగా యుండవలెనను నియమము లేదు. మానవులిప్పుడు పొందుచున్నట్టి వారి వారి ఆనన్దమంతయు కృత్రిమ, అవాస్తవ, తాత్కాలిక, ప్రదర్శనాది దృశ్య వస్తుజాలమునుంచే పొందుచున్నారుగాని, వ్యవహారమునందైనను ఆనన్దమంతయు యథార్థమగు వస్తువుల వలననే పొందుటలేదు. ఇది అందరి అనుభవములలో నున్నదే

కావున లోకానుభవము ఎంత రంజకముగాను, సుఖకరముగాను యున్నను, నిది యంతయు, తాత్కాలికము, స్వప్నదృశ్యానుభవముల వంటిదేననియు, ఈ ప్రపంచమెవరికిని నిత్యము వాస్తవముగాదనియు, జీవులకు తాత్కాలికానన్ద సుఖముల నిచ్చినను, ఈ ప్రపంచము దీర్ఘ స్వప్నము వంటిదనియు, నిత్యము, కేవల సుఖకరముగాదనియు,

సుఖకరమైనను మిథ్యా మాత్రమనియు, యీ క్రింది శాస్త్ర శ్లోకము తెలుపుచున్నది.

శ్లో॥ అనుభూతి ప్రదం విశ్వ, మపిసర్వం నవాస్తవమ్ ।
రంజయత్యపి మిథ్యైవ, స్వప్నస్త్రీ సురతం యథా ॥

కావున మానవునకు అహంమమేదములను ప్రతీతితో అనుభూతమగుచున్న యీ స్వశరీర సర్వమును అనగా ప్రపంచమును, వాస్తవము, నిత్యము గాదనియు, విషయములవలన సుఖదుఃఖములు రెండును, ఆగన్తుకములేననియు, నిశ్చయమునొంది, స్వప్రయత్నముతోడ అనాత్మవాసనలను క్షీణింపజేసుకుని శాస్త్రవాసనలను వృద్ధిచేసుకొనుట వారి వారి శాశ్వత సుఖమున కావశ్యకము.

భగవద్గీత 10వ అధ్యాయమందు శ్రీకృష్ణపరమాత్మ యిట్లు తెలుపుచున్నారు: సదా పరమాత్మ ఒకడే. ప్రతిబింబులైన జీవాత్మలనేకములు. ఈ నానాజీవులయొక్క పరమార్థ స్వరూపమే పరమాత్మ ఇది ఏకము, అద్వితీయము, అఖండము, స్వప్రకాశము. ఇదియే "అహం" నేను అను స్ఫురణరూపమున సర్వజీవులయందును అనుభవింపబడుచున్నది. 8, 9, 10 శ్లోకములు.

శ్లో॥ అహం సర్వస్య ప్రభవో, మత్తస్సర్వం ప్రవర్తతే ।
ఇతిమత్వా భజంతేమాం, బుధాభావ సమన్వితాః ॥

శ్లో॥ మచ్చిత్తా మద్గతప్రాణా, బోధయన్తః పరస్పరమ్ ।
కథయన్తశ్చమాం నిత్యం, తుష్యన్తి చరమన్తిచ ॥

శ్లో॥ తేషాం సతతయుక్తనాం, భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగంతం, యేనమా ముపయాన్తితే ॥

"అహం" ఆత్మస్వరూపుడగు నేనే, యీ సర్వమునకు గారణుడను. నా వలననే యీ సృష్టి అంతయు ప్రవర్తించుచున్నది. అని వివేకులిట్లు తెలిసికొని ప్రీతిభావముతో, నన్ను అనగా తన పరమాత్మస్వరూపమును సేవించుచుందురు. అనగా ఆత్మస్వరూపమును, అనుసన్ధానధ్యానాదులను జేయుచుందురు. వారు నా యందే అనగా ఆత్మస్వరూపమందే చిత్తముగలవారై నా యందే జీవనమునుంచినవారై, ఒకరికొకరు బోధించుకొనుచు, నిత్య తృప్తులై సంతోషించుచుందురు. నివృత్తిని బొందుదురు. ఈ రీతిగా నాయందాసక్తులై అనగా ఆత్మకాములగుచు అనుసన్ధానాదులను, ప్రీతిపూర్వకముగ జేయువారు ఏ యుపాయముచే నన్ను బొందుదురో అనగా బ్రహ్మాత్మ నా సంస్థితులగుదురో అట్టి బుద్ధిరూపమగు ఉపాయమును నేనే యిచ్చుచున్నాను. అనగా అట్టి బుద్ధి ప్రేరణను కలిగించెదను. అని పరమాత్మయే తెలుపుచున్నారు.-అది రసాయనము, అనగా ఆత్మగుణములను బాగుగ తెలిసికొని సేవించుటవలన కలుగునట్టి దివ్యసాధనము ఆత్మయన్నను స్వస్వరూపమన్నను నొక్కటియే.

# సిద్ధగీతలు

శ్లో॥ ద్రష్టృ దృశ్యసమాయోగా, త్ప్రత్యయానన్ద నిశ్చయః।
యస్తం స్వమాత్మ తత్త్వోత్థం, నిఃస్పన్దం సముపాస్మహే ॥

ద్రష్టయగు జీవునకు ఇష్టమైనట్టి దృశ్యవిషయములు సంప్రాప్తింప, అత్తఱి మనస్సునందు యే యానన్దము తోచునో, అట్టి ప్రతిబింబానన్దము తన కాధారమగు యే నిరతిశయ భూమానన్దరూపమైన స్వాత్మనుండి ఆవిర్భవించుచున్నదో, అట్టి నిశ్చల అనన్దరూపమగు ఆత్మను మేము బాగుగ ఉపాసించుచున్నాము.

శ్లో॥ ద్రష్టృదర్శన దృశ్యాని, త్యక్త్వావాసన యాసహ ।
దర్శన ప్రథమాభాస, మాత్మానం సముపాస్మహే ॥

ద్రష్టయగు జీవుని, దర్శనమగు మనోవృత్తిని దృశ్యమగు విషయములను (త్రిపుటిని) వాసనా సహితముగ త్యజించి, మనోవృత్తి ఉద్భవించకపూర్వమున్ను అద్వితీయముగ ప్రకాశించుచుండునదియు ఆ మనోవృత్తియొక్క ఉత్పత్తికిని సాక్షియై యుండునదియునగు ఆత్మను మేము బాగుగ ఉపాసించుచున్నాము.

శ్లో॥ ద్వయోర్మధ్యగతం నిత్య, మస్తినాస్తీతి పక్షయోః ।
ప్రకాశనం ప్రకాశ్యానా, మాత్మానం సముపాస్మహే ॥

సాక్షిరూప సత్తావిషయమై, "ఇది కలదు, ఇది లేదు", అను ఈ రెండు భావములున్ను అంతఃకరణ వృత్తులే కావునను, సాక్షి లేనిచో వానియొక్క ఉనికి సిద్ధింపమియు, ఆ రెండిటిని సాక్షిగా జూచుచు, ఆ రెండిటియొక్క అంతర్గతమున నిత్యము వెలుగుచుండు

నదియు, (లేక జగత్తుయొక్క సృష్టి ప్రళయముల రెండిటియందును సదా అనుగతమై సన్మాత్రరూపమున వెలయుచున్నదియు) నిత్యమైన దియు, వస్తువులను ప్రకాశింపజేయు సూర్యచంద్రాదులను, మనోవృత్తులను గూడ ప్రకాశింపజేయునదియునగు ఆత్మను మే ముపాసించుచున్నారము.

శ్లో॥ యస్మిన్ సర్వం యస్యసర్వం, యతఃసర్వం యస్మైఇదమ్।
యేన సర్వం యద్ధిసర్వం, తత్సత్యం సముపాస్మహే ॥

(రజ్జువునందు సర్పమువలె) దేనియం దీ సమస్తజగత్తు తోచుచున్నదో, దేని యధీనమై ఇదియంతయు వెలయుచున్నదో, దేనినుండి యీ సమస్తము ఆవిర్భవించుచున్నదో, యిది అంతయు దేనికొరకు అయివున్నదో, దేనిచే నిది జనించుచున్నదో, యధార్థమును విచారింప యీ జగత్తంతయు యేది అయివున్నదో, అట్టి సత్యవస్తువగు ఆత్మను మేము బాగుగ ఉపాసించుచున్నాము.

శ్లో॥ అశిరస్కంహకారాన్త, మశేషాకార సంస్థితమ్।
అజస్రముచ్చరన్తం స్వం, తమాత్మాన ముపాస్మహే ॥

ఆదియందు, "అ" కారమున్ను, అంతమందు "హ" కారమున్ను గల "అహం" (నేను) అను పదమునకు ముఖ్యార్థ (లక్షార్థ) మైనదియు, సమస్త చరాచర రూపములుగ స్థితి కలిగియున్నదియు, (లేక అకారము ఆదిగాగలిగి, హకారము అంతముగా గలిగియున్న సమస్త వర్ణ సముదాయముచే నేర్పడిన శాస్త్రాది సమస్త శబ్దజాలమందును స్థితి గలిగియున్నదియు) నిరన్తరము "సోహం" అను అజపాగాయత్రీమన్త్రమును శ్వాసోచ్ఛ్వాసముల ద్వారా జపించునదియు (లేక నిరన్తరము "నేను" అనెడి అనుభవరూపముతో స్ఫురించునదియు) నగు ప్రత్యగాత్మను మేము ఉపాసించుచున్నాము.

శ్లో॥ సంత్యజ్య హృద్గుహేశానం, దేవమన్యం ప్రయన్తియే।
తేరత్న మభివాఞ్ఛన్తి, త్యక్తహస్త స్థకౌస్తుభాః ॥

తమ హృదయ గుహయందున్న పరమాత్మను వదలి ఇతర దేవతల నెవరాశ్రయించుదురో, అట్టివారు తమ చేతియందున్న కౌస్తుభ మణిని పారవైచి ఇతర రత్నములను కోరువారే యగుదురు.

శ్లో॥ సర్వాశాః కిలసంత్యజ్య, ఫలమేతదవాప్యతే।
యేనాశా విషవల్లీనాం, మూలమాలా విలూయతే ॥

సమస్త కోరికలను లెస్సగ పరిత్యజించినపుడే హృదయ గుహ యందున్న యీ ఆత్మయను ఫలము లభించుచున్నది. మరియు అట్టి ఆత్మప్రాప్తిచే ఆశలను విషపు తీగెలు సమూలముగ (వాసనా సహితముగ) ఛేదించివేయ బడుచున్నవి.

శ్లో॥ బుద్ధ్వాప్యత్యన్త వైరస్యం, యః పదార్థేషు దుర్మతిః।
బధ్నాతి భావనాం భూయో, నరోనాసౌ సగర్దభః ॥

పదార్థమునందలి అత్యంత నీరసత్వము (సారహీనత్వము) నెరిగియు యే దుర్బుద్ధి మరల వానియందు ఆశగలిగి యుండునో, అట్టివాడు మనుష్యుడు గాడు ; గాడిదయే యగును.

శ్లో॥ ఉత్థితానుత్థితానేతా, నిన్ద్రియాహీన్పునః పునః।
హన్యా ద్వివేకదణ్డేన, వజ్రేణేవ హరిర్గిరీన్ ॥

ఇంద్రుడు వజ్రాయుధముచే పర్వతములను ఛేదించినట్లు, ఇన్ద్రియములను సర్పములు పైకి లేచినపుడెల్ల వివేకమను కఱ్ఱచే వానిని మరల చితుకగొట్టవలెను.

శ్లో॥ ఉపశమ సుఖమాహరేత్ప విత్రం, సుశమవతః శమ
మేతి సాధుచేతః ।
ప్రశమితమనసః స్వకేస్వరూపే, భవతి సుఖేస్థితిరుత్త
మాచిరాయా ॥

బాహ్యాభ్యంతర ఇన్ద్రియ వ్యాపార ఉపశమము ద్వారా ఆత్మ సుఖమును సంపాదింపవలెను. ఆ యాత్మసుఖము పరమ పవిత్రమైనది. ఉపశమముతో గూడిన వానియొక్క ఉత్తమచిత్తము కట్టెలులేని అగ్ని వలె లెస్సగ శమించిపోవును. అట్లు శమించిన మనస్సుకలవానికి సుఖ రూపమగు తన ఆత్మస్వరూపమున చిరకాలము ఉత్తమస్థితి లభించును.

వాశి. పే. 1032 and 42

శ్లో॥ అపిపుష్పా వదలనా, దపిలోచన మీలనాత్ ।
సుకరోఽహం కృతేస్త్యాగో, నక్లేశోఽత్రమ నాగపి ॥

శ్లో॥ కుచకోటరసంసుప్తం, విస్మృత్య జననీసుతమ్ ।
యథారోదితి పుత్రార్ధం, తథాత్మార్థ మయంజనః ॥

శ్లో॥ సంస్థాప్య సంకల్ప కలంకముక్తం, చిత్తం త్వమాత్మ
న్యుపశాంత కల్పః ।
స్పందోఽప్య సంస్పన్దమివేహతిష్ఠ, స్వస్థః సుఖీరాజ్య
మిదం ప్రశాధి ॥

శ్లో॥ అనాగతానాం భోగానా, మవాంఛనమ కృత్రిమమ్ ।
ఆగతానాంచ సంభోగ, ఇతి పండిత లక్షణమ్ ॥

వివేక చూడామణి

శ్లో॥ దృశ్యం ప్రతీతం ప్రవిలాపయన్ స్వయం, సన్మాత్ర
మానన్ద ఘనం విభావయన్ ।
సమాహితః సన్బహిరన్తరంవా, కాలం నయేథాః
సతికర్మబన్ధే ॥

ప్రారబ్ధవశమున నీకు దృశ్య ప్రపంచమే ప్రతీతమై అనుభవమున కొచ్చినపుడెల్ల, దృశ్యమంతయు, మిథ్యయని దానియందు లక్ష్యముంచక దానిని లయింపజేయుచు, సన్మాత్రమగు నీ ఆనన్ద స్వరూపానుభవము గలిగి, అనగా అఖండ సచ్చిదానన్ద ఆత్మతో తాదాత్మ్యమును బొందుచు, అనగా స్వాత్మాభిన్న అఖండాత్మానుభూతితో కాలక్షేపము జేయుము. అందువలన నీకు మరల సంసారవాసన కలుగదు.

శ్లో॥ విషయాభిముఖం దృష్ట్వా, విద్వాంసమపి విస్మృతిః ।
విక్షేపయతిధీదోషై ర్యోషా జారమివ ప్రియమ్ ॥

శ్లో॥ యథాప్రకృష్టం శైవాలం, క్షణమాత్రం నతిష్ఠతి ।
ఆవృణోతి తథామాయా, ప్రాజ్ఞంవాపి పరాఙ్ముఖమ్ ॥

కావున, జ్ఞానాభ్యాసకుడు విషయానుభవములతో అతి జాగరూకుడై, వాటి మిథ్యాత్వమును స్మరించుకొనుచు (అనగా విషయ మిథ్యాత్వ నిశ్చయమును మరువక) తన స్వస్వరూపమందే లక్ష్యముంచుకొనవలయును. అనగా తన స్వస్వరూప నిష్ఠయందే యుండవలయును గాని, విషయచింతనయం దుండరాదు.

శ్లో॥ సర్వస్యైకతయాయస్మాత్సాస్వప్నే దృష్టదర్శనా ।
యథాస్వప్నే తథోదేతి, పరలోక దృగాదిభిః ॥

శ్లో॥ నిమిషేణైవ జీవస్య, స్మృతిమోహాదనన్తరమ్ ।
త్రిజగద్దృశ్య సర్గశ్రీః ప్రతిభాముపగచ్ఛతి ॥

శ్లో॥ జీవస్యోన్మీలనాత్క్షణే రూపజీవాభి లాన్యలమ్ ।
తత్క్షణాత్ స్మృతితామేతి, స్వప్నస్వమరణం యథా ॥

శ్లో॥ తస్మిన్స్మృతి ముహూర్తేతే, ప్రతిభానముపాగతమ్ ।
యథాస్వప్న ముహూర్తేఽన్తః, సంవత్సర శతభ్రమః ॥

వివేక చూడామణి

శ్లో॥ లక్ష్యే బ్రహ్మణిమానసం దృఢతరం, సంస్థాప్య బాహ్యే
న్ద్రియమ్ ।
స్వస్థానే వినివేశ్యనిశ్చల తనుశ్చోపేక్ష్య దేహస్థితమ్ ।
బ్రహ్మాత్మైక్యముపేత్య తన్మయతయా చాఖండ వృత్త్యా
ఽనిశమ్ ।
బ్రహ్మానన్దరసం పిబాత్మని ముదాశూన్యైః కిమన్యై
ర్భ్రమైః ॥

శ్లో॥ అనాత్మచిన్తనంత్యక్త్వా, కశ్మలం దుఃఖకారణమ్ ।
చిన్త యాత్మాన మానన్దరూపం యన్ముక్తికారణమ్ ॥

శ్లో॥ ఏషస్వయం జ్యోతిరశేష సాక్షీ, విజ్ఞానకోశే విలసత్య
జస్రమ్ ।
లక్ష్యం విధాయైనమ సద్విలక్షణం, అఖండవృత్త్యాత్మత
యానుభావయ ॥

శ్లో॥ ఏతమచ్ఛిన్న యావృత్త్యా, ప్రత్యయాన్తర శూన్యయా ।
ఉల్లేఖ యన్విజానీయా త్స్వస్వరూపతయాస్ఫుటమ్ ॥

శ్లో॥ అత్రాత్మత్వం దృఢీకుర్వ, న్నహమాదిషు సంత్యజన్ ।
ఉదాసీనతయాతేషు, తిష్ఠేద్ఘట పటాదివత్ ॥

శ్లో॥ బ్రహ్మాదిస్తంబపర్యన్తా మృషామాత్రా ఉపాధయః ।
తతఃపూర్ణం స్వమాత్మానం, పశ్యేదేకాత్మ నాస్థితమ్ ॥

గీత

శ్లో॥ క్షేత్రజ్ఞం చాపిమాంవిద్ధి సర్వక్షేత్రేషు భారత ।
క్షేత్ర క్షేత్రజ్ఞయోర్జ్ఞానం, యత్తత్ జ్ఞానం మతంమమ॥

శ్లో॥ అధ్యాత్మజ్ఞాన నిత్యత్త్వం, తత్త్వజ్ఞానార్థ దర్శనమ్ ।
ఏతత్ జ్ఞాన మితిప్రోక్త, మజ్ఞానం యదతోఽన్యథా ॥

శ్లో॥ జ్యోతిషా మపితజ్జ్యోతిః, తమసః పరముచ్యతే ।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం, హృదిసర్వస్య ధిష్ఠితమ్ ॥

శ్లో॥ సమంసర్వేషు భూతేషు, తిష్ఠన్తం పరమేశ్వరమ్ ।
వినశ్యత్స్వ వినశ్యన్తం, యఃపశ్యతి సపశ్యతి ॥

శ్లో॥ ప్రకృత్యైవచ కర్మాణి, క్రియమాణాని సర్వశః ।
యఃపశ్యతి తథాత్మాన, మకర్తారం సపశ్యతి ॥

శ్లో॥ అనాదిత్వా న్నిర్గుణత్వా, త్పరమాత్మా యమవ్యయః ।
శరీరస్థోపి కాన్తేయ, నకరోతి నలిప్యతే ॥

శ్లో॥ యథాసర్వగతం సౌక్ష్మ్యా, దాకాశం నోపలిప్యతే ।
సర్వత్రావస్థితోదేహే, తథాఽఽత్మానోపలిప్యతే ॥

శ్లో॥ యథాప్రకాశయత్యేకః, కృత్స్నంలోక మిమంరవిః ।
క్షేత్రం క్షేత్రీ తథాకృత్స్నం, ప్రకాశయతి భారత ॥

శ్లో॥ క్షేత్రక్షేత్రజ్ఞయోరేవ, మన్తరం జ్ఞానచక్షుషా ।
భూతప్రకృతి మోక్షంచ, యే విదుర్యాన్తితే పరమ్ ॥

"ఏది నిత్యమో, నిర్వికారమో, నిరవయవమో, అజమో, అవినాశియో, సర్వాధారమో, సర్వధీసాక్షీ భూతమో, అవ్యయమో, అఖండ సచ్చిదానన్ద స్వరూపమో, సత్యజ్ఞానానన్తమో, స్వాత్మాభిన్న, స్వప్రకాశ, సర్వాధిష్ఠాన అఖండ పరిపూర్ణ చిద్ఘనానన్దరూపమో, అదియే నేను "అహం", అని ధ్యానించుచుండుము.

బ్రహ్మ విద్యాభ్యాసకునకు తనకీ విద్య ఫలించునా? ఎప్పుడు తనకీ విద్య ఫలించునని తెలిసికొనుటకు పరీక్షగా, గీత. 2 అ శ్లో. 52, 53 చూడవలయును.

శ్లో॥ యదాతే మోహకలిలం, బుద్ధిర్వ్యతితరిష్యతే।
తదాగన్తాసి నిర్వేదం, శ్రోతవ్యస్య శ్రుతస్యచ ॥

శ్లో॥ శ్రుతివిప్రతిపన్నాతే, యదాస్థాస్యతి నిశ్చలా।
సమాధా వచలాబుద్ధి, స్తదాయోగ మవాప్స్యసి ॥

అనగా, ఎప్పుడు నీ బుద్ధి దేహాభిమానమనెడు కాలుష్యమును విడుచునో, అప్పుడు నీవు వినదగినదానికి, విన్నదానికినీ వైరాగ్యమును బొందుదువు.

ఎప్పుడు వేదాన్తవాక్యములు వినుటచే నీ బుద్ధి సమ్యక్జ్ఞానము నందు నిశ్చలమైయుండునో, అప్పుడు నీకీ యోగఫలము తప్పక సిద్ధించును. మరియును :—

(గీత. 6 అ శ్లో॥ 18, 19, 20, 21, 22, 23 శ్లోకములు గ్రంథమందు చూడదగును. ఇచట శ్లోక తాత్పర్యార్థమును మాత్రము వ్రాయుచున్నాడను.)

18. ఎప్పుడు ఏకాగ్రముగ చిత్త మాత్మయందు నిలుచునో, ఎప్పుడు కోరికలన్నియూ క్షీణించునో, లేకపోవునో అప్పుడు యోగము సిద్ధించుచున్నదని తెలిసికొనవలయును

19. చిత్తనిరోధము చేసికొని అనగా చిత్తవిక్షేపము తగ్గి ఆత్మాను సన్ధానముచేయు యోగికి, గాలిలేనిచో దీపము చలించక యుండునట్లు చిత్తవిక్షేపము అనగా చిత్తచలనము లేకుండ యుండునో, అపుడు యోగము సిద్ధించుచున్నట్లు తెలిసికొనవలయును.

20. ఎప్పుడు యోగానుష్ఠానముచే, నిరుద్ధమగు చిత్తము ఉపరతిని అనగా శాంతిని బొందుచుండునో, ఎప్పుడు అభ్యాసముచే పరిశుద్ధమగు, అంతఃకరణముచేత ఆత్మ జ్యోతిస్సును తనలో జూచుచు సంతోషము నొందుచుండునో,

21. ఎప్పుడు ఇన్ద్రియములకు గోచరముగాక మనస్సుచేతనే తెలియదగు ఆనన్దము ననుభవించుచుండునో, ఎప్పుడు తత్త్వరూపమగు బ్రహ్మానన్దమును బొందుచున్నవాడై చలనమును అనగా సంశయ విపర్యయముల నొందడో,

22. ఏ లాభమును పొందుచుండుటవలన, ఇతర లాభములను అంతకన్న హెచ్చుగా తలంపడో, ఏ యాత్మతత్త్వమునందున్నవాడగుచు, గొప్ప దుఃఖములొచ్చినను చలింపకుండునో,

23. దానినే దుఃఖములేని యోగముగా తెలిసికొని, అట్టి అభ్యాసమును పట్టుదలతో విసువుజెందక మనసుతోడ నాచరించుచుండవలయును.

27. బాగుగ శాంతించిన మనస్సుగలవాడును, రజోగుణము క్షీణించినవాడును, పుణ్యపాపములు లేనివాడును అగు యోగికి ఉత్తమమగు జీవన్ముక్తి, దాని సుఖము లభించును.

ఈ శ్లోకముల కర్థము వెనుక జూడవలయును.

20 శ్లో॥ యత్రోపరమతేచిత్తం, నిరుద్ధం యోగసేవయా ।
యత్రచైవాత్మనాఽఽత్మానం పశ్యన్నాత్మ నితుష్యతి ॥

21 శ్లో॥ సుఖమాత్యన్తికంయత్త ద్బుద్ధిగ్రాహ్యమతీన్ద్రియమ్ ।
వేత్తియత్ర నచైవాయం స్థితశ్చలతి తత్త్వతః ॥

22 శ్లో॥ యంలబ్ధ్వా చాపరంలాభం, మన్యతేనాధి కంతతః।
యస్మిన్స్థితో నదుఃఖేన, గురుణాఽపి విచాల్యతే॥

23 శ్లో॥ తంవిద్యాద్దుఃఖ సంయోగ, వియోగం యోగసంజ్ఞితమ్।
యోగినోయత చిత్తస్య, యుఞ్జతో యోగమాత్మనః॥

18 శ్లో॥ యదావిని యతంచిత్త మాత్మన్యేవావతిష్ఠతే।
నిస్స్పృహస్సర్వకామేభ్యో యుక్తఇత్యుచ్యతే తదా॥

19 శ్లో॥ యథాదీపో నివాతస్థో నేఙ్గతే సోపమాస్మృతా।
యోగినో యతచిత్తస్య, యుఞ్జతో యోగమాత్మనః॥

27 శ్లో॥ ప్రశాన్తమనసంహ్యేనం యోగినం సుఖముత్తమమ్।
ఉపైతిశాన్త రజసం బ్రహ్మభూత మకల్మషమ్॥

ఆత్మజ్ఞాన సాధనమును, అభ్యాసమును తెలుపునట్టి గీత 13 అ 8, 9, 10, 11, 12 శ్లోకములు.

8 శ్లో॥ అమానిత్వ మదమ్భిత్వ, మహింసాక్షాన్తి రార్జవమ్।
ఆచార్యోపాసనం శౌచం, స్థైర్యమాత్మ వినిగ్రహః॥

9 శ్లో॥ ఇన్ద్రియార్థేషువైరాగ్య, మనహంకారమేవచ।
జన్మమృత్యు జరావ్యాధి, దుఃఖదోషాను దర్శనమ్॥

10 శ్లో॥ అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు।
నిత్యంచ సమచిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు॥

11 శ్లో॥ మయిచానన్యయోగేన, భక్తి రవ్యభిచారిణీ।
వివిక్త దేశసేవిత్వ మరతిర్జన సంసది॥

✕

# విద్యావిచారమున కొన్ని వాక్యములు

"అనాహూతోఽధ్వరంగచ్ఛేత్"

1. లేనివస్తువును పుట్టించుట- (ఘటాదికము) ఉత్పత్తి

2. కాశీనగరమువంటి దూరదేశమును ప్రాప్తింపజేయుట-ఆప్తి.

3. క్షీరమునుంచి దధివలె వికారమును గలిగించుట-వికృతి.

4. మాలిన్యాది దోషములను పోగొట్టి సంస్కరించుట-సంస్కారము. క్షాలనముచే వస్త్ర పరిశుద్ధి. సత్కర్మానుష్ఠానముచే చిత్తశుద్ధి మొదలగునవి సంస్కారములు.

5. వస్తువును పొందుట- ఫలము, స్వర్గాదులు.

ఈ అయిదును కర్మానుష్ఠాన ప్రయోజనములు-

వాశి. పే. 743

శ్లో॥ చిద్వ్యోమైవకిలాఽస్తీహ, పారావార వివర్జితమ్ ।
సర్వత్రా సంభవచ్చైత్యం, కల్పాంతేషు భవిష్యతి ॥

అనగా ఆద్యంతవర్జితంబును, దృశ్య సంస్పర్శరహితంబును, కల్పాంతములయందు శేషించునదియు నగు చిదాకాశం బొక్కటియే గలదు.

శ్లో॥ అకృత్రిమమనాద్యన్త, మద్వితీయ మఖండితమ్ ।
అబహిస్సాధనా సాధ్యం, సుఖం తస్మాద వాప్యతే ॥

అనగా, నిరుపాధికంబును, ఆద్యన్తరహితంబును, బాహ్యసాధ

నముల కసాధ్యంబునగు కైవల్యసుఖము ఆత్మజ్ఞానమువల్లనే లభించు చున్నది.

కర్మ 5 విధములగు ఫలములను పుట్టింపగలుగును.

1. ఉత్పాద్యము. 2. ఆప్యము. 3. వికార్యము. 4. సంస్కార్యము. 5 ఫలము ఈ అయిదు విధములలో జేరని కర్మకార్యమేదియును లేదు. మోక్షము నిత్యము గనుక నుత్పాద్యముగాదు. స్వర్గాది ప్రాప్తివలె ఫలము కాదు, ఉత్పాద్యము గాదుగనుక వికార్యముగాదు. ఆత్మస్వరూపమగు మోక్షము స్వస్వరూపమే గనుక మార్గనిష్ఠమగు ప్రాప్యము గాదు, నిత్య సిద్ధము. మోక్షమనునది ద్రవ్యముగాదు గనుక సంస్కార్యము గాదు కావున మోక్షము కేవలము జ్ఞానరూపము కర్మవలె యీ పై 5 విధములగు ఫలముల నిచ్చునదిగాదు. వాక్యము— "నాయమాత్మా ప్రవచనేనలభ్యో, న మేధయా, నబహునాశ్రుతేన, యమేవైషవృణుతే తేనలభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూగ్ంస్వామ్"। తా॥ ఆత్మబహువేదాధ్యయనముచే గాని, శాస్త్రపఠన ధారణా సామర్థ్యముచేగాని, ఆత్మ ప్రతిపాదకములు గాని, (వేదాన్త) శాస్త్రముల వలనగాని, గురూపదేశ రహితమగు శాస్త్ర శ్రవణముచేగాని, ప్రాప్యము గాదు. కాని, నిష్కాముడగు నే సాధకుడు స్వాత్మభూతమగు నాత్మను బొందవలయునని, శ్రవణాది కాలమునుండియు గూడ, కోరునో, యట్టివానికి అది లభ్యమగుచు, పరమాత్మ తన పారమార్థిక స్వరూపము ఆత్మకాముడగువానికి, ప్రకాశింపజేయును. "ఋతం పిబన్తౌ సుకృతస్యలోకే గుహాం ప్రవిష్టౌ పరమేపరార్ధే। ఛాయాతపౌ బ్రహ్మవిదోవదన్తి"। తా॥ స్వయంకృతమగు కర్మఫలముల ననుభవించునట్టి ఆత్మ, శరీరమునందలి శ్రేష్ఠమైన బ్రహ్మస్థానమగు బుద్ధి గుహయందు ప్రవేశించునట్టి ఆత్మ, యీ ఆత్మలు రెండును ఛాయా తపములవలె విలక్షణములగుచున్నవి.

"ఇన్ద్రియేభ్యఃపరా హ్యర్థా, అర్థేభ్యశ్చ పరంమనః ।
మనసస్తుపరాబుద్ధి, ర్బుద్ధేరాత్మా మహాన్పరః ॥

"మహతః పరమవ్యక్త. మవ్యక్తాత్ పురుషఃపరః ।
పురుషా న్నపరంకించి, త్సాకాష్ఠాసాపరాగతిః ॥

తా॥ పురుషుడు ప్రత్యగాత్మ భూతుడు పురుషునికంటె మహత్తరము, సూక్ష్మతరమునగు వస్తువు మరియొకటి లేదు. స్థూలత్వ, మహత్వ, ప్రత్యగాత్మత్వములకు అదియే పరమావధి.

"ఏషసర్వేషు భూతేషు గూఢోత్మాన ప్రకాశతే, దృశ్యతే త్వగ్ర్యయాబుద్ధ్యా, సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః ॥

పరమ పురుషుడు సమస్తప్రాణుల బుద్ధిగుహాయందు నిగూఢముగ నుండుటచే దెలియబడుట లేదు. ఏకాగ్రము సూక్ష్మాత్ సూక్ష్మతరమగునట్టి, బుద్ధిసహాయముచే, సూక్ష్మదర్శకులగు పండితులచేతనే తెలియబడును. "ఉత్తిష్ఠత జాగ్రతప్రాప్య వరాన్నిబోధత । క్షురస్యధారా నిశితా దురత్యయా దుర్గం పథస్తత్కవయో వదన్తి" ।



# ఆత్మాను సన్ధానము

(అహం, (నేను) ప్రతీతి వాచ్యార్థ, లక్ష్యార్థముల వివేచన)

అహం వాచ్యార్ధ ప్రతీతి— నా దేహాదులు కేవల వ్యవహార ప్రయోజనము గలవి. నామరూప కర్తృత్వాదులు గల స్థూల దేహమూ, సూక్ష్మదేహాది సంఘాతము. ఇది అంతయు అజ్ఞాన కల్పిత మగునట్టి జీవప్రారబ్ధానుభవమునకు కల్పితముగ నేర్పడిన యొక సంఘాతము. ఈ సూక్ష్మదేహాది సంఘాతమే చిదాభాసుడు, వ్యవహారి, అనిత్యుడు, అవాస్తవుడు, సంసారి, ఉభయాత్మకుడు, అనగా సత్యానృత ములు గలవాడు. కాని అర్ధ, పరమార్ధప్రాప్తికి యీయనయే సాధనము తప్ప మరియొకటి లేదు. అహంలక్ష్యార్థము :— ఇది పరమార్ధ స్వరూ పము, అవినాశి. ఇదియే జీవుని వాస్తవస్వరూపము. ఆత్మ, పరమాత్మ, బ్రహ్మ, సర్వాధిష్ఠానము. ఇదియే నా వాస్తవస్వరూపము. ఇది నిత్య నిర్వికార, అద్వితీయ, అసంగపరిపూర్ణ అఖండచైతన్యము. ఇదియే స్వాత్మాభిన్న, అఖండ సర్వాధిష్ఠాన, స్వప్రకాశ, సర్వధీసాక్షీభూత, అఖండ సచ్చిదానన్ద చిదాకాశ స్వరూపము. ఇదియే జీవాత్మ హృదయ గుహయందు తెలియబడును. దీనినే శ్రుతి :— "యోవేదనిహితం గుహాయాం పరమేవ్యోమన్", అను వచనముతోడ తెలుపుచున్నది. ఇదియే నా నిత్య నిరతిశయ సుఖస్వరూపము, అవినాశి. నేను కేవల చిద్రూపుడను ప్రకాశమాత్ర ప్రత్యగాత్మస్వరూపుడను. నేనే అనగా యిట్టి నా వాస్తవస్వరూపమే పరమాత్మ, బ్రహ్మ, చిదాకాశము. నాలో తెలియబడుచున్నట్టి నీ ప్రత్యగాత్మయు, సర్వాధిష్ఠానముగనున్నట్టి పరమాత్మయు నొక్కటియే ఎట్లన, ఘటాకాశ— మహాకాశములాగున. ఇది వ్యవహారమాత్రము. ఆకాశమెల్లప్పుడును, సర్వత్ర ఒక్కటియే.

మరియును యీ తన వాస్తవస్వరూపమగు ఆత్మకు జనన మరణములతో నెట్టి వాస్తవసంబంధము లేదనియు, యివి అన్నియు తనకు కల్పితమగు, ఉపాధి ధర్మములేననియు, తాను షడూర్మిరహితుడ ననియు, నిశ్చయమునొంది, సర్వదా తన ఆత్మస్వరూపమందు ప్రీతి తోడ అనుసన్ధానాదులు ఆచరించుచు, స్వశరీర సర్వజగన్మిధ్యాత్వ నిశ్చ యముతోడ ప్రారబ్ధానుసరణమున గలుగునట్టి తన వ్యవహారములను నిర్లిప్తతతోడ నాచరించుచుండుటయే ముముక్షు కర్తవ్యము అని అభ్యా సకులు గ్రహింతురుగాక.



# మరణ మూర్ఛనమ్

[ బృ. వాశి. పేజి 178 ]

"ప్రమాదంవై మృత్యుమహం బ్రవీమి", అని సనత్సుజాతీయ వాక్యము తెలుపుచున్నది.

శ్లో॥ క్షణకల్పం జగత్సర్గం, త్వత్తామత్తాత్మజన్మనామ్ ।
యథావత్ప్రతిభాసస్యం, వక్ష్యే క్రమ మిమంశృణు ॥

శ్లో॥ అనుభూయక్షణం జీవో, మిథ్యామరణ మూర్ఛనమ్ ।
విస్మృత్య ప్రాక్తనంభావ, మన్యంపశ్యతి సువ్రతే ॥

శ్లో॥ తదేవోన్మేషమాత్రేణ, వ్యోమ్న్యేవవ్యో మరూప్యసి ।
ఆధేయోఽయమిహాధారః, స్థితోఽహమితిచేతతి ॥

శ్లో॥ హస్తాపాదాదిమాన్ దేహో, మమాయ మితిపశ్యతి ।
యదేవచేతసివపు, స్తదేవేదం సపశ్యతి ॥

శ్లో॥ ఏతస్యాహం పితుఃపుత్రో, వర్షాణ్యేతానిస న్తిమే ।
ఇమేమేబాంధవారమ్యా, మమేదం, రమ్యమాస్పదమ్ ॥

శ్లో॥ జాతోఽహమభవంబాలోవృద్ధిం యాతోఽహమీదృశః ।
బాన్ధవాశ్చాస్యమేసర్వే, తథైవ విచరన్త్యమీ ॥

శ్లో॥ చిత్తాకాశఘనైకత్వా, త్స్వేప్యన్యేఽపి భవన్తితే ।
ఏవం నామోదితేఽప్యస్య, చిత్తేసంసార ఖండకే ॥

శ్లో॥ నకించిదప్యభ్యు దితం, స్థితంవ్యోమైవ నిర్మలమ్ ।
స్వప్నేద్రష్టరి యద్వ చ్చిత్తద్వద్దృశ్యే చిదేవసా ॥

శ్లో॥ సర్వాగ్రైకతయా యస్మా, త్స్వప్నే దృష్టదర్శనా ।
యథాస్వప్నే తథోదేతి, పరలోకదృగాదిభిః ॥

శ్లో॥ నిమిషేణైవజీవస్య, స్మృతిమోహాదనన్తరమ్ ।
త్రిజగద్దృశ్య సర్గశ్రీః, ప్రతిభా ముపగచ్ఛతి ॥

శ్లో॥ జీవస్యోస్మిలనాత్క్షణే, రూపాణీవాఖిలాన్యలమ్ ।
తత్క్షణాత్ స్మృతితామేతి, స్వప్నస్వమరణం యథా ॥

శ్లో॥ తస్మిన్స్మృతి ముహూర్తే తే, ప్రతిభాన ముపాగతమ్ ।
యథాస్వప్న ముహూర్తేఽన్తః, సంవత్సర శతభ్రమః ॥



# సంకల్ప త్యాగము

విద్వాంసునకు తన మోక్షప్రాప్తికి సంకల్ప త్యాగము ప్రధానము. సంకల్పమే లేనిచో జీవన్ముక్తునకు వ్యవహారమెట్లు సాధ్యమని శ్రీరామ చంద్ర మూర్తికి, కలిగిన సంశయమునకు శ్రీ వశిష్ఠభగవాను లిట్లు తెలుపుచున్నారు :

శ్లో॥ నైష్కర్మ్యాత్కల్పనా త్యాగాత్తనుః పతతిదేహినః ।
కథమేతదతో బ్రహ్మ న్సంభవత్యాశు జీవతః ।

అని శ్రీరామచంద్రమూర్తి ప్రశ్న.

శ్లో॥ అహం భావనమేవాహుః, కల్పనం కల్పనావిదః ।
నభోర్ధ భావనంతస్య, సంకల్పత్యాగ ఉచ్యతే ॥ 1

శ్లో॥ పదార్ధరసమేవాహుః కల్పనం కల్పనావిదః ।
నభోర్ధభావనంతస్య, సంకల్పత్యాగ ఉచ్యతే ॥ 2

శ్లో॥ ఇదంవస్త్వితి సంవేగమాహుః కల్పన ముత్తమాః ।
నభోర్ధభావ నంతస్య, సంకల్పత్యాగ ఉచ్యతే ॥ 3

1. అనగా ఓ రామచంద్రా, సంకల్పవిషయ మెరిగిన పెద్దలు పరిచ్ఛిన్న దేహాదులందలి అహంభావనయే సంకల్పమని నుడివిరి. మరియు అపరిచ్ఛిన్న బ్రహ్మాకాశరూపమైన స్వకీయ, పారమార్ధిక స్వరూపము (ఆత్మ) యొక్క భావనయే సంకల్ప త్యాగమని చెప్పబడుచున్నది.

2. దృశ్య పదార్ధమును గూర్చిన భావనయే సంకల్పమని సంకల్ప

వేత్తలు పలికిరి. మరియు సర్వత్ర ఏకమైన బ్రహ్మాకాశము (ఆత్మ) యొక్క సత్తను భావించుటయే సంకల్పత్యాగమని పేర్కొనబడెను.

3. ఈ దేహాది సమస్త దృశ్యపదార్ధములు సత్యములను అభిమానమే సంకల్పమని విజ్ఞులు చెప్పుదురు. అవి అసత్యములని యెరిగి అపరిచ్ఛిన్న చిదాకాశము (ఆత్మ) యొక్క స్వరూపమును భావన చేయుటయే సంకల్పత్యాగమని చెప్పబడును.

శ్లో॥ ఊర్ధ్వబాహుర్విరౌమ్యేష నచకశ్చి చ్ఛృణోతిమే ।
అసంకల్పః పరంశ్రేయః, సకిమన్తర్న భావ్యతే ॥ 4

4. అనగా 'సంకల్పము లేకుండుటయే పరమశ్రేయమని' నేను రెండు చేతులు పైకెత్తి బిగ్గరగా అరచి చెప్పుచున్నప్పటికిని ఈ నా వాక్యముల నెవరును వినుటలేదు. అట్టి అసంకల్పత్వమును జనులు తమ యంతఃకరణమున ఏల అవలంబింపక యున్నారు ?

శ్లో॥ అహో మోహస్య మాహాత్మ్యం,యదయం సర్వదుఃఖహా।
చింతామణి ర్విచారాఖ్యో హృత్స్థోఽపిత్యజ్యతేజనైః॥ 5

ఆహా ! మోహముయొక్క మహిమ యెట్టిది ! సమస్త దుఃఖములను నశింపజేయునట్టి (తత్త్వ) విచారణయను చింతామణి వారివారి హృదయముననే యున్నప్పటికినీ జనులద్దానిని త్యజించివేయుచున్నారే!

శ్లో॥ కిలతూష్ణీం స్థితేనైవ తత్పదం ప్రాప్యతేపరమ్ ।
పరమంయత్ర సామ్రాజ్య మపిరామ తృణాయతే ॥ 6

ఓ రామచంద్రా ! ఎచట సమస్త బ్రహ్మాండ సామ్రాజ్యమున్ను తృణమువలె గోచరించునో అట్టి పరమాత్మ పదము సంకల్పచేష్ట లేని తూష్ణీంస్థితి మాత్రముచేతనే లభించును.

శ్లో॥ గమ్యదేశై కనిష్ఠస్య యథాపాన్థస్యపాదయోః ।
స్పన్దోవిగత సంకల్ప స్తథాస్పన్ద స్స్వకర్మసు ॥ 7

గమ్యప్రదేశమును గూర్చి యేకై కనిష్ఠతో జనుచుండు బాటసారి యొక్క పాదములు సంకల్పములేకయే చలించుచుండునట్లు, నీవున్ను సంకల్పరహితుడవై యథాప్రాప్తములగు స్వకర్మలందు చేష్ట సలుపుము.

శ్లో॥ రసభావనమన్తస్తే, మాలంభవతు కర్మసు ।
దారు యన్త్రమయస్యేవ, పరార్థమివ కుర్వతః ॥ 8

పరుల కౌతుకనిమిత్తము నృత్యాదులను సల్పు దారు (కొయ్య) యంత్ర నిర్మితనటునకు శృంగారాది రసభావము లేకుండునట్లు నీకున్ను కార్యములందు రసభావము అంతఃకరణమున ఒకింతైనను లేకుండుగాక!

శ్లో॥ నీరసా ఏవతేసన్తు, సమస్తేన్ద్రియ సంవిదః ।
ఆకారమాత్ర సంలక్ష్యా హేమన్తర్తౌలతా ఇవ ॥ 9

సమస్త ఇన్ద్రియములయొక్క విషయానుభవములున్ను నీకు హేమన్తర్తువునందలి లతలవలె నీరసముగను, కేవలము ఆకార మాత్ర ముగ (రసరహితముగ) కానిపించునవిగను ఉండుగాక!

శ్లో॥ బహునాత్రకిముక్తేన సంక్షేపాదిద ముచ్యతే ।
సంకల్పనం మనోబన్ధస్తదభావో విముక్తతా ॥ 10

ఇవ్విషయమున అధికముగ జెప్పనేల? (సారమంతయు) సంక్షేపముగ చెప్పెదను వినుము. సంకల్పమే మనస్సు యొక్క బంధనము. సంకల్పములేకుండటయే ముక్తి.

## చిత్తనాశము

శ్లో॥ యదభావనమాస్థాయ, యదభావస్య భావనమ్ ।
యద్యథావస్తు దర్శిత్వం, తదచిత్తత్వముచ్యతే ॥

జగద్భావనను విడచి, జగము వాస్తవముగాదని భావించుటయు, బ్రహ్మమే నేను, యీ సర్వమునని యెరుంగుటయు, చిత్తరాహిత్యమని చెప్పబడుచున్నది.

శ్లో॥ సర్వమన్తః పరిత్యజ్య, శీతలాశయవర్తియత్ ।
వృత్తిస్థమపి, తచ్చిత్త మసద్రూపముదాహృతమ్ ॥

అంతఃకరణమునందు, అనగా మనసున రాగద్వేష రహితమైన చల్లని స్థితిగల చిత్తము, వృత్తులయందున్నదైనను, లేనిదిగనే చెప్పబడుచున్నది – అని శ్రీ వశిష్ఠభగవానులు తెలుపుచున్నారు.



# సమాధి—సమాధి లక్షణములు

అద్వైతసిద్ధికి హఠయోగసమాధి నిషిద్ధము. ఇది ముఖ్య సమాధి కాదు. ఏలనన దీనివలనగలుగు సిద్ధులు అనిత్యము, అవాస్తవమగు ప్రపంచములోనివి. బ్రహ్మ నిష్ప్రపంచము, నిత్యము. కావున నిత్యమగు స్వస్వరూపజ్ఞానము నివ్వజాలవు. కావున హఠయోగ సమాధి ప్రధానము గాదు. మరి ఏది ముఖ్యమనిన తత్త్వమస్యాది వేదాన్త మహావాక్యార్థ మగు ప్రత్యగభిన్న బ్రహ్మ సాక్షాత్కారమువలన అవిద్య యావత్తు, నివర్తించునుగనుక తత్కార్యమగు ఆకాశాది ప్రపంచమంతయు బాధింప బడును. తిరిగి యెన్నటికిని అవిద్య కలుగనేరదు. కనుక వేదాన్త మహా వాక్యార్థ సాక్షాత్కార పూర్వకముగ గలుగు సమాధియే ముఖ్యము. జ్ఞానులు యిట్టి హఠయోగ సిద్ధులను వాంఛింపరు. ఏలనన అవి కాలాం తరమందు నశించునవి, అనిత్యములు. కావున వానివలన నిత్య నిరతి శయానంద జ్ఞానము కలుగదు. ఆత్మజ్ఞాన శూన్యులు హఠయోగము వలన అణిమాద్యష్ట సిద్ధులను కోరుచుందురుగాని, తత్త్వజ్ఞానులు వాంఛింపరు.

జ్ఞాన సమాధి లక్షణములను గురించి శ్రీ వశిష్ఠ భగవాను లిట్లు తెలుపుచున్నారు :

1. శ్లో॥ నిత్యప్రబుద్ధ చిత్తత్వా త్కుర్వంతోఽపి జగత్క్రియాః।
ఆత్మైకతత్త్వ తన్నిష్ఠా స్సదైవసు సమాధయః ॥

(ఆత్మ నెరుగని మూఢుడు ఊరకయుండనీ, వ్యవహారము చేయుచుండనీ, వానికెప్పటికినీ సమాధి కలుగనేరదు) ఆత్మతత్త్వము నెరింగిన వారలు జగత్సంబంధములగు కృత్యముల జేయుచున్నవార

లైనను ఆత్మయందే యునికిగలవారగుటచేత నెప్పుడును సమాధిగల వారలే యగుదురు.

2. శ్లో॥ బద్ధపద్మాసనస్యాపి, కృతబ్రహ్మాంజలేరపి ।
అవిశ్రాంత స్వభావస్య, కస్సమాధిః కథంచవా ॥

3. శ్లో॥ తత్త్వావబోధో భగవన్, సర్వాశాతృణ పావకః ।
ప్రోక్తస్సమాధి శబ్దేన, నచతూష్ణీ మవస్థితిః ॥

పద్మాసనస్థుండై గూర్చుండియున్నను, బ్రహ్మాంజలి చేయుచున్నను. చిత్తము విశ్రాంతినొందనివానికి సమాధి యెట్లు కలుగును? సమస్తమగు నాశలను తృణంబులకు నగ్నియగు తత్త్వజ్ఞానము సమాధి శబ్దముచే చెప్పబడునుగాని ఊరకయుండుట మాత్రము సమాధి శబ్దముచే చెప్పబడనేరదు.

4. శ్లో॥ సమాహితానిత్యతృప్తా, యథాభూతార్థ దర్శినీ ।
సాధోసమాధి శబ్దేన, పరాప్రజ్ఞోచ్యతే బుధైః ॥

ఓ సాధువా! సుస్థిరంబును, యథార్థదృష్టి యుక్తంబును నగు పరమ జ్ఞానము సమాధి శబ్దముచే చెప్పబడును.

5. శ్లో॥ అక్షుబ్ధా నిరహంకారా, ద్వంద్వేష్వననుపాతినీ ।
ప్రోక్తా సమాధిశబ్దేన, మేరోః స్థిరతరాస్థితిః ॥

సంక్షోభరహితంబును, అహంకార నిర్ముక్తంబును, ద్వంద్వ దోషవర్జితంబును, మేరువుకంటె నతిస్థిరంబగు నిలుకడ సమాధి శబ్ధముచే చెప్పబడుచున్నది.

6. శ్లో॥ నిశ్చింతా విగతాభీష్టా, హేయోపాదేయ వర్జితా ।
ప్రోక్తా సమాధి శబ్దేన, పరిపూర్ణా మనోగతిః ॥

చింతారహితంబును, వాంఛావిముక్తంబును, హేయోపాదేయ వర్జితంబును, పరిపూర్ణంబును నగు మనోగతి సమాధి శబ్దముచే చెప్పబడు చున్నది.

7. శ్లో॥ నిర్వికారతయా వృత్త్యా, బ్రహ్మాకారతయా పునః ।
వృత్తి విస్మరణం సమ్యక్, సమాధిర్జ్ఞాన సంజ్ఞకః ॥

నిర్వికారతత్త్వ వృత్తిచేత బ్రహ్మాకారత్త్వము నొందగా, మరల ద్వైతాను సంధానము లేకుండుటయే జ్ఞానమనెడి సమాధి. ఇదియే జీవేశ్వరైక్య జ్ఞానసమాధి యనబడును.



# మోక్ష స్వరూపము

1. శ్లో॥ బుద్ధిపూర్వం విచార్యేదం, యథావస్త్వవలోకనాత్ ।
సత్తా సామాన్యబోధోయ, స్సమోక్షశ్చే దనన్తకః ॥

ఈ జగమును శ్రుతియుక్త్యనుభవములచేత నాలోచించి పరమార్ధమును నిశ్చయించుటవలన బుద్ధిపూర్వకముగా సత్తామాత్రమునందు పర్యవసానమొందిన బోధము కలిగెనేని అయ్యది పునరావృత్తి రహితమగు మోక్షమగుచున్నది.

2. శ్లో॥ పరిజ్ఞాయ పరిత్యాగో, వాసనానాం య ఉత్తమః ।
సత్తా సామాన్య రూపత్త్వం, తత్కైవల్యపదం విదుః॥

ఆత్మతత్త్వమును విచారించి సంసార హేతువులగు వాసనలను విడిచినయేచైతన్యముగలదో అయ్యది సర్వోపాధి విముక్తమైనది కావున కైవల్యరూపముగా నెరుగుచున్నారు.

3. శ్లో॥ విచార్యార్యైస్సహాలోక్య, శాస్త్రాణ్యధ్యాత్మ భావనాత్ ।
సత్తా సామాన్య నిష్ఠత్వం, యత్తద్బ్రహ్మ పరంవిదుః ॥

అధ్యాత్మ శాస్త్రములను గురుముఖంబునం జదివి బ్రహ్మవిదులతో గలసి విచారించి ఆత్మతత్త్వమును చిత్తమునందనుసన్ధానము చేయుటవలన సత్తామాత్రరూపంబున నునికి యేదిగలదో అదియే పరబ్రహ్మమునుగా నెరుంగుదురు.

4. శ్లో॥ నిర్దగ్ధ వాసనాబీజ స్సత్తా సామాన్యరూపవాన్ ।
సదేహోవా విదేహోవా నభూయోదుఃఖ భాగ్భవేత్ ॥

దహింపబడిన వాసనయు, వాసనాబీజంబగు నజ్ఞానంబును లేనివాడు, సత్తా సామాన్యనిష్ఠుండు గావున సత్తా సామాన్యరూపుండును నగు పురుషుడు దేహసహితుండుగాని, దేహరహితుండుగాని మరల దుఃఖమును పొందనేరడు.

అభ్యాసము

శ్లో॥ తచ్చింతనం తత్కథన మన్యోన్యం తత్ప్రబోధనమ్ ।
ఏతదేక పరత్వంచ, తదభ్యాసం విదుర్బుధాః ॥

వాశి. పే. 672

శ్లో॥ సంవేద్యవర్జిత మనుత్తమ మాద్యమేకం,
సంవిత్పరం వికలనం కలయన్మహాత్మన్ ।
హృద్యేవతిష్ఠ కలనారహితః క్రియాంతం,
కుర్వన్నకర్తృ పదమేత్య శమోదితశ్రీః ॥

అనగా :— రామచంద్రా : వాసనారహితంబును, ఆద్యంబును, నిర్వికల్పంబును, నిర్వికారంబునగు బ్రహ్మపదంబును బొంది, చిత్తము యొక్క బాహ్యోన్ముఖత్వమును నిరోధించి హృద్గోచరంబగు బ్రహ్మము నందే యుండుము. సమాధినుండి లేచినపుడు యథోచితములగు క్రియలను చేయుచు శాంతిచేత నుదయించిన జీవన్ముక్త గుణసంపదగలవాడవై అకర్తృపదమును పొంది యుండుము.

శ్లో॥ విచారోఽధ్యాత్మ విద్యానాం, జ్ఞానమంగవిదుర్బుధాః ।
జ్ఞేయం తస్యాంతరేవాస్తి, మాధుర్యం పయసోయథా ॥

పండితులు అధ్యాత్మశాస్త్రముల యొక్క విచారమే జ్ఞానమని చెప్పిరి. పాలయందు మాధుర్యముండునటుల, నా జ్ఞానంబులోననే జ్ఞేయంబు గలదు.

శ్లో॥ సమం స్వరూపమమలం, జ్ఞేయం బ్రహ్మపరం విదుః ।
జ్ఞానాభిగమ మాత్రేణ, తత్స్వయంచ ప్రసీదతి ॥

సమంబును, నిర్మలంబునగు నాత్మస్వరూపమునే, జ్ఞేయమగు పరబ్రహ్మంబునుగ జెప్పిరి. ఆత్మజ్ఞాన సంప్రాప్తిమాత్రముచే తనంతట తనే అవిద్యా, తత్కార్యాది రహితమగుచున్నది.

శ్లో॥ మనాగపి విచారేణ చేతసః స్వస్యనిగ్రహః ।
మనాగపికృతో యేన, తేనాప్తం జన్మనః పలమ్ ॥

ఎవడు కొంచెము ఆత్మవిచారముచేనైనను తన చిత్తమును కొంచమైనను నిగ్రహించగలుగునో వాడు జన్మఫలమును బొందినా వాడగును (లేనిచో జన్మ వ్యర్ధమని తాత్పర్యము)

శ్లో॥ సంసారాచ్చ సముద్ధృతాః స్వపితర,
స్త్రైలోక్య పూజ్యోఽప్యసౌ ।
యస్యబ్రహ్మ విచారణేక్షణమపి,
స్థైర్యం మనః ప్రాప్నుయాత్ ॥

ఓ భరద్వాజమునీ? ఎవ్వని చిత్తము బ్రహ్మవిచారమునందు క్షణమునేపైనను స్థైర్యమునొందునో, వాడు సమస్త తీర్థములయందు స్నానము చేసినవాడును, సమస్త భూమిని దానము చేసినవాడును, సహస్ర యజ్ఞములు చేసినవాడును, సకల దేవతల బూజించినవాడును నగును. వాని పితరులు సంసారమునుండి యుద్ధరింపబడుదురు. వాడు ముల్లోకములయందును పూజ్యుండునగుచున్నాడు.

# పరమార్థ బోధ

[ వాశి. నిర్వాణ ప్రకరణము ]

1. శ్లో॥ యథాస్థితం శామ్యతీదం, సమ్యగ్జ్ఞానవతో జగత్ ।
స్వప్నే స్వప్నపరిజ్ఞాతుర్యథా దృష్టార్థ సంభ్రమః ॥

స్వప్నము బొందినవానికి మేలుకొనిన తదుపరి ఆ స్వప్నమున గాంచబడిన పదార్థ సంభ్రమము శమించునట్లు, సమ్యక్-జ్ఞానము గల వానికి ఈ జగత్తు యథారీతి ఉన్నప్పటికిని శమించియే పోవును.

2. శ్లో॥ నాహంతరఙ్గః సలిలమహ మిత్యేవయుక్తితః ।
బుద్ధంయేన తరఙ్గేన కుతస్తస్య తరఙ్గతా ॥

"నేను తరఙ్గమునుగాను, జలమునే" అని యీ ప్రకారముగ యుక్తులచే ఏతరఙ్గమెరిగినదో, ఇక నద్దానికి తరఙ్గత్వమెచట? (అట్లే నేను దేహాది పరిచ్ఛిన్న రూపుడనుగాను, సద్రూప ఆత్మనే, యని యుక్తులచే, విచారణచే ఏ జీవు డెరుగునో, ఇక నాతనికి జీవత్త్వ మెచట? శివత్త్వమే అతనికి శేషించుచున్నదని భావము)

3. శ్లో॥ యేనాఙ్గదత్వం నాస్తీతి బుద్ధం హేమాఙ్గదేనవై ।
అఙ్గదత్వం కుతస్తస్య తస్యశుద్ధైవ హేమతా ॥

అట్లే ఏ సువర్ణ ఆభరణము, 'నాకు ఆభరణత్వము లేదు' అని ఎరిగినదో, అద్దానికిక ఆభరణత్వ మెచట? దానికి శుద్ధమగు సువర్ణ త్వమే కలిగియుండు చున్నది.

4. శ్లో॥ జాగ్రతి స్వప్ననగరం యాదృక్తా దృగిదంజగత్ ।
పరిజ్ఞాతం భవేదత్ర కథమాస్థా వివేకినః ॥

జాగ్రత్తునందు స్వప్ననగర మెట్లుండునో, జ్ఞానము కలిగిన మీదట ఈ జగత్తున్ను అట్లుండును. అత్తరి ఇక వివేకవంతునకు అద్దాని యందు, (అట్టి మిథ్యావస్తువునందు) ఆసక్తి ఎట్లు కలుగును.

5. శ్లో॥ తస్మాత్సమ్య క్పరిజ్ఞానా ద్భ్రాంతిమాత్రం వివేకినః ।
సర్గాత్యన్తా సంభవతో యోజీవన్ముక్తతోదయః ।
నిర్వికల్పం సమాధానం తదనన్త మిహోచ్యతే ॥

కాబట్టి సమ్యక్-జ్ఞానమువలన ఈ జగత్తు భ్రాంతి మాత్రమని యెరుగుటచే సృష్టియొక్క అత్యంతాభావమువలన వివేకవంతునకు ఉద యించునట్టి జీవన్ముక్తత్వ మేదిగలదో అదియే నిర్వికల్ప సమాధి అనియు, అనన్త నిర్వాణమనియు చెప్పబడినది.

6. శ్లో॥ యథాస్థిత మవిక్షుబ్ధ మాసనం సర్వభాసనమ్ ।
తదనన్త సుషుప్తాఖ్యం తత్తురీయ మితిస్మృతమ్ ।
తన్నిర్వాణ మితిప్రోక్తం తన్మోక్ష ఇతి శబ్దితమ్ ॥

యథాస్థితమై, సర్వప్రకాశమైనట్టి ఆత్మయందు ఏ దృశ్యాసక్తత యును లేక నిశ్చలముగ స్థితిగలిగియుండుట యేదిగలదో, అదియే అనన్త సుషుప్తియనియు, తురీయమనియు, నిర్వాణమనియు, మోక్ష మనియు, పేర్కొనబడినది.

7. శ్లో॥ సమ్యగ్బోధైక ఘనతాయాఽసౌ ధ్యానమితి స్మృతమ్ ।
దృశ్యాత్యన్తా సంభవాత్మా బోధమాహుః పరంపరమ్ ॥

సమ్యక్-బోధ (ఆత్మ జ్ఞానము) దృఢముగ గలిగియుండుటయే ధ్యానమని చెప్పబడినది. మరియు దృశ్యముయొక్క అత్యంతా భావ రూపమైన బోధయే పరమపదమని వచింపబడినది.

8. శ్లో॥ అత్యన్తా సంభవం దృశ్యం యద్వైనిర్వాణ మాస్థితమ్।
శుద్ధబోధోదయం శాన్తం తద్విద్ధి పరమం పదమ్ ॥

ఓ రామచంద్రా! దృశ్యమేమియులేక, సర్వ విక్షేపరహితమగు ఆత్మరూపముతో స్థితిగలిగియుండుట యేదిగలదో అట్టి శుద్ధబోధోదయ ప్రశాంతరూపమే పరమపదమని (మోక్షమని) యెరుగుము.

9. శ్లో॥ సచసంప్రాప్యతే శుద్ధోబోధో ధ్యానమనుత్తమమ్।
శాస్త్రాత్పద పదార్ధజ్ఞ బోధితోత్పన్న బుద్ధినా ॥

అట్టి శుద్ధ బోధరూపమగు ఉత్తమధ్యానము పదపదార్ధములను బోధించునట్టి అధ్యాత్మశాస్త్రమువలన ఉత్పన్నమగు వివేకబుద్ధిచే సంప్రాప్తించును.

10. శ్లో॥ నతీర్థేననదానేన నస్నానేన నవిద్యయా।
నధ్యానేన నయోగేన నతపోభిర్న చాధ్వరైః ॥

ఆత్మ స్వరూపమందలి స్థితియను ఈ మోక్షము తీర్థములచేగాని, దానములచేగాని, స్నానములచేగాని, పాండిత్యములచేగాని బ్రహ్మధ్యాన భిన్నములగు ఇతర ధ్యానములచేగాని, ఇతర యోగములచేగాని, తపములచేగాని, యజ్ఞముచేగాని (సాక్షాత్తుగ) పొందబడదు.

"తస్మాదస్మాన్మహా శాస్త్రాద్యథాశక్తి విచారయేత్"

కాబట్టి ఈ మహాశాస్త్రమును, యథాశక్తి విచారణ చేయవలయును.

11. శ్లో॥ అనర్ధేనా విచారేణవయః కుర్వాన్న భస్మసాత్।
బోధేన జ్ఞానసారేణ దృశ్యం కర్తవ్య మాత్మసాత్ ॥

అనర్థదాయకమగు అవిచారణచే ఆయువును వ్యర్థముగ బూడిద పాలు చేయరాదు, శ్రవణమననాదులచే లభించు జ్ఞానసారమగు తత్త్వబోధచే ఈ దృశ్యమునంతను ఆత్మరూపముగ నొనర్చివేయవలయును.

—X—

# ఆత్మజ్ఞానికి అపూర్వసిద్ధులుండవలెనను నియమము లేదు

శ్లో॥ ఏవంస్థితేహి భగవన్, జీవన్ముక్తస్య సన్మతేః ।
అపూర్వోఽతిశయః కోఽసౌభవత్యాత్మ విదాంపర ॥

ఓ మునీంద్రా ! ఇదివరకు జీవన్ముక్తున కాకాశగమనము లేదని చెప్పితివి ఇటులనగునేని జీవన్ముక్తునకు నపూర్వమగు నతిశయమేది గలదో చెప్పుము.

శ్లో॥ జ్ఞస్యకస్మింశ్చిదేవాంగ, భవత్యతిశయే నధీః ।
నిత్యతృప్తః ప్రశాంతాత్మా, స ఆత్మన్యేవ తిష్ఠతి ॥

జ్ఞానియొక్క చిత్తము ఒకానొక యతిశయమందును వర్తింపదు. ఆ జ్ఞాని యెపుడును తృప్తినొందినవాడును, శాన్తచిత్తుండునునై యాత్మయందె యుండుచున్నాడు

శ్లో॥ మంత్రసిద్ధైస్తపస్సిద్ధై స్తంత్రసిద్ధైశ్చ భూరిశః ।
కృతమాకాశయానాది కాతత్రస్యాదపూర్వతా ॥

మంత్రసిద్ధులు, తపస్సిద్ధులు, తంత్రసిద్ధులును మొదలగువారిచేత నాకాశగమనము చేయబడుచున్నది. అందేమి యపూర్వత్వంబు గలదు. (అనగా నాకాశగమనము పక్ష్యాదులయందుండుటను, జీవభావమును నివర్తింపకుండుటను నందు అపూర్వమగు నతిశయమేమియు లేదనుట)

శ్లో॥ అణిమాద్యపి సంప్రాప్తం, తాదృశై రేవ భూరిశః ।
యత్నేనసాధి తత్త్వాత్తైర్నేతరేణాత్మ దర్శినా ॥

మంత్రాది సిద్ధినొందినవారలు యత్నముచే సాధించుచున్నారు గావునను, ఆత్మజ్ఞాని ప్రయత్నముచే సాధింపడుగావునను, అణిమాద్యష్టైశ్వర్యంబులును మంత్రాది సిద్ధులచేతనే పొందబడుచున్నవిగాని, యాత్మజ్ఞానిచే పొందబడవు.

శ్లో॥ ఏషఏవ విశేషోఽస్య నసమో మూఢబుద్ధిభిః ।
సర్వత్రా స్థాపరిత్యాగా న్నీరాగమమలం మనః ॥

మనస్సు అంతటను నాసక్తి నిలుచుటవలన రాగరహితమై నిర్మలముగా నుండుట యేదిగలదో యిదియే మూఢచిత్తులయందు లేనట్టి జ్ఞానియొక్క విశేషము.

శ్లో॥ ఏతావదేవఖలు లింగమ లింగమూర్తేః,
సంశాంత సంసృతి చిరభ్రమ నిర్వృతస్య ।
తద్జ్ఞస్య యన్మదన కోపవిషాద మోహ,
లోభాపదామనుదినం నిపుణంత నుత్వమ్ ॥

వర్ణాశ్రమాది చిహ్నములు లేనివాడును, సంసారరూపమగు చిరకాలాగత భ్రాంతి శాంతించినది గావుననే నిశ్చింతుండై యున్నవాడునునగు జ్ఞానికి కామక్రోధాది నిమిత్తములగు సకలాపదలును క్షయమొందుటయే విశేషమగుచున్నది.



# అనాదిభ్రాంత్యనుభూతి–రెండు విధములు

అద్వైత సిద్ధాన్తమందు– భ్రాంతులు రెండు విధములు. అవి యెట్టివి యనిన :– 1. సోపాధిక భ్రాంతి, 2. నిరుపాధిక భ్రాంతి.

1. సోపాధిక భ్రాంతికి యుదాహరణము– ఉపాధియగు దర్పణము వంటి అంతఃకరణము, అందు కనబడు ప్రతిబింబము.

2. నిరుపాధిక భ్రాంతికి యుదాహరణము–శుక్తి రజతము, రజ్జు సర్పము, ఇత్యాదికము. ఈ భ్రాంతి జీవసామాన్యమునకంతను, అనగా మనుష్య జనసామాన్యమున కంతయు యుండును. జనసామాన్యము అనాది అజ్ఞాన కోటిలోనిది గనుక వారికి– పరమాత్మయగు సాక్షిజగత్తులు ఏకముగ నొక్క– ఉపాధిగనే భాసించుచుండును. ఇందు మూలముగ సంసార సుఖదుఃఖమును స్వాభావికముగ పొందుచుందురు.

ఇక రెండవ భ్రాంతి తత్త్వజ్ఞానమును సంపాదించి– ప్రారబ్ధము నశించనట్టి ముముక్షువులకు భాసించుచుండును. వీరే ప్రారబ్ధ తారతమ్యమునుబట్టి జీవన్ముక్తులుగ వ్యవహరింపబడువారు. ముముక్షువు తత్త్వజ్ఞానము నొందినను ప్రారబ్ధము వెంటనే నశించదు మరేమనిన ప్రారబ్ధము పూర్తిగ క్షయించిన వెనుకనే నశించును గాని యీ లోపుగ తరతమ భావముతోడ క్షీణించి– తత్త్వజ్ఞానికి ప్రారబ్ధము అనుభూతియగుచునే యుండును. "ప్రారబ్ధం భోగతో నశ్యేత్" అను వచనమునుబట్టి ప్రారబ్ధము పూర్తిగ భోగమువలనగాని నశించదు. ఏలనన, ప్రారబ్ధము– తత్త్వజ్ఞానము అనునవి భిన్న విషయములు కావున తత్త్వజ్ఞానము– ప్రారబ్ధమును నశింపచేయ జాలదు. తత్త్వజ్ఞానానుభవమును బాగుగనొంది వారి వారి ప్రారబ్ధమును క్షీణ, సక్త

తాభిమానములతోడ భోగము నొందుచుండువారే "జీవన్ముక్తులు". ఇట్టి వారిని శాస్త్రమే, బ్రహ్మవిత్, బ్రహ్మవిద్వరః, బ్రహ్మవిద్వర్యః, బ్రహ్మవిద్వరిష్ఠః, అను తరతమ భేదములతోడ తెలుపుచున్నది. విద్వాంసులిచట గ్రహించవలసిన రహస్యమేమియనిన, జీవన్ముక్తులలో, యీ తరతమ భావమును, వారి వారికి యుండు ప్రారబ్ధ న్యూనాధిక్యతలను బట్టి, విభాగముగ శాస్త్రము తెలుపుచున్నదియేగాని, ఆత్మజ్ఞానము కలుగగనే ముక్తి కలుగును. ఈ ముక్తి యీ పైవారి కందరకును సమమే. "జ్ఞాన సమకాలఏవ ముక్తిః" అను వచనము తెలుపుచున్నది. ఆత్మజ్ఞానులందరకును ముక్తిసమము, ఏకరూపము, అయినను, వారి వారి ప్రారబ్ధ బలాబలములను బట్టి జీవన్ముక్తులయందు తరతమ భావము తెలుపబడినది. ఈ తరతమ భావమంతయు యోగ వాశిష్ఠాది గ్రంధములయందు సప్తజ్ఞాన భూమికల నిరూపణ పూర్వకముగ విపులముగ తెలుపబడియున్నది.



# స్వాత్మాభిన్న-చిదాకాశాను సన్ధానము

చిదాకాశమన్నను బ్రహ్మయన్నను నొక్కటియే. "యదేవ తచ్చి దాకాశం, తదేవ మననం స్మృతమ్" అని వశిష్ఠ వచనము తెలుపు చున్నది.

బ్రహ్మయన్నను, పరమాత్మయన్నను నొక్కటియే. ఇదియే సత్యజ్ఞానానన్తము, అఖండ సచ్చిదానన్ద స్వరూపము. ఇది నిత్యము. స్వాత్మాభిన్నము. జీవునియొక్క వాస్తవస్వరూపము. శాస్త్రము ముముక్షువునకు, తన పరమార్థ వాస్తవస్వరూపమగునట్టి, నిత్య నిర్వికార అఖండ పరిపూర్ణ సచ్చిదానన్ద లక్షణములను మరువ కయే ప్రారబ్ధ క్షయముకొరకు, తన సర్వవ్యవహారములను నిర్లిప్తత తోడ నాచరించు చుండవలయునని శాస్త్రము బోధించుచున్నది. ప్రారబ్ధము అనిత్యము, నశించునట్టిది. జీవుని పరమార్థ స్వరూపము, నిత్యము, అవినాశి, పరమానన్ద స్వరూపము, సర్వాధిష్ఠానము. దీనిని స్వాత్మాభిన్నముగ నొందుటయే మోక్షము. ముముక్షువు వృత్తిని బ్రహ్మా కారా కారితముగ జేసి అనగా బ్రహ్మాత్మనా సంస్థితుడై, సర్వదా దానిని స్వాత్మాభిన్నముగ, అఖండ నిర్మలాకాశమువలె పరిపూర్ణ చిద్భావనను జేయుచుండుటయే చిదాకాశ భావన. ఇది పరమాత్మ సాక్షాత్కారమున కును, బ్రహ్మానుభూతికిని, సాక్షాత్సాధనము. ఈ సాధనము నభ్యసిం చుట యనునది, సశాస్త్రీయముగ, సద్గురు ముఖమున గావించిన, శాస్త్ర శ్రవణానన్తరము (అనగా మహావాక్యార్థమును బాగుగ విని) భాగత్యాగ లక్షణముచే, అహం, ఇదముల, విచారమును బాగుగ గావించి స్వస్వరూపమందు ప్రీతి నిశ్చయములనొంది, నిరన్తర బ్రహ్మాభ్యాసము గావించు వారలకే సుసాధ్యముగ నుండును. కావున వీరికైనను బ్రహ్మ

భావమును వారి వ్యవహార సమయమందు నిలుపుట కష్టసాధ్యముగ నుండును. ఏలనన అట్టి మహనీయులకు గూడ, విక్షేపము ప్రారబ్ధాను సరణమున గలుగుచునే యుండును వివేకులు దీనిని జ్ఞానబలముచే లక్ష్యముజేయక ననుభవింతురు. కాని యిట్టి స్థితినిగూడ నిర్బాధకముగ ననుభవించుటకు నొక యుపాయముగ నీ క్రింది వివేచనను అనుభవ పూర్వకముగ సాధకుల నుద్దేశించి నిరూపించుచున్నాడను.

ఈ అభ్యాసకుడు మహావాక్యబోధను బాగుగ గ్రహించి, స్వ స్వరూప నిశ్చయమును నొందినవాడు గావున, అట్టి స్థితిని అనగా స్వరూపమును స్వానుభవము నొందుటకు అనగా స్వస్వరూపసిద్ధి నొంద ప్రయత్నించువాడు. ఇట్టి ప్రయత్నమే స్వాత్మాభిన్న చిదాకాశ భావన ఈ భావనే కాలక్రమమున సిద్ధినిచ్చునని "భావనాదార్ఢ్యాత్ సిద్ధిః" అను పాతంజల సూత్రము తెలుపుచున్నది. పరమార్థమున "ఆత్మ" "బ్రహ్మ" లకభేదమనియు, యీ రెండు శబ్దములును ఒక్కటియగు సత్పదార్థమునకే పర్యాయపదములనియు, స్పష్టమైనది. ఆత్మ యనగా, "అహం" నేను జీవునియొక్క వాస్తవస్వరూపము. ఇది అవినాశి, నిత్యము, దీని నాశనమును యెవరు తెలిసికొనుట లేదు. ఇది యొక్కటియే స్వప్రకాశము. తక్కిన సర్వమును దీనిచే బ్రకాశింపజేయబడునదియే కాని, స్వప్రకాశము కాజాలదు. ఈ విషయమునే "తస్యభాసా సర్వమిదం విభాతి" అను శ్రుతి స్పష్టము చేయుచున్నది.

ఈ యన, జ్ఞానభాస్కరుడు. సర్వదా సర్వ వ్యాపకుడై, సర్వాధిష్ఠానమై, స్వప్రకాశముతోడ పరిపూర్ణముగ సర్వోపాధులను ప్రకాశింపజేయుచు, సర్వాత్మకుడై, సర్వధీసాక్షిభూతుడుగ, సర్వజీవుల హృదయ పుండరీకములందునను సత్యజ్ఞానానన్తరూపుడై, అఖండ సచ్చిదానన్దుడుగ బ్రకాశించుచుండును. ప్రకాశమనగా ముఖ్యార్థము జ్ఞానమనియే. తేజః ప్రకాశములు జ్ఞానమునకు ఉపలక్షణము. సృష్టియందు దివారాత్రము

లతో నెట్టిసంబంధమునులేక తాను స్వయముగా సర్వదా ప్రకాశించు చుండునట్టి లోకభాస్కరుడే, చిద్భాస్కరునకు ఉదాహరణము ఈ లక్షణమేమనిన దేనితోడను సంబంధపడక సర్వమును సర్వదా తనస్థితి మాత్రముననే ప్రకాశింపజేయుచుండుట. అసంగత్వ, పరిపూర్ణత్వము లకు మాత్రము, మహాకాశమే-చిదాకాశమునకు ఉదాహరణము అవస్థా త్రయ స్వకాల సత్యత్వానుభూతినిచ్చుచు అవస్థాంతమున అనగా కాలాం తరమున, నశించునట్టి వ్యవహార అనుభవములకు - సర్వానుభవములో యున్న స్వప్న, అనుభవములే దృష్టాంతము. దీనిననుసరించియే జీవు నకు ప్రపంచ వ్యవహార మంతయు స్వప్నము, స్వప్నశరీరము, స్వప్న పదార్థములు, స్వప్నానుభూతిలాగున అనిత్యము అవాస్తవమనియు, కాని స్వప్నానుభవములకంటె, వ్యవహారానుభవములు, మరికొంత దీర్ఘ కాలానుభవమును మాత్రమిచ్చి నశించుననియు శాస్త్రము బోధించు చున్నది—

ఇట్టి ఉదాహరణ, ఉపాయములను అనగా సాధనములను శ్రీ వశిష్ఠ, శంకరభగవత్పాదులు బహువిధముల బోధించుచున్నారు. అట్టి వాక్యములు కొన్నిటి నుదాహరించుచున్నాడను :—

శ్లో॥ నాహందుఃఖీనమేదేహః, బంధఃకః స్వాత్మనిస్థితః ।
ఇతిభావానురూపేణ, వ్యవహారేణముచ్యతే ॥

శ్లో॥ ఏకదేశస్థితాత్పుంసో, దూరాయాతస్యచేతసః ।
యద్రూపంసకలంమధ్యే, తద్రూపంపరమాత్మనః ॥

శ్లో॥ పరార్ధ జాతంశైలాది, యథాస్వప్నేపురాదిచ ।
చిదేవైకం పరంవ్యోమ, తథా జాగ్రత్ పదార్థభూః ॥

శ్లో॥ చిత్స్వభావోయథాస్వప్నే, అస్త్రేసర్గ ఇవేహయః ।
అసర్గేసర్గ వద్భాతి. తథాపూర్వం మహాంబరే ॥

శ్లో॥ యథాస్వప్నపురంజన్తో, శ్చిన్మాత్రప్రవిజృమ్భితమ్ ।
తథైవ సర్గః సర్గాదౌ, శుద్ధ చిన్మాత్రజృమ్భితమ్ ॥

శ్లో॥ భావ్య భావక భావాది, భూమీనాంభావనంభృశమ్ ।
సర్వంచిన్నభ ఏవాచ్ఛ, మాత్మనాత్మని సంస్థితమ్ ॥

శ్లో॥ ఏ వంస్థితేకుతః సర్గః, కుతోవిద్యాక్వచాజ్ఞతా ।
బ్రహ్మశాన్తం ఘనంసర్వం, క్వాహంకారా దయఃస్థితాః॥

శ్లో॥ జాగ్రత్స్వ ప్నసుషుప్త్యాది, ప్రపంచంయత్ప్రకాశతే ।
తద్బ్రహ్మహమితి జ్ఞాత్వా, సర్వబంధైఃప్రముచ్యతే ॥

శ్లో॥ ఏకంబ్రహ్మ చిదాకాశ, మద్వితీయ మఖండితమ్ ।
స్వాత్మాభిన్నం స్వప్రకాశం, తద్బ్రహ్మాస్మిపరంపదమ్॥

శ్లో॥ చిదాకాశస్వరూపోహం, జ్ఞానమాత్ర స్వరూపతః ।
అఖండపరిపూర్ణోహం, సచ్చిదానన్ద లక్షణః ॥

శ్లో॥ అఖండా నన్దరూపోహం, పరమాత్మాహమచ్యుతః ।
నిత్యస్సర్వ గతః స్థాణు, రచలోయం సనాతనః ॥

శ్లో॥ అహంసర్వమిదం విశ్వం, పరమాత్మాహమచ్యుతః।
అఖండ పరిపూర్ణోహం, పరిపూర్ణ మి వామ్బరమ్ ॥

ఈ విద్వాంసుడు, "సదేవసౌమ్యే దమగ్ర ఆసీత్ ఏకమే వాద్వితీయం" "నేహనానాస్తికించన" "అతోన్యదార్తమ్" "బ్రహ్మైవేదం సర్వమిదం వరిష్ఠమ్" "తత్త్వమసి" "అయమాత్మాబ్రహ్మ" "జీవో బ్రహ్మైవనాపరః॥, అనువాక్య ప్రమాణమును బాగుగ గ్రహించి నిశ్చయము నొందినవాడు గావున, పై వాక్యముల నాధారముగ తీసికొని, వాక్య ప్రమాణముతోడ నీక్రింది విధమున వివేచనగావించి స్వాను

భవమును సరిచూచుకొనిన యడల బ్రహ్మాభ్యాసాది పాటవమునకు అత్యంతముగ సహాకరించును. ఎట్లన వాక్యప్రమాణమునుబట్టి వాస్తవమున జీవుడు బ్రహ్మాభిన్నుడు బ్రహ్మయనగా, సర్వాధిష్ఠాన, నిత్య, నిర్వికార, స్వప్రకాశ, అఖండ, పరిపూర్ణ చైతన్యుడు. ఇదినిర్మల మహాకాశమువంటి అద్వితీయ అఖండ స్వాత్మాభిన్న పరిపూర్ణ చిదాకాశస్వరూపము. ఇదియేబ్రహ్మ, ఆత్మ. ముముక్షువు దీనిని బాగుగ గ్రహించి తననిత్య నిరతిశయానన్దస్వరూపమును స్వాత్మాభిన్నముగ నొందవలసినవాడు, ఆత్మకాముడు, మోక్షార్థి. కావున యీ అభ్యాసకుడు తన ప్రారబ్ధానుసరణమున యెట్టి, యెంతటి సుఖ దుఃఖ భోగముల నొందుచున్నను, యివియన్నియు కల్పితమైనట్టి తన యుపాధిధర్మములే కాని వాస్తవమున తనకు సంబంధించినవిగావను నిశ్చయము నొందవలయును. తాను వాస్తవమున అపరిచ్ఛిన్న, సర్వాధిష్ఠాన అఖండ సంవిద్రూపుడు, చిదాకాశరూపుడు, నిరవయవి, అకర్త, అభోక్త, యని బాగుగ నిశ్చయము నొందిన మహానీయుని పరిచ్ఛిన్నస్వభావములగు ఉపాధిధర్మములు తీవ్రముగ బాధింపవు. ప్రారబ్ధాను సరణమున సుఖ దుఃఖానుభవములు క్షీణించి కలుగుచుండును. ఆత్మానుసన్ధానాది అభ్యాస పాటవముచే కాల క్రమమున స్వశరీరసర్వ వ్యవహారానుభవములును, సర్వదృశ్యమును, అవాస్తవమనితోచుచు ఆభాసమాత్రముగ నుండును. అప్పుడు పరమాత్మ స్వరూపుడగు తనయందే యీ జగద్వ్యవహారమంతయు స్వప్నానుభవములలాగున గల్పితమైనదనియు, అనిత్యమనియు, అవాస్తవమైనదనియు, తానుమాత్రమే నిత్యుడనియు, యథార్థమనియు గోచరించును.

ఎట్లన, నిద్రయను అజ్ఞానకాలములో అజ్ఞానదోషము వలన తనకు స్వప్నము కలుగుచు తనస్వప్నస్థితియందే తనయొక్క స్వాప్నిక దేహము ఉత్పత్తియగుచు, తనచే ననుభవింపబడుచు, ఆకాశ భూమండలాది సర్వప్రపంచముగూడ అల్పమగు స్వప్నకాలమందే

ఉత్పత్తియై స్వాప్నిక జీవుడు జాగ్రద్దశయందువలెనే సర్వ వ్యవహారానుభవములను స్వకాలసత్యత్వము తోడ ననుభవించు చున్నాడు గదా? ఇట్టి అనుభవమంతయు తన స్వప్నావస్థమారి జాగ్రదవస్థకు వచ్చినవెంటనే తనస్వాప్నిక దేహమును, తన స్వప్న సర్వ దృశ్య భోగానుభవములన్నియు, అవాస్తవమనియు, తనకు కలిగిన స్వప్నానుభవమంతయు కల్పితమని నిశ్చయము నొందుచున్నాడు. అట్లే యీ అభ్యాసకుడు తన పరమార్థ వాస్తవస్వరూపమును గ్రహించిన వాడు గావున, యిపుడు తనకు కలిగిన ఉపాధి, ఉపాధి ధర్మములగు సుఖ దుఃఖ భోగానుభవములన్నియు, తనకు అనాది అజ్ఞానకల్పితములనియు, కల్పితములైనను తన ప్రారబ్ధము భోగమువలనగాని నశించదని నిశ్చయము నొంది, జగన్మిధ్యాత్వ దార్ఢ్యమువలనను తన స్వస్వరూపగ్రహణ మందు ప్రీతినిశ్చయముల వలనను తనసర్వ సుఖదుఃఖ భోగానుభవము లెంతటివైనను రాగద్వేషరహితముగ నిర్లిప్తతతోడ ననుభవించుచు తన పరమార్థస్వరూపమును మరువక సర్వదా తనస్వరూపానుభవము నిట్లు పొందుచుండవలయును, లేక భావించుచుండవలయును.

నేను నిర్మలమహాకాశమువంటి చిదాకాశస్వరూపుడను. నిత్య నిర్వికార అఖండపరిపూర్ణ చిద్ఘనానన్దరూపుడను. నేనే సర్వాధిష్ఠానము నేను కేవల జ్ఞానస్వరూపుడను. అసంగుడను. పరిపూర్ణుడను. నేను బాహ్యాంతరములయందు పరిపూర్ణముగ నిండి నిత్యముగయున్నవాడను. నిర్వికారుడను. స్వప్రకాశరూపుడను. ఇట్టినాయందే నేను పరిచ్ఛిన్న భ్రాంతితోడనున్నాను. అనగా పరిపూర్ణుడనైన నేను నాయందే ఉపాధి కల్పితుడనై యున్నాను, ఇదిభ్రాంతి. నాకీ ఉపాధికల్పితము. అనిత్యము. అయినను ఇదియే నామోక్షప్రాప్తికి సాధనము. నాస్వస్వరూప సాక్షాత్కారా నన్తరము యివియున్నను పోయినను నొక్కటియే. దీపముండగనే జాగ్రతపడవలసిన యట్లు యీ యుపాధియుండగనే నాముక్తిని బడయవలయును. అను ప్రీతి నిశ్చయము ముముక్షు బ్రహ్మాభ్యాసము

నకు అత్యంతము సహకరించును. ఈ దృశ్య దృశ్యానుభవములన్నియు నాయందే కల్పితములై జీవులకు ప్రారబ్ధఫలానుభోగములనిచ్చుచున్నవి ఇదియంతయు దీర్ఘస్వప్నమువంటిది. అహంమమేదములు అవిద్యా కల్పితములు, భ్రాంతిమాత్రములు. నేనోవాస్తవమున అపరిచ్ఛిన్న అఖండ చిద్ఘనానన్ద రూపుడను. నిత్యుడను. నిరవయవుడను కాననిష్క్రియుడను. కర్తృత్వ భోక్తృత్వాది రహితుడను. ఈ సుఖదుఃఖ, క్షుత్పిపాస, జనన మరణ ధర్మములన్నియు ప్రారబ్ధము ననుసరించిన నా ఉపాధిధర్మములేకాని నాకువాస్తవమున సంబంధించినవిగావు అయినను, నాకు అభ్యాసానుభవము నిచ్చుచున్నవి. ఇవి యన్నియు ప్రారబ్ధాంతము వరకే భాసించుచుండునుగాని తదుపరియుండజాలవు. నేను నానిజస్వరూపమగు అఖండ సచ్చిదానన్ద లక్షణమును, సర్వాధిష్ఠాన స్వరూపమును నే నగుదును. సందియములేదు. అని విద్వాంసుడు సర్వదా చిదాకాశస్వరూపమగు స్వస్వరూప భావనను ప్రారబ్ధాంతమువరకునిలుపుకొనుట యావశ్యకము.

వివే, శ్లో, 379.

శ్లో॥ లక్ష్యేబ్రహ్మణి మానసందృఢతరం, సంస్థాప్య బాహ్యేన్ద్రియమ్ ।
స్వస్థానేవినివేశ్య నిశ్చలతనుశ్చోపేక్ష్య దేహస్థితిమ్ ।
బ్రహ్మాత్మైక్యముపేత్య తన్మయతయా చాఖండవృత్త్యా నిశం ।
బ్రహ్మానన్దరసంపిబాత్మని ముదాశూన్యైఃకిమన్యైర్భ్రమైః ॥

# జ్ఞాన భూమికలు

[ బ్రహ్మ స్వరూపము ]

శ్లో॥ జ్ఞానభూమిశ్శుభేచ్ఛాఖ్యా, ప్రథమాసముదాహృతా ।
విచారణా ద్వితీయాతు, తృతీయా తనుమానసా ॥

శ్లో॥ సత్త్వాపత్తిశ్చతుర్థీస్యా, త్తతోఽసంసక్తినామికా ।
పదార్థాభావనీ షష్ఠీ, సప్తమీతుర్యగాస్మృతా ॥

శ్లో॥ ఆసామంతే స్థితాముక్తి, స్తస్యాంభూయోనశోచతి ।
ఏతాసాంభూమికానాంత్వ, మిదంనిర్వచనం శృణు ॥

శ్రీరామచంద్రా ! జ్ఞానభూమికలు యేడింటిలో శుభేచ్ఛ మొదటిది, విచారణ రెండవది, తనుమానస మూడవది, సత్త్వాపత్తి నాలుగవది, అసంసక్తి ఐదవది, పదార్థాభావని ఆరవది, తుర్యగ యేడవదియు నగును. ఈ యేడింటికి మీద ముక్తి గలదు. దీనియందు జొచ్చినవాడు మరల దుఃఖము నొందడు. ఇక నీజ్ఞానభూమికల యొక్క లక్షణమును చెప్పుచున్నాను వినుము.

1. శ్లో॥ కింమూఢ ఇవతిష్ఠామి, ప్రేక్ష్యేఽహం శాస్త్రసజ్జనైః ।
వైరాగ్యపూర్వ మిచ్ఛేతి, శుభేచ్ఛేత్యుచ్యతే బుధైః ॥

నేను మూఢునివలె యేల యుంటిని. శాస్త్రాభ్యాసము చేతను, సత్పురుష సాంగత్యము చేతను, ఆత్మస్వరూపమును తెలిసికొందును గాక. అనియిట్లు వైరాగ్య పూర్వకముగా గలుగునట్టి యిచ్ఛ (కోరిక) శుభేచ్ఛ అని చెప్పబడును.

2\. శ్లో॥ శాస్త్ర సజ్జన సంపర్కై, వైరాగ్యాభ్యాసపూర్వకమ్ ।
సదాచార ప్రవృత్తిర్యా, ప్రోచ్యతేసా విచారణా ॥

వేదాన్తశాస్త్రవిచారంబును, బ్రహ్మవిదులయొక్క శుశ్రూషయు, సంసారమునందు విరక్తి గలుగుటకై సంసారసంబంధములగు దోషముల లెక్కించుటయు, సత్పురుషుల యొక్క నడతయందు ప్రవర్తనయు యివిచేరి విచారణయని చెప్పబడును.

3\. శ్లో॥ విచారణాశుభేచ్ఛాభ్యా మిన్ద్రి యార్థేష్వరక్తతా ।
యత్రసాతనుతా భావా త్ప్రోచ్యతే తనుమానసా ॥

శుభేచ్ఛచేతను, విచారణ చేతను విషయములయందు విరక్తి గలిగి, మనస్సు పెంపునొందుటకు కారణమగు రాగము నశించి మనస్సు సూక్ష్మరూపము నొందినట్టి దశ తనుమానసయని చెప్పబడును.

4\. శ్లో॥ భూమికాత్రితయాభ్యాసా చ్చిత్తేఽర్థే విరతేర్వశాత్ ।
సత్త్వాత్మని స్థితిశ్శుద్ధే సత్త్వాపత్తిరుదాహృతా ॥

శుభేచ్ఛ, విచారణ, తనుమానస, యనుమూడింటిని యభ్యసించి నందువలన సంస్కారము నశించి మనస్సునందు విషయవాసనలు యడంగుటవలన నిర్మలమగు ఆత్మస్వరూపమునందు నిర్వికల్పసమాధిచే నిలుకడనొంది యుండుట సత్త్వాపత్తియని చెప్పబడును. ఈ దశయందున్నవాడు బ్రహ్మవిదుడని చెప్పబడును.

5\. శ్లో॥ దశాచతుష్ట యాభ్యాసా దసంసర్గ ఫలేనచ ।
రూఢసత్త్వ చమత్కారా ప్రోక్తాఽసంసక్తినామికా ॥

ఇదివరకు చెప్పబడిన నాలుగు భూమికలను అభ్యసించుటచేతను, విషయవాసనా సంసర్గమును బోగొట్టునట్టి సమాధి పరిపాకఫలముచేతను, మనస్సునందు దృఢమైన బ్రహ్మసాక్షాత్కారముగల యవస్థ అవిద్య

యొక్కగాని, అవిద్యాకార్యము యొక్కగాని సంసక్తి (సంసర్గము) లేనందున అసంసక్తియని చెప్పబడును. ఈ దశయందున్నవాడు బ్రహ్మ విద్వరుడని చెప్పబడును.

6. శ్లో॥ భూమికా పంచకాభ్యాసా, త్స్వాత్మారామ తయాదృఢమ్।
అభ్యంతరాణాం బాహ్యానాం పదార్థానామ భావనాత్॥
పరప్రయుక్తేన చిరం ప్రయత్నేనావ బోధనమ్।
పదార్థాభావనీనామ షష్ఠీ సంజాయతేగతిః॥

ఇదివరకుజెప్పబడిన అయిదు అవస్థల నభ్యసించుటచే దృఢముగా ఆత్మ నిష్ఠగలవాడై అభ్యంతరములుగాని, బాహ్యములు గాని యగు పదార్థముల భావింపక పరులయొక్క ప్రయత్నముచే దేహకృత్యముల నిర్వర్తించు కొనుచుండుట పదార్థాభావని యను నాఱవ భూమిక యగును. ఈ దశయందున్నవాడు బ్రహ్మవిద్వరీయుడని చెప్పబడును.

శ్లో॥ భూమిషట్క చిరాభ్యాసా ద్భేదస్యాను పలంభతః।
యత్స్వభావైక నిష్ఠత్వం సాజ్ఞేయా తుర్యాగాగతిః॥

ఇదివరకు జెప్పబడిన యారవస్థలను నభ్యసించు చుండుటచే పరప్రయత్నము చేతనైనను భేదవ్యవహారము గలుగక సచ్చిదానన్ద లక్షణమగు నాత్మయందే యునికిగలిగి యుండుట తుర్యగయను నేడవ యవస్థయగును. ఈ యవస్థయందున్నవాడు బ్రహ్మ విద్వరిష్ఠుడగును, ఈ బ్రహ్మ విద్వరిష్ఠుడు బ్రహ్మవిదుడు మొదలగువారిలో నాల్గవవాడు గాన వానికి సంబంధించినందువలనగాని, లేక జాగ్రత్స్వప్న సుషుప్తులను మూడవస్థలకు అతీతమైనందునగాని ఈ స్థితి తురీయగయని చెప్పబడును.

శ్లో॥ పార్శ్వస్థ బోధితా స్సంతః పూర్వాచారక్రమాగతమ్।
ఆచారమా చరంత్యేవ సుప్తబుద్ధవ దక్షతాః॥

ఆ సత్పురుషులు సత్పురుషులచే బోధింపబడి తండ్రితాతల నుండి వచ్చిన యాచారమును నిద్రనుండి మేల్కాంచినవారలవలె నిరాటంకముగ జేయుచున్నారు

శ్లో॥ ఏతాసాంభూమికానాంతు, గమ్యం బ్రహ్మాభిధంపరమ్।
తత్త్వాఽహంతాఽత్మతాయత్ర పరతానాస్తి కాచన॥

శ్లో॥ నక్వచిద్భేదకలనాన భావాభావరంజనా।
సర్వంశాన్తం నిరాలమ్బం,వ్యోమస్థం శాశ్వతంశివమ్॥

శ్లో॥ అనామయ మనాభాస మనాత్మక మకారణం।
నసన్నాసన్న మధ్యాంతం నసర్వంసర్వమేవచ॥

శ్లో॥ మనోవచోభిరగ్రాహ్యం, శూన్యాచ్ఛూన్యంసుఖాత్సుఖమ్।
అసంవేదన మాశాన్త, మాత్మవేదన మాతతమ్॥

## బ్రహ్మస్వరూపము

ఈ జ్ఞాన భూమికలయందు నిలిచినవారలకు గోచరించునట్టి బ్రహ్మస్వరూపమును జెప్పుచున్నాను వినుము. ఏవస్తువునందు నీవు నేను తాను పరుడు అనునట్టి భేదము యెప్పుడును లేదో, మరియు ఉన్నది—లేదు అనునట్టి భావాభావంబులును దేనియందు లేవో అట్టి సర్వాత్మకంబును, నిర్వికారంబును, నిర్విషయంబును, చిదాకాశస్థితంబును, శాశ్వతంబును, శివశబ్దితంబును, నిర్దోషంబును, అనారోపితంబును, నామజాత్యాదిరహితంబును, కారణత్వరహితంబును, ఆదిమధ్యాన్తరహితంబును, సర్వజగద్విలక్షణంబును, జగద్రూపంబును, మనోవాగగోచరంబును, శూన్యంబగు నాకసంబుకంటె శూన్యతరంబును, విషయసుఖంబుకంటె సుఖతరంబును, అప్రమేయంబును, ఆశాతీతంబును, నిఖిలప్రమాణమూలంబును నగునది బ్రహ్మమని యెరుంగుము.

# పరమసుఖ – సుసాధనము

మానవునకు పరమసుఖానుభూతికి, యొక్క ఆత్మజ్ఞానమే సాధనముగాని తదితరములుగావు. ఆత్మజ్ఞానమువలన మానవుడు కాలక్రమమున నిత్యనిరతిశయ సుఖప్రాప్తి నొందును. ఇదియేమోక్షము, స్వస్వరూపసుఖము. పరమసుఖము.

ప్రపంచమున జీవులు సాధారణముగ నిపుడు పొందుచున్న సుఖములు విషయ జన్యములు— కావున నశించునవి. ఇవి అనిత్యములగుచు, దుఃఖపర్యవసితములై, జీవునకు తన సంసారభ్రమణకారణమగుచుండెను. సంసారము దుఃఖమనునది నిర్వివాదము. ఈ సంసారము జీవులకనాదిగ వచ్చుచున్నది. ఇట్టి సంసార దుఃఖమునుంచి జీవుల తరింపజేయుటకే శాస్త్రము ప్రవర్తించుచున్నది. మానవులకు అనధిగత, అబాధితశ్రేయస్సాధనమును బోధించునదియే శాస్త్రము. ఇట్టిది ముఖ్యముగ వేదము. ఈ సంసారభ్రమణ ప్రవాహమందు అనేకకోటిజన్మ సుకృతములచే ఒకానొక జీవుడు యీ సంసార దుఃఖమునుదాటి, మోక్షరూపమగు, తన నిత్య నిరతిశయ సుఖప్రాప్తి నొందు నిశ్చయించి ప్రయత్నించుచుండును. ఇట్టి జీవుడే జిజ్ఞాసువనబడును.

జిజ్ఞాసువునకు తానపేక్షించు మోక్షసిద్ధికి ప్రథమమున వాక్య ప్రమాణమే శరణ్యము. అట్టి ఉపనిషద్వాక్యము ముముక్షువునకు ప్రధానముగ, "సదేవసౌమ్యేదమగ్ర ఆసీత్" "ఏకమేవాద్వితీయం" "నేహనానాస్తికించన" "అతోన్యదార్తం" "అయమాత్మా బ్రహ్మ" "సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ" "ఆత్మాచ బ్రహ్మ" "జీవోబ్రహ్మైవనాపరః" "బ్రహ్మవిదాప్నోతిపరం" "తత్త్వమసి" అను మొదలుగాగల

వాక్యములతో, పరమతాత్పర్యమును బోధించుచున్నది. ముముక్షువు సద్గురుముఖమున యీవాక్యార్థమును బాగుగ శ్రవణముచేసినతరువాత, వాక్యప్రమాణముతోడ "అహం" నేను అను తన అనుభవమును, "ఇదం, మమేదం" అను దృశ్యానుభవములను శ్రుతి యుక్త్యనుభవ ములతోడ బాగుగ విచారించి, శాస్త్రబోధతోడ సరిచూచుకొనవలయును. అప్పుడు తానుబాగుగచేసిన ఆత్మవిచారమువలన "అహం" నేను అను కొనబడుచున్నట్టి తాను అనగా "అహం" ప్రతీతి వాస్తవముగ నశిం చుట లేదనియు, "నేను" అనుతన అనుభవము, అవస్థాత్రయ త్రికాలా బాధితమగుచు, సత్యమై అఖండముగ నున్నదనియు తాను గ్రహించ గలుగును. కాని ప్రారబ్ధమును బట్టి, స్వశరీర సర్వదృశ్యములగు యీ ప్రపంచానుభవముల యందు సత్యత్వ బుద్ధితోచుచు, తనకు దృశ్య సక్తతాభిమానములతోడ, వాటియందు రాగద్వేషములతో సంసారబంధ మును కలిగించుచునే యుండును. వ్యవహారమునకు ప్రారబ్ధముబలము. కాని యీ ప్రపంచ వ్యవహారము జీవునకు కల్పితము, మిథ్యా మాత్రము. మిథ్యయనగా వాస్తవమగు యొక వస్తువును, అదికాకట్టి మరియొక వస్తువుగ భ్రాంతిచే భావించుట, లేక గ్రహించుట ఎట్లన, కనుచీకటిలో చూచిన త్రాడును భ్రాంతిచే పామనుకొనుటవంటిది. ఇచట యీ సర్పము వాస్తవముగ లేకున్నను, భయకంపాది దుఃఖములకు కారణమగుచున్నట్లే పరమార్థ వాస్తవమున, ఆత్మస్వరూపమగు, అద్వితీయ, అఖండ, సచ్చిదానన్దస్వరూపమందు యీ ఖండ ఖండ నానాత్వ దృశ్యమును భ్రాంతియుతుడై యనుభవించుచు జీవుడు సంసార దుఃఖము నొందుచున్నాడు. ఇదిభ్రాంతిచేతోచు సర్పములాగున, అవాస్త వమేగద కావలయును. జిజ్ఞాసువుశాస్త్ర బోధచే యీస్వశరీరదృశ్యాను భవములన్నియు, అవాస్తవమని తెలిసికొనినను, యెంత ప్రజ్ఞావ తుని నైనను ప్రారబ్ధముకొంతవరకు బంధించుచునే యుండును. ఈ ప్రార బ్ధము నిశ్శేషమగుటకు సుఖ దుఃఖ రూపకమగు తనప్రారబ్ధమెంతటి

దైనను, జగన్మిథ్యాత్వ నిశ్చయమును బాగుగనొంది, తనభోగములను సక్తతాభిమాన రహితుడై (అనగా క్షీణించిన రాగద్వేషాదులతోడ) వాటి యందవాస్తవబుద్ధితో ననుభవించుట యావశ్యకము.

కాని యిట్టిస్థిరబుద్ధితోన, భోగముల నొందుటకు, పండిత ప్రకాండులకు గూడ, ప్రపంచానుభవములయందు సత్యత్వబుద్ధితో అహంకార మమకారవృత్తు లడ్డువచ్చుచునే యుండును. ఇదియే అధ్యాస. ఇది జీవుని తేలికగ విడువదు. కావున యీ అధ్యాసను, నిర్మూలించుటకే శాస్త్రము, ముముక్షువునకు, శ్రవణ, మనన, నిదిధ్యసనములను ముఖ్య సాధనములుగ తెలుపుచున్నది. కాన ముముక్షువులకు శ్రవణానన్తరము మనన, నిదిధ్యాసనాభ్యాసములత్యావశ్యకమని వేరుగజెప్పబనిలేదు. అయినను నిచట నొక రహస్యముగలదు. ఏదియనిన— యీ అభ్యాసకుడు తన అనుభవమునంతయును, లౌకికబుద్ధితోడ, అనగా వ్యవహారమందు సత్యత్వబుద్ధితో సరిచూచుకొనగూడదు. ఏలనన జీవునకు వ్యవహారమంతయు కాలాంతరమున నశించునట్టిది— తాత్కాలికము— అవాస్తవము— అనిత్యము. తానిప్పుడు కోరునది తననిత్య నిరతిశయ సుఖప్రాప్తి. అనిత్యమునుంచి, నిత్యమెట్లు ప్రాప్తమగును ? కాని వ్యవహారము అనిత్యము, అవాస్తవమైనను జీవునకు తన ప్రారబ్ధక్షయమునకు యీ వ్యవహార మొకసాధనము. ఇట్టి వ్యవహారము జ్ఞానపూర్వకముగ నుండవలయును. ఈ ప్రపంచ వ్యవహారమంతయు గిల్టు బంగారము వంటిది. దీర్ఘస్వప్న అనుభూతివంటిది. తాత్కాలిక సుఖానుభవము నిచ్చుచున్నను, యీ స్వశరీర సర్వప్రపంచానుభవములు స్వప్నస్త్రీ సంగమ, రంజనమువంటి అవాస్తవములు. ప్రపంచము రంజకముగా నున్నమాత్రమున వాస్తవమను బుద్ధినొందగూడదు. ఈ ప్రపంచ మవాస్తవమను బుద్ధినిశ్చయముతోడ పొందునట్టి భోగములు, జిజ్ఞాసువునకు (అనగా జ్ఞానికి) భావిప్రతి బంధమును గలిగింపజాలవు. కావున బ్రహ్మాభ్యాసకుడు తన వ్యవహార భోగములన్నిటిని వాటి యను

భూతియం దసత్యత్వబుద్ధితోడ, తన పరమార్థ స్వరూపమును మరువక అనుభవించుచుండఁ వివేకము ప్రథమమున శాస్త్ర ప్రమాణమునుబట్టి తనసత్య స్వరూపమగు, అవస్థాత్రయత్రికాలాబాధిత స్వప్రకాశపరిపూర్ణ చైతన్య దృష్టితోడ తన అనుభవములను లోకానుభవములను విమర్శించి, విచారణచేసి, తత్త్వదృష్టితోడ సరిచూచుకొనుట అభ్యసించిన యెడల, కాలక్రమమున యీస్వశరీరసర్వ దృశ్యము యొక్క అనిత్య, అవాస్తవత్వములు బాగుగ స్ఫురించుచుండును అపుడు అభ్యాస పాటవమునుబట్టి "అహం" నేను యీ పరిచ్ఛిన్నోపాధినిగాదు— ఇది కల్పితము. నా వాస్తవ స్వరూపము— అపరిచ్ఛిన్న సంవిద్రూపము. ఇదియే అఖండ సచ్చిదానన్ద స్వరూపము. ఇదియే నా ఆత్మ. ఇట్టి ఆత్మ యందే నామరూపములు, స్వప్నదృశ్యములవలె కల్పింపబడినవి— అని తనకే స్ఫురించుచుండును అనగా బుద్ధి గోచరమగుచుండును. అప్పుడు స్వస్వరూప సుఖము గూడ తనకు గలుగుచుండును ఇట్టి నిరంతర స్వస్వరూపాను సన్ధాన నిదిధ్యాసనాభ్యాసమువలన ప్రారబ్ధాంతమందు ముక్తి నొందును.

ఇట్లుగాక, అభ్యాసకుడు తనపరమార్థ స్వరూపమును మరచి, పరమార్థ సత్యమునువదలి, కేవలలౌకిక దృష్టితోడ దృశ్యానుభవ వివేచనలను గావించినయెడల, స్వస్వరూపమందు, తను శ్రవణముగావించిన దానికి, అనుభవమునకు వ్యత్యాసముగోచరించుచు, యింతకాలమునుంచి అలవాటు పడిన అనాత్మానుభవముల మీదికే మనసు లాగుచుండును. ఇందుచే స్వస్వరూపమందు సంశయ విపర్యయ బుద్ధినశించక, జ్ఞానము ఆపాతమాత్రమున నుండును. శాస్త్ర పాండిత్యమున్నను, ముముక్షువునకు శాస్త్రీయ నిరన్తర మనన ఆత్మానుసన్ధానాద్య భ్యాసపాటవము వలనగాని, స్వస్వరూపమందు ప్రీతినిశ్చయముకలిగి అనుభూతినొందుట దుర్లభము. కావున స్వస్వరూపమననానుసన్ధానాది అభ్యాసమావశ్యకము. ఈ అభ్యాసకాలమందు అభ్యాసముతోడ తత్త్వ బోధ

కములగు యోగ వాశిష్ఠాది గ్రంధములను, శ్రీ శంకర భగవత్పాదుల ప్రకరణ గ్రంధములను, శ్రీ భగవద్గీత, పంచదశి, నైష్కర్మ్యసిద్ధి మొదలగు గ్రంథరాజములను మననప్రక్రియ తోడ ప్రతి రోజునకు కొంతకాలము గ్రంధబోధ హృద్గోచరమగునటుల పఠించు చుండుట, చిత్త మాలిన్యమును నిర్మూలించుటకు, స్వస్వరూపమందు ప్రీతినిశ్చయములకు, స్వస్వరూపాను సన్ధాన పాటవములకు— అత్యంతముగ సహకరించును. ఇందు యోగవాశిష్ఠము ప్రతినిత్యము మననప్రక్రియతోడ పఠించవలసిన గ్రంధరాజము. ఇది కేవల తత్త్వబోధ. మనన పక్రియలతో అతివిపులముగను, మనోహరముగను, అనేక ఉపాఖ్యానములతోడ, జిజ్ఞాసువులకు మోక్షోపాయముగ అవతార పురుషుడు అగు శ్రీ రామచంద్రమూర్తి నుద్దేశించి, బ్రహ్మ మానసిక పుత్రుడును, జ్ఞాన సంప్రదాయమున అగ్రగణ్యుండునగు శ్రీ వసిష్ఠ మునీంద్రులచే చేయబడిన తత్త్వ గ్రంధరాజము. బాగుగ విమర్శించి చూచినయెడల శ్రీ భగవద్గీతకునిది విపులవ్యాఖ్యానము. జగన్మిధ్యాత్వ నిశ్చయముతో, స్వస్వరూపమందు ప్రీతినిశ్చయములతోడ ఆత్మానుసన్ధానాదులాచరించుచు తత్త్వమును బోధించునట్టి గ్రంధకాలక్షేపముచేయుచు, ప్రారబ్ధానుసరణమున సుఖదుఃఖ భోగానుభవములను ప్రారబ్ధక్షయము నకుగాను నొందుచుండుటయే పరమసుఖ ప్రాప్తికి సాధనము.

వాశి, ని, ప్ర, 68 సర్గ, శ్లో॥ 31, 32, పే 932.

శ్లో॥ తుర్యస్థఏవ సకలామల శాన్తివృత్తి.
జీవత్యపి, వ్యవహరన్నిపుణం సమన్తాత్ ।
నిత్యంసదేహ ఉతవాపి, విదేహఏవ,
బ్రహ్మన్నభోభవత ఏవకిలాస్తి సాధో ॥

శ్లో॥ ఓ మిత్యుదస్తభవవాసనమేకమాస్తే,
సత్వంన చాహమపి నాన్యదిహాస్తిసత్యమ్ ।

సర్వంచ విద్యత ఇతీహ కిలాన్తరాభం,
జ్ఞప్తిష్ఠ చిద్గగన కోశకలైక నిష్ఠః ॥

శ్లో॥ యదేవహిచిదాకాశం, తదేవమననంస్మృతమ్ ।
యదేవహిచిదాకాశం, తదేవపరమంపదమ్ ॥

శ్లో॥ ననిరోధోనచోత్పత్తిః, నబద్ధోనచ సాధకః ।
నముముక్షుర్నవై ముక్తః, ఇత్యేషాపరమార్థతా ॥

వాశి, పే, 437, తత్త్వ శాస్త్రవిచారము నెట్టివారుచేయుదురు ?

శ్లో॥ లోకేప్రబుధ్య మానానాం, భూతానామాత్మ సిద్ధయే ।
విహరన్తీహ శాస్త్రాణి, కల్పితాన్యు దితాత్మభిః ॥

శ్లో॥ సంప్రబుద్ధాశయాయేతు, దుష్కృతీనాం పరిక్షయే ।
తేషాంశాస్త్ర విచారేషు, నిర్మలాధీః ప్రవర్తతే ॥

శ్లో॥ విలీయతే మనోమోహః, సచ్ఛాస్త్రస్య విచారణాత్ ।
నభో విహరణాద్భానోః, శార్వరంతిమిరంయథా ॥

శ్లో॥ అఖండ మండలాకారం, వ్యాప్తం యేనచరాచరమ్ ।
స్వాత్మాభిన్నం స్వప్రకాశం, తద్బ్రహ్మాస్మిపరంపదమ్ ॥



# పరమేశ్వరుడు శ్రీ వసిష్ఠ భగవానులకుజేసిన ఆత్మబోధ

ఒకానొక సమయమున, పరమేశ్వరుడు శ్రీవశిష్ఠ భగవానులకు ప్రసన్నుడై ఆత్మయే దేవదేవుడని ఉపదేశించిన ఆత్మతత్త్వబోధ వాక్యములను కొన్నిటిని తాత్పర్యార్థసహితముగ నిచట నుదాహరించుచున్నాడను జిజ్ఞాసువుల బోధకు కరతలామలకముగ సహకరించునని నా ఆశయము.

శ్లో॥ శృణు బ్రహ్మ విదాంశ్రేష్ఠ దేవార్చనమనుత్తమమ్ ।
వదామి ముచ్యతేయెన కృతేన సకృదేవహి ॥ 1

ఈశ్వరుడు — బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడవగు ఓవశిష్ఠమునీంద్రా ! దేనిని ఒక్కపర్యాయ మాచరించినంతనే జీవుడు ముక్తుడగునో అట్టి సర్వోత్తమమగు దేవార్చనమును చెప్పుచున్నాను వినుము—

శ్లో॥ అకృత్రిమమనాద్యన్తం దేవనందేవ ఉచ్యతే ।
ఆకారాది పరిచ్ఛిన్నే మితేవస్తుని తత్కుతః ।
అకృత్రిమ మనాద్యన్తం దేవనం చిచ్ఛివంవిదుః ॥ 2

అకృత్రిమము, అనాద్యన్తమును, నిరతిశయానన్దమునగు చైతన్యమే దేవుడని చెప్పబడును. ఆకారాదులచే (దేశకాలవస్తువులచే) పరిచ్ఛిన్నమైనట్టి పరిమిత వస్తువునందు దేవత్వమెచట ? కావున అకృత్రిమమై ఆద్యంతరహితమై శివ (మంగళ) స్వరూపమై ప్రకాశ రూపమైనట్టి చిద్వస్తువేదేవుడని తత్త్వజ్ఞులు చెప్పుదురు.

శ్లో॥ తదేవ దేవశబ్దేన కథ్యతే తత్ప్రపూజయేత్ ।
తదేవా స్తియతః సర్వం స త్తాస త్తాత్మ రూపధృక్ ॥ 3

ఆ చిదాత్మయే 'దేవు'డను పదముచే చెప్పబడుచున్నది. అద్దానినే లెస్సగ పూజింపవలయును. ఏకారణముచే జగజ్జీవ, తత్సంసార రూపమంతయును ఆఆత్మస త్తచేతనే స త్తగలదియగుచున్నదో, స్వతఃకాదో, ఆ కారణముచే ఆ చిదాత్మయే యథార్థముగ కలదు. తదితరములేదు.

శ్లో॥ అజ్ఞాతశివత త్త్వానామాకారాద్యర్చనం కృతమ్ ।
యోజనాధ్వన్యశ క్తస్య క్రోశాధ్వా పరికల్ప్యతే ॥ 4

శివ (మంగళ) రూపమగు ఆత్మత త్త్వము నెరుగని వానికొరకు విష్ణ్వాద్యాకారములయొక్క పూజావిధానము విధింపబడినది. యోజనము (8 మైళ్ళు) దూరమునడువలేనివారికి క్రోశెడు (2 మైళ్ళు) దూరపు ప్రయాణము విధింపబడుచున్నదిగదా ?

శ్లో॥ అకృత్రిమమనాద్య న్తం, ఫలమానన్ద ఆత్మనః ।
బోధఃసామ్యం శమఇతి పుష్పాణ్యగ్ర్యాణితత్రచ ।
శివం చిన్మాత్ర మమలం పూజ్యం పూజావిదోవిదుః॥ 5

ఆత్మను పూజించుటవలన అకృత్రిమమైనట్టియు, ఆద్య న్తరహితమైనట్టియు ఆత్మానన్దము లభించుచున్నది. జ్ఞానము, సర్వత్రసమ (ఆత్మౌపమ్య) దర్శనము, శమము— అనునివి ఆ ఆత్మపూజయందు ఉ త్తమ పుష్పములనియు, నిర్మలమై శివ (మంగళ) రూపమైనట్టి చిన్మాత్ర ఆత్మ అందు పూజింపబడు దైవమనియు పూజావిషయ మెరిగిన పెద్దలు చెప్పుదురు.

శ్లో॥ శమబోధాదిభిః పుష్పైర్దేవ ఆత్మాయదర్చ్యతే ।
త త్తుదేవార్చనం విద్ధినాకారార్చన మర్చనమ్ ॥ 6

ఓమునీంద్రా ! శమ, జ్ఞానాదులగు పుష్పములచే ఆత్మదేవుడు పూజింపబడుట యేదికలదో అదియే దేవార్చనమని యెఱుఁగుము. అంతే కాని ఆకార అర్చనము పరిపూర్ణ అర్చనము కానేరదు.

శ్లో॥ ఆత్మైవదేవోభగవాఞ్ఛివః పరమకారణమ్ ।
జ్ఞానార్చనేన నిరతం పూజనీయః ససర్వదా ॥ 7

పరమకారణుఁడై, శివస్వరూపుడైనట్టి భగవంతుడగు ఆత్మయే దేవుడు. జ్ఞానమను అర్చనచే అతనిని నిరంతరము పూజింపవలయును

శ్లో॥ త్వమేతచ్చేత నాకాశమాత్మానం జీవమవ్యయమ్ ।
స్వభావం విద్ధినత్వన్యః పూజ్యః, పూజాత్మపూజనమ్॥ 8

మునీంద్రా ! నీవుజీవుని అకృత్రిమ, అవ్యయ, చిదాకాశరూప ఆత్మగనే యెఱుఁగుము. ఆ ఆత్మయే పూజింపదగినదికాని ఇతరమగు అనాత్మరూపమెద్దియునుగాదు. ఆత్మపూజనమే ముఖ్య పూజనము, అన్యముకాదు.

శ్లో॥ చిద్వ్యోమైవకిలాస్తీహ పారావారవివర్జితమ్ ।
సర్వత్రా సంభవచ్ఛేత్యం, యత్కల్పాన్తేఽవశిష్యతే॥ 9

ఓ మునీంద్రా ! ఇట విషయ రహితమై, పారావారవివర్జిత (అనంత) మైనట్టి చిదాకాశమే సర్వత్ర కలదు. ఏలయనగా, సర్వదృశ్యములయించి పోవునట్టి కల్పాంతమందును అదియే శేషించు చున్నది. (ప్రళయము నలయించిపోవుటఁబట్టి దృశ్యమునకు స్వతః సత్తలేదని నిశ్చితమైనందున సర్వకాలములందును చిదాకాశమే వెలయుచున్నదని భావము.)

శ్లో॥ యథాస్వప్నపురేచితం వర్జయిత్వే తరత్క్వచిత్ ।
నకించిత్సంభవత్యేవం జాగ్రత్యేవం మహా చితః॥ 10

స్వప్న పురమున చిదాకాశముతప్ప అన్యమెద్దియును ఒకింతైనను ఎచటను సంభవించనట్లు, ఈ జాగ్రత్తునందును మహాచైతన్యమునకు (ఆత్మకు) అన్యముగ ఏదియును సంభవింపదు.

శ్లో॥ సఏవదేవః కథితోయః పరః పరమార్థతః।
యస్త్వంసోఽహమ శేషంవా జగదేవచయోఽఖిలః॥ 11

జ్ఞానముచేపూజింప దగిన వాడని నేను పూర్వము చెప్పిన ఆ దేవుడు ఈ చిదాకాశమే యగును. ఈ చిదాకాశ రూప దేవుడే పరమార్థముగ సర్వోత్తముడై వెలయుచున్నాడు. ఆతడే నీవు; ఆతడే నేను; ఆతడే వాడు; ఆతడే ఈ సమస్తజగత్తున్ను.

శ్లో॥ ఏ వంసర్వ మిదం విశ్వం, పరమాత్మైవ కేవలమ్।
బ్రహ్మైవ పరమాకాశమేష దేవః పరః స్మృతః॥ 12

ఈ ప్రకారముగ ఈ విశ్వమంతయును కేవలము పరమాత్మయే, బ్రహ్మమే, చిదాకాశమే. ఈ చిదాకాశరూప ఆత్మయే సర్వోత్తమ దేవుడని చెప్పబడెను.

శ్లో॥ అకృత్రిమ మనాద్యన్త మద్వితీయమఖణ్డితమ్।
అబహిః సాధనా సాధ్యం సుఖంతస్మాదవాప్యతే॥ 13

ఆ ఆత్మ అకృత్రిమమైనది. ఆద్యన్త రహితమైనది. అద్వితీయమైనది. అఖణ్డమైనది. బాహ్య (ధనాది) సాధనములచే సాధింపరానిది. కాబట్టి (స్వాత్మయే యగుటచే) సులభముగ పొందబడుచున్నది.

శ్లో॥ పుష్ప ధూపార్చనం బ్రహ్మన్కల్పితం బాలబుద్ధిషు।
యత్స్వాదృశవా దృశాం యోగ్య మర్చనం
తద్వ దామ్యహమ్॥ 14

మహాత్మా! పుష్ప ధూపాదులతో గూడిన అర్చన బాలురవలె అల్పబుద్ధిగల వారి కొరకు కల్పింపబడినది. ఇక నీ వంటి వివేక వంతులకు తగిన అర్చన యేదియో తెలిపెదను వినుము.

శ్లో॥ అస్మదాదిస్త్వసౌకశ్చిద్దేవో మతి మతాంవర।
దేవస్త్రి భువనాధారః పరమాత్మైవ నేతరత్॥ 15

బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడవగు ఓమునీంద్రా! మావంటి వారలకు గూడ కారణుఁడైన ఒకానొక దేవుడు కలడు. ఆతడు ముల్లోకములకును ఆధారభూతుడైన పరమాత్మయే కాని మరియొకడు కాడు.

శ్లో॥ శివఃసర్వపదాతీతః సర్వసంకల్పనాతిగః।
దిక్కాలాద్య నవచ్ఛిన్నః సర్వారమ్భ ప్రకాశకృత్।
చిన్మాత్రమూర్తి రమలోదేవ ఇత్యుచ్యతేమునే॥

ఓ మునీంద్ర! శివ (మంగళ) స్వరూపుడును, బ్రహ్మ విష్ణు మహేశ్వరాది సర్వపదములకు అతీతుడును, సమస్త మనోవృత్తులకు ఆవలనున్నవాడును, దేశకాల వస్తువులచే పరిచ్ఛిన్నుడు కానివాడును, సమస్త కార్యములను ప్రకాశింపజేయవాడును, నిర్మలుడునగు చిన్మాత్రమూర్తి (ఆత్మ) యే దేవుడని చెప్పబడును.

శ్లో॥ బ్రహ్మైన్సద సతోర్మధ్యం తదేతద్దేవ ఉచ్యతే।
పరమాత్మ పరాభిఖ్యం తత్సదో మిత్యుదాహృతమ్॥ 17

మహాత్మా! స్థూల, సూక్ష్మ పదార్థములందును, వర్తమాన, తదన్య కాలములందును వ్యాపించి యున్నదియు, సర్వప్రకాశమైనదియు, పరమాత్మ యనఁబడునదియునగు బ్రహ్మమే దేవుడని చెప్పబడును. ఆ సద్రూపుడుగు దేవుడు 'ఓమ్' అనుపదముచే వేదములందు చెప్పబడెను.

శ్లో॥ యచ్చిత్తత్త్వ మరున్ధత్యా యచ్చిత్తత్త్వం తవానఘ ।
యచ్చిత్తత్త్వంచ పార్వత్యా యచ్చిత్తత్త్వం గణేషుచ ।
చిత్తత్త్వం యన్మమేదంచ చిత్తత్త్వం యజ్జగత్త్రయే ।
తద్దేవఇతి తత్త్వజ్ఞా విదురుత్తమ బుద్ధయః ॥ 18

పాపరహితుడవగు ఓ మునీంద్రా ! అరుంధతియొక్క చిదాత్మ యేది కలదో, నీ యొక్క చిదాత్మ ఏదికలదో, పార్వతియొక్క చిదాత్మ యేదికలదో, గణములయొక్క చిదాత్మ యేదికలదో, నా యొక్క చిదాత్మ యేదికలదో, ముల్లోకముల యొక్క చిదాత్మ యేదికలదో అదియే దేవుడని మహాధీమంతులగు తత్త్వజ్ఞులు నుడివిరి.

శ్లో॥ నసదూరేస్థితో బ్రహ్మన్న దుష్ప్రాపః సకస్యచిత్ ।
సంస్థితః స సదాదేహే సర్వత్రైవచ ఖేతథా ॥ 19

మహాత్మా ! ఆ సద్రూప ఆత్మదేవుడు దూరమున లేడు. అతడెవడికిని పొందుటకు కష్టసాధ్యమైనవాడును కాడు. అతడు సదా దేహమందు విరాజిల్లుచున్నాడు. మరియు ఆకాశమందు సర్వత్ర కూడ వెలయుచున్నాడు.

శ్లో॥ సోఽస్యాం విచిత్రచేష్టాయాం ప్రకాశిన్యాంచ తద్వశాత్ ।
తత్స్వరూప నిబద్ధాయాం పుర్యామాస్తే మునీశ్వర ॥ 20

ఓ మునీశ్వరా ! విచిత్రచేష్టలతో గూడినదియు, ఆత్మదేవుని వలన ప్రకాశించుచున్నదియు మరియు అతని స్వరూపమువలన నిలబడి యున్నదియు నగు ఈ శరీరమను నగరమున ఆ ఆత్మదేవుడు నివశించుచున్నాడు.

శ్లో॥ శరీరావసథాయాంచ చలాయాం తత్ప్రసాదతః ।
సోఽస్యాం గహనకోశాయాం హృద్గుహాయాం
గుహేశ్వరః ॥ 21

ఆతడు తన అనుగ్రహముచే కదలునట్టి శరీరమను పంచకోశ సమన్వితమగు బుద్ధి గుహయందు గుహేశ్వరుడై వెలయుచున్నాడు.

శ్లో॥ సవేషచిన్మయః సూక్ష్మః సర్వవ్యాపీ నిరఞ్జనః ।
ఇమంభాస్వర మాభాసం కరోతి నకరోతిచ ॥ 22

చిన్మయుడును, సూక్ష్మరూపుడును, సర్వవ్యాపియు, నిరంజనుడు (దోష రహితుడు) నగు ఆ ఆత్మ దేవుడే ఈ ప్రకాశ మానమగు జగదాభాసము నంతను (ఆరోప దృష్టిచే) గావించుచున్నాడు (అపవాద దృష్టిచే) గావించుటయు లేదు.

శ్లో॥ స ఏవ హిపుమాన్కోపాద్యథేహాన్య ఇవక్షణాత్ ।
భవత్యేవం వికల్పాజ్ఞా చిత్స్వరూపాన్య తాంగతా ॥ 23

ఒకే మనుజుడు కోపము తన్నావహించినప్పుడు అన్యుడగు రాక్షసునివలె నెట్లగునో, అట్లే చిత్స్వరూపమున్ను అజ్ఞానదశయందు సంకల్పాదులతో గూడియుండునపుడు అన్య (జీవ) రూపమును బొందిన దానివలె నుండును.

శ్లో॥ స్వసంకల్పోప యాతాసు భీతాసంభ్రమ దృష్టిసు ।
పలాయతే వాప్యన్యాసు వేతాలేష్వివ బాలికా ॥ 24

అజ్ఞానదశయందు చైతన్యము తన సంకల్పముచేతనే రచింపబడు భ్రమ దృష్టులచే తానే భయముజెందినదై, భేతాళముల మధ్య నుండి బాలికవలె పరిగెత్తుచున్నది.

శ్లో॥ బాల్యే వివశసర్వార్థా యౌవనే చిన్తయాఽఽవృతా ।
వార్ధకేఽప్యతి దుఃఖార్తామృతాకర్మ వశీకృతా ॥ 25

ఆ అజ్ఞచైతన్యము బాల్యకాలమున ఏ భోగములును అనుభవించ

లేక యుండును. యౌవనకాలమున విషయ, ధనాదుల చింతతో గూడు కొని, వానివలన వివేక శూన్యమై వర్ధిల్లును. వార్ధక్యమున మహాదుఃఖ ముచే పీడింపబడును. మరణించిన పిదప కర్మకు వశమై తత్కర్మాను సారము ఆ యా యోనులందు జన్మించుచుండును.

శ్లో॥ జాయతే స్వర్ణనగరే నాగీ పాతాలకోటరే,
ఆసురీదైత్య వివరే నరస్త్రీ వసుధాతలే।
విద్యాధరీ దైవగిరౌ వ్యాలీచ వనగర్తకే,
లతాతరౌ ఖగీ నీడే వీరుత్సానౌ వనేమృగీ॥ 26

మరణానన్తరము ఆ అజ్ఞచైతన్యము కర్మానుసారము స్వర్గ నగరమున దేవతాస్త్రీగనో, పాతాళమందు నాగవనితగనో, అసురలోక మున అసుర స్త్రీగనో, భూమిపై మనుష్య స్త్రీగనో, సుమేరు పర్వత మున విద్యాధరిగనో, అరణ్యమున సర్పముగనో, వృక్షమున లతగనో, గూటియందు పక్షిగనో, పర్వత శిఖరమున తీగెల పొదగనో, అరణ్య మున లేడిగనో జన్మించుచున్నది.

శ్లో॥ ప్రతిభాసత ఏవాత్మ న్యసత్స్వప్న ఇవాతతః।
మనాగపి నసత్యాత్మ మృగతృష్ణామ్బు వత్థ్సితమ్॥ 27

ఈ శరీరాది జగత్తు అసద్రూపమే యగుచు విశాల స్వప్నము వలె ఆత్మయందు ప్రతిభాసించుచున్నది. ఇది మృగతృష్ణా జలమువలె వర్తించుచు ఒకింతైనను సత్యముకాకయే యున్నది.

శ్లో॥ యస్మాదుదేతి కలనాకుల దృశ్యజాలం,
యత్రత్రచ స్థితవదిత్యనుభూత ముచ్చైః।
యస్మాన్మనో విపరివర్తతి దేహదృష్ట్యా,
సర్వం తు తత్పరమవస్త్వితి విద్ధివిశ్వమ్॥ 28

ఓ మునీంద్రా ! ఏ కారణముచే వివిధ కల్పనామయమైనట్టి ఈ దృశ్య సమూహమంతయు పరమ వస్తువగు చిదాత్మయం దుదయించుచున్నదో, ఏ కారణముచే నయ్యది అందు స్థితిగలిగియున్న దానివలె బాగుగ అనుభూతమగుచున్నదో, మరియు ఏ కారణముచే నది తుదకు అందు లయమగుచున్నదో, ఏ కారణముచే మనస్సు అద్దాని సత్తను బొందినదై దేహాకారములతో పరిభ్రమించుచున్నదో, ఆ కారణముచే ఈ విశ్వమంతయును ఆ పరమవస్తువగు చిదాత్మరూప బ్రహ్మమే యని యెఱుఁగుము.

శ్లో॥ యథాజాతానిజాతాని చాన్యాన్యన్యాని కాలతః ।
వృక్షత్వర్ణాని శీర్యన్తే శరీరాణి తథానృణామ్ ॥ 29

చెట్టు ఆకులు క్రొత్తక్రొత్తవి పుట్టుచు కాలక్రమమున ఎండి నశించుపోవునట్లు, జీవులకున్ను శరీరములు మరల మరల ఉత్పన్నములై నశించిపోవుచున్నవి.

శ్లో॥ వస్తుబోధోఽత్ర సంధత్తే తత్రాలం వాగ్వికల్పనైః ।
వ్యవచ్ఛేదాది దుశ్ఛేద్యం వచోవాచ్యాత్మికాల ద్విజ ! ॥30

ఓ బ్రాహ్మణోత్తమా ! ఈ ప్రపంచమునందలి సమస్త పదార్థముల యొక్క పరస్పర భేదమును తత్త్వజ్ఞాన మొక్కటియే ఏకత్వమును పొందింపగలదు. ఇవ్విషయమున ఇతర వాగ్వికల్పనల వలన ఏ ప్రయోజనమున్ను లేదు. ఏలయనగా, అజ్ఞానము తొలగనపుడు ఎన్ని వాగ్వికల్పనలచే నైనను ప్రత్యక్ష భ్రమ సిద్ధమగు ద్వైతము ఛేదింపనలవికానిదై యుండును.

శ్లో॥ మహావిద్యోపనయనా చిద్భవత్యభిధా సతీ ।
సా జీవత్వేన బాహ్యత్వం తదా ద్విన్ద్వివపశ్యతి ॥ 31

ఆ చైతన్యము మహా అవిద్యయను విచిత్ర వర్ణరంజిత నేత్రము

కలది యెపుడగునో, అపుడు జీవుడు అని చెప్పబడుచు, దోషయుక్త నేత్రుడు రెండు చంద్రులను గాంచు విధమున బాహ్యజీవ జగద్రూపము లను వీక్షించుచున్నది.

శ్లో॥ సంకల్పా నిలనిర్ధూతం భ్రాన్తం పర్ణతృణాంశవత్ ।
భూతాకాశే చిదాత్మాన మవలమ్బ్య విలోకయ ॥ 32

సంకల్పమను వాయువుచే ఎగురగొట్టబడి పర్ణతృణలేశమువలె హృదయాకాశమున పరిభ్రమించుచున్నట్టి చిదాత్మను పట్టుకొని అద్దానిని వీక్షింపుము.

శ్లో॥ సంకల్పమాత్రమే వేదం జగన్మిథ్యా సముత్థితమ్ ।
అసంకల్పన మాత్రేణ బ్రహ్మన్క్వాపి విలీయతే ॥ 33

మహాత్మా ! ఈ జగత్తంతయు సంకల్పమాత్రమే యగుచు మిథ్యారూపమున జనించినదై యున్నది. అయ్యది అసంకల్పన మాత్ర ముచే ఎచటనో విలీనమై పోవుచున్నది.

శ్లో॥ ప్రభురస్మీతి విస్మృత్య తావచ్ఛోచతి భూమిపః ।
భూమి పోఽస్మీతి సంజాతా యావన్నాస్య హృదిస్మృతిః॥

రాజగువాడు తాను రాజను భావమును మరచి, నేను రాజును అనుస్మృతిని తిరిగి హృదయమున కలిగియుండనంతవరకును దుఃఖించు చునే యుండును. (అట్లే జీవుడును ఆత్మస్మృతి బడయువరకు శోకించు చుండును).

శ్లో॥ మనసా మనసిచ్ఛిన్నే స్వేన్ద్రియావయవాత్మని,
సత్యాలోకాజ్జగజ్జాలే ప్రచ్ఛన్నే విలయంగతే ।
సమస్త సామాన్యవతీ భవతీర్ణ భవార్ణవా,
అపునర్భ వసౌషుప్త పదపార్ష్ణిత్యా పీవరీ
పరమాసాద్య విశ్రాన్తా విశ్రాన్తా వితతేపదే ॥ 35

తన ఇన్ద్రియ, అవయవ రూపమగు మనస్సుచే మనస్సు ఛేదింప బడ, సత్యము (ఆత్మ) యొక్క సాక్షాత్కారముచే దృశ్య జగత్సమూహము విలయమొంద, జీవుడు సత్తా సామాన్యరూపమునుబొంది జీవిత దశయందే సంసార సముద్రమును దాటినవాడై, పునర్జన్మ లేనివాడై సుషుప్త స్థానమందలి నిరతిశయానన్దముతో గూడి వర్ధిల్లు ఉత్తమ పదమును బొందినవాడై, అట్టి విశాలమగు ఆత్మపదమున విశ్రమించును.

శ్లో॥ సమస్తం సుశివం శాన్తమతీతం వాగ్విలాసతః ।
ఓమిత్యస్యచ తన్మాత్రా తుర్యాసా పరమా గతిః ॥ 36

ఇదంతయును వాక్కున కతీతమగు శాంత, శివ స్వరూపము. ప్రణవము యొక్క తురీయ మాత్రయగు బ్రహ్మమే జనులకు పరమ గతియై యున్నది.

శ్లో॥ మునే మనన మాహూయ స్వసత్తైవాశుమీయతామ్ ।
త్వమర్థ్యం మాహరానర్థం పవనః స్పన్దతామివ ॥ 37

ఓ మునీశ్వరా! నీవు మొట్టమొదట విచారణయందు ప్రవేశించిన వాడవై, నీ యొక్క ప్రత్యగాత్మ సత్తనే శీఘ్రముగ ప్రమాణముల ద్వారా నిశ్చయించి తెలిసికొనుము. వాయువు నిశ్చలమైయున్నను చలించి ధూళ్యాది యుక్తమగులాగున నీవు ఆ ప్రత్యగాత్మయందు బహిర్ముఖత్వ సంపాదనము ద్వారా సర్వానర్థమూలమగు దృశ్యత్వమును గ్రహింపకుము.

శ్లో॥ సంవేదనాత్మకతయా గతయా సర్వగోచరమ్,
నతస్యాహ్వాన మన్త్రాది కించిదేవోప యుజ్యతే,
నిత్యాహూతః ససర్వస్థో లభ్యతే సర్వతః స్వచిత్ ॥ 38

ఆ ఆత్మ దేవుడు జ్ఞానమాత్ర స్వరూపుడగుటచేతను, సర్వత్ర

వ్యాపించి యుండుటచేతను, ఆహ్వానాదు లాతని విషయమున ఒకింతైనను ఉపయోగవంతములు గావు. ఆతడు నిత్యము ఆహ్వానింపబడియే యున్నాడు. సర్వత్ర వెలయుచున్నాడు. సర్వత్ర లభించుచున్నాడు. సర్వులకును స్వకీయ చిద్రూపమున చెన్నొందుచున్నాడు.

శ్లో॥ ఆద్యం పూజ్యం నమస్కార్యం స్తుత్యమర్ఘ్యం
సురేశ్వరమ్ ।
ఏవం తం విద్ధి వేద్యానాం సీమాన్తం మహతామపి॥ 39

మునీంద్రా ! దేవేశ్వరుడగు ఈ ఆత్మ దేవుడే ఆది స్వరూపుడనియు, పూజింపదగిన వాడనియు, నమస్కరింపదగిన వాడనియు, స్తోత్రముచేయదగిన వాడనియు, ఎఱుగదగిన గొప్పవాని యన్నింటిలోను మిగుల గొప్పయనియు నీవు తెలిసికొనుము.

శ్లో॥ ఏతమాత్మానమాలోక్య జరాశోకభయాపహమ్ ।
సంభృష్ట బీజవజ్జన్తుర్న భూయః పరిరోహతి ॥ 40

వార్ధక్య, శోక, భయములను పోగొట్టునట్టి ఈ ఆత్మను సందర్శించినచో, వేయించబడిన విత్తనమువలె జీవుడు మరల ఎన్నిటికిని సంసారమున జన్మింపనేరడు.

శ్లో॥ యస్మిన్సర్వం యతఃసర్వం యఃసర్వం సర్వతశ్చయః ।
యశ్చ సర్వమయో నిత్యం తస్మై సర్వాత్మనే నమః ॥

దేనియందు సమస్తముగలదో, దేనినుండి సమస్తము ఆవిర్భవించుచున్నదో, ఏది సమస్తము అయియున్నదో, ఏది అంతటను వ్యాపించియున్నదో, ఏది సర్వమయమై యొప్పుచున్నదో అట్టి సర్వరూపమగు ఆత్మకు సదా నా నమస్కారము.



# స్వస్వరూపాను సన్ధానము

"అహం" నేను వాస్తవమున, ఈ దేహాది సంఘాతములో నేదియును గాదు. మరి నా వాస్తవస్వరూపమేది యనిన, ఏది సత్య జ్ఞానానన్తమో, ఏది ప్రజ్ఞాన ఘనమో ఏది అఖండ సచ్చిదానన్ద స్వరూపమో, ఏది సర్వాధిష్ఠానమో, ఏది జగత్పరమ కారణమో, ఏది స్వప్రకాశసర్వ ధీసాక్షి భూతమో, ఏది స్వప్రకాశ అవినాశ నిత్య నిర్వికార అఖండ పరిపూర్ణానన్ద స్వరూపమో, ఏది సర్వజీవులకును "అహం" నేను యను ప్రతీతితోడ అవినాశిగా అనుభవమిచ్చు చున్నదో, ఏ అనుభవము అనగా జ్ఞానము లేని యడల యీ జగదనుభవము సాధ్యము గాదో, అట్టి స్వాత్మాభిన్న స్వప్రకాశ, నిత్య నిర్వికార, నిరవయవ, అద్వితీయ, అసంగ పరిపూర్ణానన్ద అఖండ చైతన్య స్వరూపుడను నేను. ఈ నేనే పరమాత్మ ప్రత్యగాత్మ స్వరూపుడను. ఈ జీవత్వము నాయందు మాయాకల్పితము. నేను వాస్తవమున నిత్యశుద్ధ బుద్ధ ముక్తుడను.

శ్లో॥ అహమిత్యేవ బన్ధాయ, నాహమిత్యేవ ముక్తయే ।
ఏతావన్మాత్రకేబన్ధే, స్వాయత్తేకి మశక్తతా ॥

శ్లో॥ మమేదమితి బన్ధాయ, నాహమిత్యేవముక్తయే ।
ఏ తన్మాత్రకేవస్తున్యా త్మాయత్తే కిమజ్ఞతా ॥

శ్లో॥ శోకేష్వాపత్సు ఘోరేషు సంకటేష్వ వటేషుచ ।
యథా ప్రాప్తేషుసర్వేషు, ఖర్వే షూన్నతి మత్సుచ ॥

శ్లో॥ యథా క్రమం యథా దేశం కురుదుఃఖ మదుఃఖితః ।
బాష్పక్రం దాది పర్యంతం, ద్వంద్వ యుక్త సుఖానిచ॥

వాశి, పే 1121, 1122 వగైరా—

శ్లో॥ క్రమాగతేష్వ భిన్నో ఽర్థం, బక వచ్చి న్తయార్జయ।
అర్థోపార్జన కార్యేషు, వాసనా క్రాంత మూఢవత్ ॥

శ్లో॥ అంతర్ముఖ తయానిత్యం, కార్యమాహరతాం బహిః।
జీవతా మపి నోదేతి, వాసనా కృష్ట దానివ ॥

శ్లో॥ అన్తర్వృత్తివిహీనేన, బహిర్వృత్తి మతేనచ।
సుప్త ప్రబుద్ధ ప్రాయేణ, కార్య మాచరతేజసా ॥

శ్లో॥ జీవతోఽప్యపశాన్తస్య, వ్యవహార వతోఽపిచ।
శవవద్య దవస్థానం, తదాహుః పరమంపదమ్ ॥

వాశి, పే, 1070.

శ్లో॥ రస భావన మంతస్థే, మాలంభవతుకర్మసు।
దారు యన్త్ర మయస్యేవ, పరార్థ మివకుర్వతః ॥

శ్లో॥ నీరసాయే వసన్సుప్తే, సమస్తే న్ద్రియ సంవిదః।
ఆకార మాత్ర సంలక్ష్యా, హేమన్తర్తౌ లతాఇవ ॥

శ్లో॥ బహునాత్ర కిముక్తేన, సంక్షేపాదిద ముచ్యతే।
సంకల్పనం మనోబన్ధ, స్తదభావే విముక్తతా ॥

వాశి, పే, 1114.

శ్లో॥ యత్సుఖందుఃఖమే వాహుః, క్షణ నాశాను భూతిభిః।
అకృత్రిమ మనాద్యన్తం, యత్సుఖం తత్సుఖం విదుః ॥

శ్లో॥ అధిష్ఠానే పరిజ్ఞాతే, సచ్చిదానన్ద లక్షణే।
అహం మమఇతి భ్రాంతి, స్స్వప్నవత్ప్రవిలీయతే ॥

(స్వవిరచితమ్)

శ్లో॥ ఏ కంచిన్మాత్రమే వాహం, నశరీరా దయోమమ।
ఇతి సత్యను సన్ధానే, క్వజన్మ మరణాదయః ॥

శ్లో॥ చిదాకాశ మహం స్వచ్ఛ, మనుభూతి రితిస్ఫుటా।
యస్యాస్థ మాగ తామూఢం, తంజీవన్తం శవం విదుః॥

శ్లో॥ బలం బుద్ధిశ్చ తేజశ్చ, దేహోఽహమితి భావనాత్।
నశ్యత్యు దేత్యేత దేవ, చిదేవాహ మితిస్థితేః ॥

శ్లో॥ చిదాకాశ మహం శుద్ధం, కేమే మరణ జన్మనీ।
ఏ వంస్థితేస్యుః కింనిష్ఠా, లోభమోహ మదాదయః ॥

యోగమును గురించి, వాశి, పే 802

యోగమనగా సంసార దుఃఖము నుంచి ఆత్యంతిక తరణోపాయము. ఇది రెండు విధములు. 1, ప్రాణనిరోధము, 2, ఆత్మజ్ఞానము. శ్రీరామచంద్రమూర్తి యీ రెంటిలో ఏది సులభము, ఏది తిరిగి యెన్నటికినీ సంసార దుఃఖమును రాకుండ, అనగా శాశ్వతముగనశింప జేయునది యని ప్రశ్నించెను. దానికి శ్రీ వశిష్ఠులవారు, ఆత్మజ్ఞాననిశ్చయమే, సుసాధ్యమని నీ క్రింది శ్లోకము వలన సమాధానము చెప్పిరి.

బృహద్వాశిష్ఠము, పేజి, 829 to 840.

శ్లో॥ అసాధ్యః కస్య చిద్యోగః, కస్య చిత్ జ్ఞాన నిశ్చయః।
మమత్వ భిమతః సాధో, సుసాధ్యో జ్ఞాన నిశ్చయః॥



# ఆత్మ రసాయనమాల

ముకుందమాల :

శ్లో॥ ఇదం శరీరం పరిణామ పేశలం, పతత్య జస్రం
శతసన్ధి జర్జరమ్ ।
కిమౌషధైః క్లిశ్యసి మూఢదుర్మతే, నిరామయం
కృష్ణ రసాయనంపిబ ॥

"నిరామయం ఆత్మరసాయనంపిబ" "రసోవైసః" రస ఏవ అయనం = ఆత్మ రసాయనం, పిబ = బ్రహ్మాత్మనా సంస్థితి మను భవ.

శ్లో॥ నిత్యా నిత్య వివేకాది, యుక్త స్సద్గురు మాశ్రితః ।
విశుద్ధ చిత్తో జీవ, త్వం పిబస్వాత్మ రసాయనమ్ ॥ 1

శ్లో॥ యదజ్ఞానా జ్జగదిదం, భాతిరజ్జుభుజంగవత్ ।
యద్జ్ఞానాల్లీయతే, త్వం, తత్‌పిబస్వాత్మ రసాయనమ్॥2

శ్లో॥ ఆత్మైవ సంవిదాకారం, ఆత్మైవచని రామయమ్ ।
ఆత్మైవ పరమానన్దం, పిబస్వాత్మ రసాయనమ్ ॥ 3

శ్లో॥ రసోనామ పరంబ్రహ్మ, ఆత్మా తస్యాయనంమహత్ ।
తత్ప్రాప్తిస్తుసు ఖంతస్మాత్, పిబస్వాత్మ రసాయనమ్॥

శ్లో॥ శివం సర్వగతం శాన్తం, బోధాత్మక మజంసుఖమ్ ।
నిరామ యంచ నిర్ద్వంద్వం, పిబస్వాత్మ రసాయనమ్ ॥5

శ్లో॥ అఖండ సంవిదా కారం, పరిపూర్ణ మివాంబరమ్ ।
సర్వాధారం స్వప్రకాశం, పిబస్వాత్మ రసాయనమ్ ॥ 6

శ్లో॥ ఏ కం బ్రహ్మ చిదాకాశం, సర్వోపాధి వివర్జితమ్ ।
స్వాత్మా భిన్నం జగన్మూలం, పిబస్వాత్మ రసాయనమ్॥

శ్లో॥ చిన్మాత్రమమలం శాన్తం, మద్వితీయ మఖండితమ్ ।
నిత్యా నన్దం నిర్వికారం, పిబస్వాత్మ రసాయనమ్ ॥ 8

శ్లో॥ జ్యోతిషామపిత జ్జ్యోతిః, తమ సః పరమవ్యయమ్ ।
ఆత్మజ్యోతి స్స్వయం జ్యోతిః, పిబస్వాత్మ రసాయనమ్॥

శ్లో॥ ఆనన్దం పరమానన్దం, స్వప్రకాశం నిరామయమ్ ।
అఖండ సంవిదాకారం, పిబస్వాత్మరసాయనమ్ ॥ 10

శ్లో॥ చిదాకాశ స్వరూపంతత్, సచ్చిదానన్ద లక్షణమ్ ।
పరంజ్యోతిః ప్రత్యగాత్మా, పిబస్వాత్మ రసాయనమ్॥

శ్లో॥ సర్వధీసాక్షి భూతంచ, తద్విష్ణోః పరమం పదమ్ ।
నిత్యం శుద్ధం బుద్ధముక్తం, పిబస్వాత్మ రసాయనమ్ ॥

శ్లో॥ అఖండ మండలాకారం, వ్యాప్తం యేన చరా చరమ్ ।
తత్పదం ప్రాప్యతే యేన, పిబస్వాత్మ రసాయనమ్ ॥13

శ్లో॥ ప్రజ్ఞాన ఘన మానన్ద, మద్వితీయ మఖండితమ్ ।
స్వాత్మా భిన్నం స్వప్రకాశం, పిబస్వాత్మ రసాయనమ్॥

శ్లో॥ తత్త్వ మస్యాది వాక్యానాం, లక్ష్య భూతం నిరంజనమ్।
సంసారామయ నిర్మోక్షం, పిబస్వాత్మ రసాయనమ్॥ 15

శ్లో॥ సత్యం జ్ఞాన మనన్తంతత్, నిత్యసిద్ధం నిరామయమ్ ।
అఖండ పరమానన్దం, పిబస్వాత్మ రసాయనమ్ ॥ 16

శ్లో॥ సర్వోపాధి వినిర్ముక్తం, పుణ్యపాప వివర్జితమ్ ।
ప్రత్యగాత్మ స్వరూపం తత్, పిబస్వాత్మ రసాయనమ్॥

శ్లో॥ స్వానుభూతిం స్వప్రకాశం, పరమానన్ద లక్షణమ్ ।
అఖండ జగదాధారం, పిబస్వాత్మ రసాయనమ్ ॥ 18

శ్లో॥ చిన్మాత్రం విమలం శాన్తం, నామరూప వివర్జితమ్ ।
అఖండ పరమానన్దం, పిబస్వాత్మ రసాయనమ్ ॥ 19

శ్లో॥ స్వానన్దం పరమం నిత్యం, సుసుఖం ప్రాప్తమవ్యయమ్।
పరిపూర్ణ పరానందం, పిబస్వాత్మ రసాయనమ్ ॥ 20

శ్లో॥ అస్తిభాతి ప్రియం రూపం, నామరూప వివర్జితమ్ ।
అఖండ సచ్చిదానన్దం, పిబస్వాత్మ రసాయనమ్ ॥ 21

శ్లో॥ అద్వితీయ మనాద్యన్తం, చిచ్ఛివం శాన్తమవ్యయమ్ ।
సంకల్ప కలనాతీతం, పిబస్వాత్మ రసాయనమ్ ॥ 22

శ్లో॥ యదేవహిచిదాకాశం, తదేవ మననం స్మృతమ్ ।
తదేవహిచిదాకాశం, పిబస్వాత్మ రసాయనమ్ ॥ 23

శ్లో॥ అఖండ సంవిదాకారం, స్వాత్మా భిన్నం నిరామయమ్ ।
యేనవ్యాప్తమిదంసర్వం. పిబస్వాత్మ రసాయనమ్॥ 24

శ్లో॥ చిత్సుఖం పరమానన్దం, శాశ్వతం పదమవ్యయమ్ ।
స్వస్వరూపం పరంజ్యోతిః, పిబస్వాత్మరసాయనమ్॥25

శ్లో॥ సోహం ప్రణవ లక్ష్యార్థం, సంసారభయ నాశనమ్ ।
స్వాత్మరూపం పరబ్రహ్మ, పిబస్వాత్మరసాయనమ్ ॥26

శ్లో॥ పరిపూర్ణం పరానన్దం, దుఃఖ సంశ్లిష్ట వర్జితమ్ ।
స్వాత్మస్థితం స్వప్రకాశం, పిబస్వాత్మరసాయనమ్॥ 27

శ్లో॥ నిరవద్యం సదానన్దం, నిత్యకల్యాణ భాజనమ్ ।
"సోహం" మంత్రార్థరూపంతత్, పిబస్వాత్మ
రసాయనమ్ ॥ 28

శ్లో॥ అధిష్ఠానం ప్రపంచస్య, నామరూప వివర్జితమ్।
అఖండ పరమానన్దం, పిబస్వాత్మ రసాయనమ్॥ 29

శ్లో॥ అహం సర్వమిదం విశ్వం, పరిపూర్ణ మివాంబరమ్।
అస్తిభాతి ప్రియంరూపం, పిబస్వాత్మరసాయనమ్॥ 30

శ్లో॥ అహం ప్రతీతి సత్యార్థం, జగత్పరమ కారణమ్।
స్వాధిష్ఠానం స్వప్రకాశం, పిబస్వాత్మ రసాయనమ్॥31

శ్లో॥ ఆత్మైవపంచభూతాని, ఆత్మైవ భువనత్రయమ్।
ఆత్మైవాహం స్వప్రకాశం, పిబస్వాత్మరసాయనమ్॥32

శ్లో॥ అంతఃపూర్ణం,బహిఃపూర్ణం పూర్ణంసర్వమివామ్బరమ్।
పూర్ణానందం పరంనిత్యం, పిబస్వాత్మ రసాయనమ్॥33

శ్లో॥ మోహత్రామ సుధీ ప్రోక్తం, ఇదమాత్మ రసాయనమ్।
అధ్యేయం వేదవన్నిత్యం,మోక్షప్రాప్తి సుసాధనమ్॥34

రసాయన పదమునకు దేహమునకు పుష్టికలిగించునట్టి దివ్యౌషధమని యర్థము. ఇట్లే ఈ రసాయన శబ్దమునకు పరమార్థమున అర్థమేమనిన, "రసోవై సః" రసశబ్దమునకు "బ్రహ్మ" యనియే అర్థము, అయన శబ్దమునకు ఆధారము లేక ఉండు చోటుయని యర్థము. ఇది జీవుని యందు ఆత్మ రూపమున, నేను అను, "అహం" స్ఫురణ తోడ ప్రతివారి హృదయమునందున స్వప్రకాశము తోడ యున్నది. వాస్తవమున పరమాత్మయే ప్రత్యగాత్మ. ఇది నిత్య నిరతిశయానన్ద రూపము. అఖండ సచ్చిదానన్ద స్వరూపము, జీవజగత్తులకు ఆధారము. అనగా సర్వాధిష్ఠానము. రసాయన ఔషధమును ఆరోగ్య లాభము కొరకు, దీర్ఘకాల మెట్లు సేవింపవలయునో అట్లే యీ "ఆత్మ రసాయనము"ను ప్రీతితోడ నిత్యానుసన్ధానము జేయుచుండ కాలక్రమమున, తన వాస్తవస్వరూపమగు, అఖండ సచ్చిదానన్ద, అనుభూతి కలుగుచు అభ్యాస పాటవమును బట్టి కాల క్రమమున తత్స్వరూపుడే యగును.

# ఆత్మానుభూతి

శ్లో॥ యేనసర్వమిదం జాతం, యేనేదం ధార్యతేజగత్ ।
యస్మిన్విలీయతె సర్వం, తస్మై జ్ఞానాత్మనేనమః ॥
కౌతాన్వయ సుధాబింబం, సూర్యనారాయణం గురుమ్ ।
వందేఽహం జ్ఞానదాతారం, పితరం జ్ఞాన భాస్కరమ్ ॥

ప్రపంచమున మానవులు పొందుచున్న సుఖదుఃఖము లన్నియూ అనాత్మానుభవములే. దీనికి కారణము అనాది భ్రాంతియే. ఇది దుఃఖ రూపము. కావున ఆత్మస్వరూపమును "సదేవసోమ్యే దమ్మగ్ర ఆసీదేక మేవా ద్వితీయం" "నేహనానా స్తి కించన" సృష్టికి పూర్వమున నున్నది ద్వితీయ రహితమగు సద్రూపమైన ఒక్క బ్రహ్మ పదార్థమే. పరిదృశ్య మానమగునదంతయు వాస్తవమున లేదు. అని వేదమాత తెలుపు చున్నది. బ్రహ్మయన్నను, ఆత్మయన్నను ఒక్కటియే. "అయమాత్మా బ్రహ్మ" అను మహావాక్యము ఇందుకు ప్రమాణము. ఆత్మాను భూతి యనగా— ఆత్మయందు దధ్య స్తముగ నున్నట్టి స్వశరీరాది సర్వదృశ్య సంఘాతము నంతయు, అనిత్యము, కల్పితము. అవాస్తవము అను నిశ్చయముతో జ్ఞానపూర్వకముగ త్యజించి తన పరమార్థ వాస్తవ అఖండానన్ద పరమాత్మ స్వరూపమును స్వాత్మా భిన్నముగ తెలిసికొని స్వానుభవము నొందుటయే. చిరకాల ఆత్మాను సన్ధాన దృఢాభ్యాసాదుల వలన జీవుడు ఆత్మానుభూతి నొందగలుగును. సందియము లేదు. "ఆత్మైవానన్దః" అనగా— ఆత్మయే ఆనన్ద స్వరూపము అని చెప్పుచు, ఏ వకారమువలన ఆత్మేతరము లన్నియు (అనగా విషయములు) మిథ్యా మాత్రములనియు, దుఃఖరూపములనియు, శ్రుతిమాతయే నిశ్చయించి తెలుపుచున్నది. ఈ ప్రపంచమున ప్రతి జీవుడును ఆత్మస్వరూపుడే.

ఆత్మస్వరూపము కానివారెవరును లేరు. ఆత్మయన్నను స్వస్వరూపమన్నను ఒక్కటియే. ఇదియే ప్రతి జీవునియొక్క పరమార్థ వాస్తవ స్వరూపము. ఇది నిత్య నిరతిశయ సుఖస్వరూపము. దీని నొందుటయే మోక్షము. దీనికి సాధనము భక్తి. ఈ భక్తిని శ్రీ శంకర భగవత్పాదులు— "మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవగరీయసీ, స్వస్వరూపానుసన్ధానం భక్తిరిత్యభి ధీయతే" । అని నిర్వచించుచున్నారు. ప్రతి జీవుడును కోరునది తన శాశ్వత సుఖము. ఇట్టిది తన ఆత్మపదార్థము తప్ప వేరొండు యీ పదునాలుగు లోకములలోను లేదు. పరమార్థ వాస్తవమున ప్రతి జీవుడును శాశ్వత సుఖ స్వరూపమగు అఖండ పరమానన్ద స్వరూపుడే. కాని అనాది అవిద్యచే తన వాస్తవస్వరూపమును మరచి యీ దేహాదులనే "నేను" "నాది" అను భ్రాంతితోడ సంసార దుఃఖము నొందుచున్నాడు. ఇట్టి భ్రాంతి అనాదిగ నున్నది. జీవులను ఇట్టి అజ్ఞానమునుండి విముక్తులను గావించుటకే— "బ్రహ్మ సత్యం జగన్మిథ్యా" "జీవో బ్రహ్మైవనాపరః" "తత్త్వమసి" మొదలుగాగల వాక్యముల తోడ శ్రుతిమాత జీవబ్రహ్మైక్యమునే బోధించుచున్నది. దీనిని బాగుగ తెలిసికొని స్వానుభవము నొందుటయే మోక్షము. దీని నొందుటకు ఒక్క మానవ జన్మయే సాధనముగాని తదితర జన్మములు గావు. ఇది శతకోటి జన్మ సుకృతములున్నగాని సిద్ధించదు. కావున మానవజన్మ వృథా గావించుకొనుట గొప్ప నష్టమని "నచేదిహావేదీన్మహతీ వినష్టిః", అని వేదమాత స్పష్టముగా తెలుపుచున్నది. మోక్షప్రాప్తికి శాస్త్రము జీవునకు శ్రవణమనన నిదిధ్యాసనములను ముఖ్యసాధనములుగ బోధించుచున్నది. ఈ యాత్మ మననాను సన్ధాన ప్రక్రియ యెట్టిదనిన— ముముక్షువు తాను చేసిన శాస్త్రశ్రవణమువలన భాగత్యాగ లక్షణముచే తన పరమార్థ స్వరూపమును బాగుగ గ్రహించి అనగా అహంకార మమకార నిష్ఠమును, చిజ్జడమిశ్రితమగు ఈ ఉపాధియందు, జడము అవాస్తవము అనిత్యము, దుఃఖరూపమగు అనాత్మ పదార్థమును జ్ఞానపూర్వకముగా

త్యజించి, తన పరమార్థ వాస్తవ స్వరూపమగునట్టియు, నిత్య నిరతిశయ సుఖరూపమగునట్టియు, చిదాత్మను మాత్రము గ్రహించి దాని స్వానుభవము నొందుటకుగాను తాను మనన విచారాదులచే సంశయ విపర్యయ రహితముగ గ్రహించిన స్వాత్మాభిన్న అద్వితీయ అఖండ ఆనన్దరూపమగునట్టి, స్వస్వరూపమును ప్రీతి నిశ్చయములతోడ ప్రారబ్ధాంతము వరకును హృదయపూర్వకముగ నిరన్తరము చింతించుచుండుట. ఇది ముముక్షువులకు, జీవన్ముక్తులకును అమృతతుల్యము, సమ్యగ్దర్శన సాధనము. ఇట్టి పరమప్రయోజనము నుద్దేశించియే శ్రుతియుక్త్యనుభవ ప్రమాణ వచనములను కొన్ని సంపుటినిజేసి ఇందుదాహరించుచున్నాడను. సద్గురు ముఖమున వీని యర్థమునంతయు బాగుగ గ్రహించి నిత్యము అనుసన్ధానము నాచరించు వారలకు ముక్తి కరతలామలకమని వేరుగ జెప్ప బనిలేదు. ఎట్టి మానవునకైనను యింతకన్న పొందదగిన సుఖము గాని, లాభముగాని లేదు.

1 శ్లో॥ కరోతుభువనే రాజ్యం, విశత్వాకాశ మంబువా ।
స్వాత్మజ్ఞానం వినావిద్వన్, విశ్రాంతింనాధి గచ్ఛతి ॥

2 శ్లో॥ దీర్ఘస్వప్నమిదం విశ్వం, దీర్ఘం వాచిత్త విభ్రమం ।
దీర్ఘం వాపి మనోరాజ్యం, సంసారం విద్ధిరాఘవ ॥

3 శ్లో॥ స్వప్నమాయే యథాదృష్టే, గంధర్వనగరం యథా ।
తథా విశ్వమిదం దృష్టం, వేదాన్తేషు విచక్షణైః ॥

4 శ్లో॥ స్వాత్మన్యేవ జగచ్చిత్రం, మాయాకార్య మితీక్షితుః ।
ఉపేక్షితే జగచ్చిత్రే, స్వాత్మైవ పరిశిష్యతే ॥

5 శ్లో॥ జగత్సర్వం మృషైవేదం, కల్పితంతు నవస్తుతః ।
ఆభాసమేవ సకలం, స్వప్నతుల్యం భ్రమోదితమ్ ॥

6 శ్లో॥ దీర్ఘ స్వప్నమిదం విశ్వం, విశ్వం హ్యాత్మనికల్పితమ్ ।
మాయామాత్ర మిదంద్వైతం, అద్వైతం పరమార్థతః।

7 శ్లో॥ భ్రాంతిమాత్రమిదం విశ్వం, విశ్వం బ్రహ్మణికల్పితమ్।
కల్పితం చిత్తవిభ్రాన్త్యా, రజ్జుసర్ప ఇవోదితమ్ ॥

8 శ్లో॥ అధిష్ఠానే పరిజ్ఞాతే, సచ్చిదానన్ద లక్షణే ।
నామరూప మిదం విశ్వం, స్వప్నవత్పరి లీయతే ॥

9 శ్లో॥ దృశ్యం హ్యదృశ్యతాం నీత్వా, బ్రహ్మాకారేణ చిన్తయేత్।
నామరూప మిదం విశ్వం, బ్రహ్మాకారేణ భాసతే ॥

10 శ్లో॥ నిష్ప్రపంచం పరంజ్ఞానం, మహాకాశ మివస్థితమ్ ।
అస్తిభాతిప్రియం రూపం, ఏతద్బ్రహ్మ విదుర్బుధాః ॥

11 శ్లో॥ అహం సర్వమిదం విశ్వం, పరమాత్మా హమచ్యుతః ।
అహంకారాభిధాయాసా, కల్పితానతువాస్తవీ ॥

12 శ్లో॥ ఏకం నిత్యం చిదాకాశం, సర్వాత్మక మఖండితమ్ ।
సత్యం జ్ఞానమనన్తంచ, బ్రహ్మలక్షణ ముచ్యతే ॥

13 శ్లో॥ నిత్యోఽహం నిరవద్యోఽహం, జ్ఞానమాత్ర స్వరూపతః।
అఖండపరిపూర్ణోఽహం, నిర్మలాకాశ వత్సదా ॥

14 శ్లో॥ అఖండానన్దరూపోఽహం, నామరూప వివర్జితః ।
నామరూప మిదం విశ్వం, కల్పితం చిత్త విభ్రమాత్ ॥

15 శ్లో॥ నిష్కలోఽహం నిష్క్రియోఽహం, దేహత్రయ విలక్షణః ॥
అకర్తాహ మభోక్తాహ, మచలోఽహం సనాతనః ॥

16 శ్లో॥ చిదాకాశ స్వరూపో౽హం, సర్వాధారో౽హమేవచ ।
నిత్యస్సర్వగతఃస్థాణు, రచలో౽హం సనాతనః ॥

17 శ్లో॥ అఖండ సంవిదాకార, మద్వితీయ మగోచరమ్ ।
సర్వాధారం పరంజ్యోతిః, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

18 శ్లో॥ పుణ్యపాప వినిర్ముక్తం, కారణం జగతః పరమ్ ।
అనన్తం నిత్యమేకంచ, తద్బ్రహ్మాస్మి పరంపదమ్ ॥

19 శ్లో॥ సత్యం జ్ఞానమనన్తంచ, పరిపూర్ణ మివాంబరమ్ ।
స్వాత్మాభిన్నం స్వప్రకాశం, తద్బ్రహ్మాస్మి పరంపదమ్॥

20 శ్లో॥ అహం సర్వస్యప్రభవో, మత్తస్సర్వం ప్రవర్తతే ।
మత్స్థాని సర్వభూతాని, నచాహంతే ష్వవస్థితః ॥

21 శ్లో॥ నాహం దేహోనేన్ద్రియా ణ్యన్తరఙ్గం,
నాహంకారః ప్రాణవర్గో నబుద్ధిః ।
దారాపత్య క్షేత్రవిత్తాదిదూరః
సాక్షీనిత్యః ప్రత్యగాత్మా శివో౽హమ్ ॥

22 శ్లో॥ నాహంజాతో నప్రవృద్ధో ననష్టో
దేహస్యోక్తాః ప్రాకృతాస్సర్వ ధర్మాః ।
కర్తృత్వాదిశ్చిన్మయస్యాస్తి నాహం
కారస్యైవ హ్యాత్మనో మే శివో౽హమ్ ॥

23 శ్లో॥ మత్తోనాన్యత్కించి దత్రాస్తివిశ్వం
సత్యం బాహ్యం వస్తుమాయోప క్లృప్తమ్ ।
ఆదర్శాన్త ర్భాసమానస్యతుల్యం,
మయ్యద్వైతే భాతితస్మాచ్ఛివో౽హమ్ ॥

24 శ్లో॥ ఆత్మజ్యోతిః ప్రణవనిహితం కేవలం జ్ఞానరూపం,
విశ్వాతీతం గగన సదృశం తత్త్వమస్యాది లక్ష్యం।
ఏకంనిత్యం విమలమచలం సర్వధీసాక్షి భూతం,
సర్వాధారం పరమపురుషం స్వస్వరూపం స్మరామి॥

ఇట్లు స్వస్వరూపమును హృదయపూర్వకముగ చిరకాలము నభ్యసించవలెను. నిరన్తరాత్మాను సన్ధానము, ముముక్షువుల కమృత తుల్యము. ఇది అనుభవము. శాస్త్రబోధ.

25 శ్లో॥ భక్త్యామామభి జానాతి యావాన్ యశ్చాస్మి తత్త్వతః।
తతోమాంతత్త్వతో జ్ఞాత్వావిశతే తదనన్తరమ్॥

26 శ్లో॥ స్వానుభూత్యా స్వయంజ్ఞాత్వా, స్వమాత్మాన మఖణ్డితమ్।
సంసిద్ధః సుసుఖంతిష్ఠే, న్నిర్వికల్పాత్మ నాత్మని॥

27 శ్లో॥ వేదాన్త సిద్ధాన్తనిరుక్తిరేషా,
బ్రహ్మైవజీవః సకలం జగచ్ఛ।
అఖండరూపస్థితిరేవమోక్షో,
బ్రహ్మా ద్వితీయే శ్రుతయః ప్రమాణమ్॥

28 శ్లో॥ బహుశాస్త్ర కథాకంథారోమంథేన వృథైవకిమ్।
అన్వేష్టవ్యం ప్రయత్నేన, తత్త్వజ్ఞైర్జ్యోతిరాంతకమ్॥

29 శ్లో॥ హృదయకమలమధ్యే, దీపవద్వేదసారమ్।
ప్రణవమయ మతర్క్యం, యోగిభిర్ధ్యాన గమ్యమ్।
హరిగురు శివయోగం, సర్వభూతస్థ మేకమ్।
సకృదపిమనసావై చిన్తయేత్ యస్సముక్తః॥

30 శ్లో॥ స్నాతంతేన సమస్తతీర్థ సలిలైస్సర్వాపిదత్తాఽవని,
ర్యజ్ఞానాంచ కృతం సహస్రమఖిలా దేవాశ్చ సంపూజితాః।
సంసారాచ్చ సముద్ధృతాః స్వపితరస్త్రైలోక్య పూజ్యో
ఽప్యసౌ,
యస్యబ్రహ్మవిచారణేక్షణమపిస్థైర్యం మనః ప్రాప్ను
యాత్ ॥

31 శ్లో॥ ఆత్మైవపంచభూతాని, ఆత్మైవభువనత్రయమ్।
ఆత్మైవాహం చాన్యదాత్మా, ఆత్మభిన్నం నకించన ॥

అనిస్మృత్యాది వచనముల బోధ.

ఆత్మాను సన్ధానము:— నేను - నాది యను ప్రతీతి కల్పితము, వ్యావహారికము మాత్రమే. నేను నిష్ప్రపంచుడను. నేను కేవల చిద్రూపుడనుగాని చిత్ ప్రతిబింబరూపుడనుగాను. నేను యీ "అహం" అను ప్రతీతితోడనే, అవస్థాత్రయ కాలత్రయా బాధితముగ నాయావదనుభవము నొందుచున్నాడనుగాని మరి వేరేదియును నిట్టి యనుభవము నిచ్చునది నాకు గనబడుటలేదు. ప్రతీతి యనగా జ్ఞానమే. అఖండ పరిపూర్ణ జ్ఞానమే నా పరమార్థ స్వరూపము సుఖదుఃఖములు, క్షుత్పిపాసాదులు, జరామరణములు నా ఉపాధి ధర్మములేకాని, వాస్తవమున నాకు సంబంధించినవి గావు. అయినను ప్రారబ్ధమున నన్ను బంధించు చున్నదానివలె నుండి, సుఖదుఃఖానుభవముల నాకిచ్చుచున్నది. ఇది ప్రారబ్ధ కల్పితము, తాత్కాలికము. నేనిపుడు నా పరమార్థ వాస్తవ స్వరూపమును తెలిసికొనినవాడను. "నాహం చిదాభాసః, అహంచిదేవ", అనగా నేను చిదాభాసుడగు చిత్ ప్రతిబింబుడనుగాను, నేను కేవల నిత్య నిరతిశయ సుఖస్వరూపుడనని ముముక్షువు సర్వదా తన అఖండ చిద్ఘనానన్ద స్వరూపమును నిట్లు అనుసన్ధించుచుండవలయును. "అహం" నేను మూర్తామూర్త స్వశరీర సర్వోపాధి వినిర్ముక్త, సజాతీయ విజా

తీయ స్వగత భేదరహిత, జగదుత్పత్తిలయ వివర్త అభిన్న నిమిత్తో పాదానకారణ, జరామరణరహిత, నిత్య, నిరతిశయ, నిర్వికార, నిర్గుణ, నిరవయవ, నిష్క్రియ, అద్వితీయ, అసఙ్గ, సర్వాధిష్ఠాన, సర్వధీసాక్షి భూత, స్వాత్మాభిన్న, స్వప్రకాశ, అఖండ పరిపూర్ణ, చిద్ఘనానన్ద, చిదాకాశ స్వరూపుడను. నేను కేవల ప్రకాశరూపుడను, నిష్క్రియు డను, గనుక కర్తృత్వ భోక్తృత్వాదులు నాకు వాస్తవమున సంబంధించి నవి గావు. నేను అసంగుడను, సంబంధములన్నియు కల్పితమాత్రములు గాని వాస్తవములు గావు. సుఖదుఃఖ కర్తృత్వ భోక్తృత్వాది వ్యవ హారములన్నియు కల్పితుడగు చిదాభాసునివేగాని నావి గావు. నేను చిద్రూపుడను, సద్రూపుడను యని ముముక్షువు నిరన్తరము బ్రహ్మాత్మనా సంస్థితుడగుచు, తన పరమార్థ వాస్తవస్వరూపము, చిదాకాశమేనని సర్వదా అనుసన్ధించుచుండుట శీఘ్ర ముక్తిదాయకము. ఇదియే మోక్ష స్వరూపమగునట్టి నిత్య నిరతిశయానన్దమగు ఆత్మానుభూతిని కాలక్రమ మున నిచ్చును. నిస్సంశయము శాస్త్రప్రమాణము. ఈ విషయమునే— "ఏకోవశీ సర్వ భూతాన్తరాత్మా, ఏకం రూపం బహుధాయః కరోతి। తమాత్మస్థం యేఽనుపశ్యంతి ధీరాః, తేషాం సుఖమ్ శాశ్వతం నేత రేషామ్" । "ద్వితీయాద్వై భయంభవతి" । "మాయామాత్రమిదం ద్వైతం, అద్వైతం పరమార్థతః" । "బ్రహ్మైవేదం విశ్వమిదం వరి ష్ఠమ్" । "బ్రహ్మసంస్థోఽమృతత్వమేతి" । "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" । "బ్రహ్మవిదాప్నోతి పరమ్" । "యోవేదనిహితం గుహాయాం పరమేవ్యోమన్" । "సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ" । "సయోహ వై తత్పరం బ్రహ్మవేద బ్రహ్మైవభవతి", "నాస్యాఽబ్రహ్మ విత్కులే భవతి" । "తరతిశోకం తరతిపాప్మానం గుహాగ్రంధిభ్యో విముక్తోఽ మృతోభవతి"।"యత్రనాన్యత్పశ్యతి, నాన్యచ్ఛృణోతి, నాన్యద్విజానాతి, సభూమాయో వై భూమాతత్సుఖం, సఆత్మా, తత్త్వమసి", "యత్ర త్వస్య సర్వమాత్మైవాభూత్, తత్కేనకంపశ్యేత్, కేనకంజిఘ్రేత్",

"ఏకత్వమనుపశ్యతి", "ఆనన్దం బ్రహ్మణోవిద్వాన్, నబిభేతి కుతశ్చన" "అభయం ప్రతిష్ఠాం విన్దతే" । అని శ్రుతిమాత ఉద్ఘోషించి వివిధముగ విశదీకరించి తెలుపుచున్నది. ఇది శ్రుతి పరమతాత్పర్య బోధ.

"యదావై మనుతేஉథవిజానాతి", "ఉత్తిష్ఠత", "జాగ్రత" "ప్రాప్యవరాన్ని బోధత".

శ్లో॥ ఇదం యశస్యమాయుష్యం, మోక్షప్రాప్తి సుసాధనమ్।
యేపఠన్తి సదాభక్త్యా, తత్పదం యాన్తితేపరమ్ ॥

శ్లో॥ జ్ఞాన సారమిదం కౌశా మోహన్నామ బుధోదితమ్ ।
అధ్యేయం వేదవన్నిత్యం, ఆత్మజ్ఞానాను భూతయే ॥

ఓం తత్సత్



# ఉపసంహారము

పర్యవసితముగ యింతవరకును జేయబడిన శ్రుతి, స్మృతి, వాక్య విచారమువలనను, మననాను సన్ధానాది నిరూపణవలనను, జగన్మిథ్యాత్వమును, స్వస్వరూపజ్ఞానమును సంశయ విపర్యయ రహితముగ, ప్రీతి నిశ్చయములతోడ నొందుటకు శాస్త్రమునుబట్టి అవకాశము యున్నది. దీనినంతయు జిజ్ఞాసువులు మనసున నుంచుకొని ప్రారబ్ధాంతమువరకును, ఆత్మ జ్ఞానాభ్యాసము గావించుచుండుట మోక్ష స్వరూపమగు స్వస్వరూప ప్రాప్తికి యావశ్యకము. ముముక్షువునకు యిట్టి అభ్యాస మెట్లుండవలె ననిన, సిద్ధాన్త దార్ఢ్యమునకుగాను సింహావలోకన న్యాయముగ తిరిగి సర్వవేదాన్త అద్వైత సిద్ధాన్తసారమును, తదభ్యాసమును గురించియు సంగ్రహముగ నిరూపించుచున్నాడను.

ఆత్మయన్నను బ్రహ్మయన్నను నొక్కటియే. ఆత్మజ్ఞానమన్నను, బ్రహ్మజ్ఞానమన్నను నొక్కటియే. ఈ జ్ఞానముగూడ ప్రాప్తికి సాధనమే. దీనినే బ్రహ్మజ్ఞానమందురు. బ్రహ్మస్వరూప ప్రాప్తి, వృత్తి రహితము. దీనిని స్వరూప జ్ఞానమందురు. ఇచట జ్ఞానశబ్ద ముగౌణము ముఖ్యమేమనిన, స్వస్వరూపస్థితియే. ఇదియే బ్రహ్మ, మోక్షము. నిత్య నిరతిశయానన్ద ప్రాప్తి. కావున ముముక్షువు బ్రహ్మజ్ఞానముతోడ బ్రహ్మ ప్రాప్తి నొందవలయును. కావున బ్రహ్మ, లేక ఆత్మజ్ఞానముతోడ తత్ప్రాప్తికిగాను అనుసన్ధాన ధ్యానసమాధ్యభ్యాసములు యావశ్యకములు. ప్రతి జీవునకును "అహమ్" నేను యనుకొనునట్టి తన పరమార్థ స్వరూపమే ఆత్మ. ఈ ఆత్మయే బ్రహ్మయనియు, ఇదియే పరమ ఆనన్దస్వరూపమనియు, సర్వవ్యాపకమగు ప్రజ్ఞానమే బ్రహ్మయనియు, ఆ బ్రహ్మ నీవే యనియు, నేనే బ్రహ్మననియు "అయమాత్మా బ్రహ్మ" "ఆత్మైవానన్దః" "ప్రజ్ఞానం బ్రహ్మ" "తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" యను

వాక్యములు జీవబ్రహ్మైక్యమునే బోధించుచున్నవి. కాన ముముక్షువు సర్వ ప్రయత్నములచేతను, తన పరమార్థ స్వరూపమగు ఆత్మ సాక్షాత్కారము నొందవలసియున్నది. బృహదారణ్య శ్రుతియందు "కతమ ఆత్మేతి" అని ప్రశ్న రాగా "యోయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యన్తర్జ్యోతిః పురుషః" అని తెలుపుచు "ఆత్మాన్తర్యామ్యమృతః" "అదృష్టోద్రష్టా, అశ్రుతః శ్రోతా, అమతోమన్తా, అవిజ్ఞాతో విజ్ఞాతా, నాన్యోఽతోఽస్తి ద్రష్టా, నాన్యోఽతోఽస్తి శ్రోతా, నాన్యోఽతోఽస్తి మన్తా, నాన్యోఽతోఽస్తి విజ్ఞాతా, ఏషత ఆత్మాన్తర్యామ్యమృతః, అతోన్యదార్తమ్", అని తెలుపబడినది. ఈ పై వాక్యము పరమతాత్పర్యమేమనిన :— స్వప్రకాశరూపుడై, ప్రాణములయందు హృదయాన్తరమున సర్వమును తెలిసికొనుచూ, జ్యోతిరూపమున యే పురుషుడున్నాడో ఆయనయే ఆత్మ. ఆయన అమృతుడు. అనగా అవినాశి, నాశములేనివాడు. ఆయన చూచుచు చూడనివాడుగను, వినుచు వినని వాడుగను, ఆలోచించుచు ఆలోచించనివాడుగను, సర్వమును తెలిసి కొనుచు, తెలిసికొననివాడుగను యున్నాడు. ఆయనకంటె జూచువాడు గాని, వినువాడుగాని, ఆలోచించువాడుగాని, తెలిసికొనువాడుగాని వేరుగ నెవ్వరునూ లేరు. అనగా ఆయనయే సర్వమునకు సాక్షి మాత్రుడుగ నున్నాడు. స్వప్రకాశ రూపుడు. ఆయనయే అమృతుడు, ఆత్మ, అని తెలుపుచున్నది. ఆయన కేవల ప్రకాశరూపుడు. ఆయన సాక్షి మాత్రుడని నీ వాక్యము అన్వయ వ్యతిరేక లక్షణ శబ్దములచే తెలుపుచున్నది. ఈ సాక్షి యెట్టివాడనిన "ఏకోదేవః సర్వభూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా। కర్మాధ్యక్షః సర్వభూతాధి వాసః సాక్షీ చేతాకేవలో నిర్గుణశ్చ". అని సాక్షి లక్షణములను శ్రుతివాక్యము తెలుపుచున్నది. సర్వాధిష్ఠానముగ సర్వజీవులయందును గూఢముగ నుండి ప్రకాశించుచు సర్వ కర్మలకు ఆధారుడు యీయనయే. ఈయనయే సాక్షి, కూటస్థాత్మ, పరమాత్మ. ఈయనయే జీవుని పరమార్థ స్వరూపము. ఈయనకు సుఖ

దుఃఖములుగాని, క్షుత్పిపాసాదులుగాని, జననమరణములుగాని లేవు. కావున రాగద్వేషాదులు మొదలే లేవు. ఈ ధర్మములన్నియు యుపాధికి సంబంధించినవేగాని తదితరములు గావు. ఉపాధిని, దాని ధర్మములను ప్రకాశింపజేయు ప్రత్యగాత్మవి గావు. ప్రత్యగాత్మ పరమాత్మ లొక్కటియే. ఇట్లు తెలిసికొన్నవారే శాశ్వతసుఖము నొందుదురు. ఇతరులు పొందజాలరు అని శ్రుతిమాతయే "ఏకోవశీ సర్వభూతాన్తరాత్మా। ఏకం రూపం బహుధాయః కరోతి। తమాత్మస్థం యేఽనుపశ్యన్తి ధీరాః, తేషాం సుఖం శాశ్వతం నేతరేషామ్"। అని తెలుపుచున్నది. ఈ శ్రుతి వచనముల కన్నిటికి సందర్భమునుబట్టి సంక్షేప తాత్పర్యమును వ్రాసితిని. దీనిని గ్రహించలేని జిజ్ఞాసువులు, వీటి పరిపూర్ణార్థమును శ్రుతి పరమ తాత్పర్యమును, సద్గురుముఖమున తెలిసికొనుట సమంజసము. ఏదైనను ఈ పైన తెలిపిన విషయమంతయు శ్రద్ధతో బాగుగ గ్రహించి, హృద్గోచరము గావించుకొని ముక్తినిగాంచు పర్యన్తము, యీ ఆత్మ జ్ఞానాభ్యాసకులు, వారి వారి ప్రారబ్ధాను సరణమున గలుగునట్టి సుఖ, దుఃఖ, ఐశ్వర్య దారిద్ర్యములను ఉపేక్షించుచు, స్వస్వరూపాను సన్ధానాద్యభ్యాసమును విడువక విసువుజెందక నిరన్తరము గావించుచుండుట ముక్తిహేతువు, పరమ సుఖదాయకము. ఈ అభ్యాసకులు విషయార్జనకు సాధారణముగ గలుగునట్టి తమ యిచ్ఛను తమ నిత్యానిత్య వివేకముచే తమ స్వస్వరూప ప్రాప్తికి స్వప్రయత్న పూర్వకముగ మరల్చుకొని, స్వస్వరూపమందు ప్రీతి నిశ్చయములతో నిరన్తర మనన, అనుసన్ధాన ధ్యానాభ్యాసాదుల నాచరించుచుండుట పరమముక్తికి సాక్షాత్సాధనము. ఈ అభ్యాసమెట్లుండవలెననిన, వారేపని జేయుచున్నను, యెచట యేదేశకాలములో యున్నను వారి నామరూపములను మరువకయుండునట్లు, వారి పరమార్థ స్వరూపమగు అఖండ సచ్చిదానన్ద రూపమును మరువగూడదు. ఇట్లు మరువకుండుట మాత్రమే చాలదు. ఏలయన, అనాది అవిద్యయగు

మాయాశక్తి ప్రబలమైనది. అది ఎంత ప్రజ్ఞావంతుడినైనను క్షణము లోపల సంసార విషయలమ్పటునిగ జేయును. కావున యీ అభ్యాసకుడు యీ ప్రాపంచిక సుఖములు అనిత్యములు, దుఃఖ పర్యవసితములనియు, తన దేహాది సంఘాతమంతయు ప్రారబ్ధ భోగమునకు గల్పితమాత్రముగాని వాస్తవము గాదనియు, అహంకార మమకారములు అజ్ఞాన కల్పితములనియు, వీనినిబట్టి యేర్పడు సంబంధ బాంధవ్యములు, ప్రేమాతిశయములు, రాగద్వేషాదులు మొదలగునవన్నియు, మనః కల్పితములై తనకు పర్యవసానమున దుఃఖహేతువగుచున్నవనియు, బాగుగ తెలిసికొని అనగా నిశ్చయించుకొని జగన్మిథ్యాత్వము‌ను— దీని అనిత్యత్వమును తెలిసికొని అనగా నిశ్చయించుకొని యీ ప్రపంచమంతయు దీర్ఘ స్వప్నమువంటిదను వివేకమును సర్వదా యుంచుకొనవలయును. ఇట్టి వివేకముతోడ తానే పనిజేయుచున్నను తన స్వస్వరూపమును సర్వదా యిట్లు ఆత్మవిచారాను సన్ధానముల గావించుచుండవలయును. ఈ విచార మెట్లన :— ప్రతి జీవునకును నేను అని కలుగునట్టి అహం ప్రతీతి జ్ఞానవిషయముగాని కేవల దేహముగాదు. పరమార్థ వాస్తవమున జ్ఞానము అఖండ నిత్య నిరతిశయానన్ద సుఖ స్వరూపము. ఇదియే ఆత్మ, బ్రహ్మయని తెలియబడు అఖండ పరిపూర్ణ సద్వస్తువు. దీనినే "సత్యమ్ జ్ఞానమనన్తం బ్రహ్మ' యను వాక్యము బోధించుచున్నది. ఇది అద్వితీయము, పరిపూర్ణము, అఖండము, జ్ఞాన స్వరూపమగుటచే, అహం, నేను అను ప్రతీతితో సర్వజీవులచే అనుభవింపబడునది, సద్వస్తువు, అద్వితీయము, అఖండము గనుక సద్వితీయముగా గాని, భిన్న భిన్నముగాగాని యుండుట యనునది శ్రుతి తాత్పర్య విరుద్ధము గావున అట్లుండుట యనునది భ్రాంతియే కావలయునుగాని సత్యము గాజాలదు. కావున ముముక్షువు తన సత్యస్వరూపమగు ఆత్మను అఖండ సచ్చిదానన్ద రూపముగ గ్రహించి దేహాది సంఘాతమే నేను అను భ్రాంతి జ్ఞానమును త్యజించి సర్వదా తన స్వరూపము, అఖండ

సచ్చిదానన్ద స్వరూపమనియే తెలిసికొని భ్రాంతి జ్ఞానము నశించుటకు తన స్వరూపమును మనన, అనుసన్ధాన, ధ్యానాదుల అభ్యాసము గావించు చుండుట శ్రుతి బోధ పరమ తాత్పర్యము. ఇట్టి అభ్యాసమువలన కాల క్రమమున "ఏకమే వాద్వితీయం, నేహనా నాస్తికించన" అను శ్రుతి బోధ అనుభూతికి వచ్చుచుండును. పరమార్ధమున తన స్వరూపము అఖండ, అద్వితీయ చిత్స్వరూపమైనప్పుడు, ద్వైతానుభూతియందు గలుగునట్టి, జీవకర్తృత్వ భోక్తృత్వములు అవాస్తవమగును. కర్తృత్వ భోక్తృత్వములు తనకు వాస్తవముగ లేనప్పుడు వాటి కార్యములగు రాగ ద్వేషాదులు గూడ వాస్తవముగ నుండజాలవు. ఇవి లేనిచో సుఖదుఃఖా దులు గూడ వాస్తవమను జ్ఞానముతోడ గలుగవు. కాని ప్రారబ్ధ భోగము తప్పనిది గనుక వానిని యుపాధి ధర్మములుగ భావించుచు వాస్తవమున తనవి గావని తత్త్వవిదుడు తలంచుచుండును. ఇవి యన్నియూ క్షీణించిన పిదప తన కర్మఫలము యొక్క అంకురశక్తి నశించును. వేయించిన శనగలువలె అనుభవించుటకు అనగా, తినుటకు మాత్ర ముపయోగించునుగాని అవి సేద్యమునకు అనగా, తిరిగి పండిం చుటకు పనికిరావు. కావున మోక్షార్థి యిట్టి జ్ఞాననిశ్చయముతోడ గల్పిత మగు నామరూపములను తన జ్ఞానబలముచే నుపేక్షింపగ నిర్విశేషమగు అఖండ సచ్చిదానన్ద రూపముతో తాను ప్రకాశించుచుండును. ఇదియే జీవునకు ముక్తస్థితి.

ఇట్టి స్థితిని దృఢముగావించుటకు శ్రీ శంకర భగవత్పాదులు శిష్యులకుచేసిన భోధనుంచి రెండు శ్లోకములు యిచట నుదహరించు చున్నాడను :—

శ్లో॥ దృశ్యం ప్రతీతం ప్రవిలాపయన్ స్వయం, సన్మాత్ర మానన్ద ఘనం విభావయన్ । సమాహితః సన్బహిరన్తరం వా, కాలం నయేథాః సతికర్మ బన్ధే ॥

శ్లో॥ లక్ష్యే బ్రహ్మణిమానసం దృఢతరం, సంస్థాప్య బాహ్యేన్ద్రియమ్ । స్వస్థానేవి నివేశ్య నిశ్చల తనుశ్చోపేక్ష్య దేహస్థితమ్ । బ్రహ్మాత్మైక్య ముపేత్య తన్మయతయాచాఖండ వృత్త్యానిశమ్ । బ్రహ్మానన్దరసం పిబాత్మని ముదాశూన్యైః కిమన్యైర్భ్రమైః ॥

వీటి తాత్పర్యార్థమేమనిన :— (1) దృశ్యము ప్రతీతియైనపుడెల్ల, దృశ్యమంతయు మిథ్యయను నిశ్చయమునొంది దానియందు లక్ష్యముంచక దానిని లయింపజేయుచు అనగా దాని అనిత్యత్వ అవాస్తవత్వములను గుర్తించుచు బాహ్యాన్తరములయందు సన్మాత్రమగు ఆత్మస్వరూపానుభవముతోడ, బాహ్యాన్తరములయందు నిస్సంకల్పుడవై అనగా జ్ఞాన సమాధిస్థితితో గాలక్షేపము జేయుచుండవలయును. అందువలన మరల నీకు సంసారము గలుగదు. (2) నీ మనస్సును సర్వదా బ్రహ్మమునందే దృఢతరముగ నిలిపి, యిన్ద్రియములను బాహ్యముఖము గావింపక వాని స్థానములందు వానినుంచి, విషయ భోగాసక్తి రహితుడవగుచు దేహ ధారణ విషయములందు నుపేక్షాభావముతో ప్రారబ్ధానుసరణమున జరుగ గలవను నిశ్చయముతోడ, జీవాత్మ పరమాత్మ లొక్కటిగ అనుసన్ధించుచు అఖండాకార వృత్తితో నిరన్తరముగ బ్రహ్మానన్దానుభూతిని ప్రీతితోడ నాస్వాదింపుము. శూన్య తుల్యమగు ప్రపంచముతోడ భ్రమజెందకుము, అని తెలుపుచున్నారు. మరియును ఆత్మానుసన్ధానాభ్యాసకుల విశదీకరణము నకు గాను శ్రీ శంకర భగవత్పాదుల ఆత్మానుసన్ధాన శ్లోకము నొకదానిని నిచట ఉదహరించుచున్నాడను.

శ్లో॥ నాహందేహో నేన్ద్రియాణ్యంతరంగం, నాహంకారః ప్రాణవర్గోన బుద్ధిః । దారాపత్య క్షేత్ర విత్తాదిదూరః, సాక్షీనిత్యః ప్రత్యగాత్మా శివోహమ్ ॥ ఈ శ్లోకమునందు పై మూడు పాదములున్నూ శరీరేన్ద్రియాదుల నిషేధమును జూపించుచున్నవి. వానిని గ్రహించుట అంత కష్టసాధ్యము గాదు. కాని నాలుగవ పాదమందున సాక్షీ, నిత్యః, ప్రత్యగాత్మా, శివః, అహమ్, అని అయిదు పదములనుపయోగించిరి,

ఇవి గ్రహింపవలసినట్టి ఆత్మైక్యాను సన్ధానమును బోధించుచున్నవి. ఈ అయిదు శబ్దములయొక్క అర్థము అతి గంభీరమైన సిద్ధాన్త సారము. వీనినిగురించి విపులముగ, లోగడ గ్రంధములో మనన వాక్యములందు యచటచట నిరూపింపబడి యున్నది. కావున ఆత్మ జ్ఞానాభ్యాసకులు యీ అయిదు పదములయొక్క అర్థమును జిజ్ఞాసువులు స్వయముగగాని, లేనిచో సద్గురు ముఖమునగాని తెలిసికొని, హృద్గోచరము గావించుకొని జ్ఞానపూర్వకముగ అనుసన్ధానాభ్యాసము గావించుచుండుట శీఘ్ర ముక్తిదాయకము. జ్ఞానపూర్వకముగ నుండనట్టి యను సన్ధానాభ్యాస ఫల మల్పము కావున పరమముక్తిని గోరు విద్వాంసులకు శ్రుతి పరమబోధను, శ్రుతి, యుక్తి. అనుభవములతో అనుసన్ధానాభ్యాసములను గావించుట ముక్తి తుల్యముగ నుండును.

ఆత్మ జ్ఞానాభ్యాసకులు వారి వారి ప్రారబ్ధానుసరణమున నెంతటి సుఃఖదుఃఖ భోగముల ననుభవించుచు వ్యవహరించుచున్నను తన పరమార్ధ స్వరూపమును మరువక మానసికముగ యిట్లనుసన్ధించుకొన వచ్చును ప్రపంచ వ్యవహారము, బాహ్యము, కల్పితము. స్వస్వరూపానుసన్ధానము, మానసికము, ఆన్తరముగ జేయబడునది. రెంటికిని విరోధము లేదు. కావున జిజ్ఞాసువు అహం, నేను, యీ దేహసంఘాతము గాను. వాస్తవమున అఖండ సచ్చిదానన్ద స్వరూపుడనగు నా యందే జీవభావమున యీ అహం మమేదములు గల్పితములై నాకు స్ఫురించుచున్నవి ఇవి జడములు, పరిచ్ఛిన్నములు, దుఃఖపర్యవసితములుగ నున్నవి. అనగా దుఃఖరూపములు. నేనో, అపరిచ్ఛిన్నుడను, అఖండ సచ్చిదానన్ద స్వరూపుడను. చిదాత్మ స్వరూపుడనగు నా యందే యీ దృశ్యమంతయు స్వాప్నికునియందు స్వప్నదృశ్యములాగున భాసించుచు స్వాప్నానుభవ పదార్థములకన్న జాగ్రద్దృశ్యపదార్థములు మరికొంత దీర్ఘానుభవము నిచ్చుచున్నవి. ఈ అనుభవములన్నియూ గూడ అనిత్యములై కాలాన్తరమున నశించుచున్నవి. కాని ఆత్మ స్వరూపుడనగు

నేను మాత్రము జీవిత జీవితాన్తమం దెప్పుడును నశించుటలేదు. వివేక దృష్టితో చూచినయడల నా నాశమును నేను యెప్పుడును తెలిసికొనలే కున్నాను. కావున నేను నిత్యుడను. ప్రపంచమంతయు నేను ఉన్న యడలనే నాకు ప్రకాశించుచున్నది గాని నేను లేనిచో యీ ప్రపంచము నాకు లేదు. కావున సర్వప్రకాశ రూపుడను నేనేగాని వేరేదియును లేదు. నన్ను నేను తెలిసికొనుటకు మరియొక ప్రకాశము అనగా తెలివి అక్కరలేదు. సర్వకాల, అవస్థాత్రయమందును నన్ను నేనే తెలిసికొను చున్నాడను గాన నేను స్వప్రకాశుడను. నేను, నేను యనుకొనుట యే జీవునికైనను ఆత్మయే. అనగా తానే తనయందు పరమప్రేమ కలవాడుగ యున్నందున నా ఆత్మస్వరూపమే పరమ ప్రేమాస్పదముగ యున్న పరమానన్ద రూపము. దీనినిబట్టి జూచినయడల అఖండ పరమానన్ద స్వరూపుడను నేనే యైనిత్యుడుగ యున్నాను. నేను నిత్యుడను గావుననే నా నాశము నే నెరుగలేకున్నాను. అని జిజ్ఞాసువు స్వాత్మవిచారముచే నిశ్చయమునొంది, తన వాస్తవ స్వరూపమును ప్రీతి నిశ్చయముల తోడ గ్రహించి శాస్త్ర ప్రమాణమునుబట్టి జ్ఞానపూర్వకముగ యిట్లను సన్ధించుకొనుట ముక్తిదాయకము, సాక్షాత్సాధనము. ఇది యెట్లుండ వలె ననిన :— "అహం బ్రహ్మాస్మి", నేను సర్వోపాధి విముక్త సజాతీయ, విజాతీయ, స్వగత భేదరహిత, నిత్య, నిరతిశయ, అఖండ సచ్చిదానన్ద స్వరూప, సర్వధీసాక్షి భూత, స్వప్రకాశ, సర్వాధిష్ఠాన స్వాత్మాభిన్న పరిపూర్ణ చిద్ఘనానన్ద చిదాకాశ స్వరూపుడను. ఏది నిత్యమో, నిరవయవమో, అఖండమో, స్వప్రకాశ సర్వాధిష్ఠానమో, సర్వధీసాక్షి భూతమో, యీ ప్రపంచ ఉత్పత్తి స్థితి లయములు దేని యందు గలుగుచున్నవో, అనగా వీనికి ఏది ఆధారమో, ఏ జ్ఞానముచే సర్వజీవులచే ప్రపంచ మనుభవింపబడు చున్నదో, ఏ జ్ఞానము లేనిచోఅను భవింపబడదో, ఏ జ్ఞానము సర్వకాల, అవస్థాత్రయ అబాధ్యమై అఖండ ముగ నుండి, సూర్య చంద్రాదులను గూడ బ్రకాశింపజేయుచు, జగదను

భవము నిచ్చుచున్నదో అట్టి సత్యజ్ఞానానన్త స్వరూపుడను నేనే— నేను అసంగుడను, అద్వితీయుడను, అఖండ పరమానన్ద స్వరూపుడను, నా కన్న భిన్నముగ భాసించు యీ స్వదేహాది దృశ్యమంతయు గల్పిత మాత్రము. నా నిత్య నిరతిశయ సుఖప్రాప్తికి నా ఆత్మ స్వరూపము తప్ప మరేదియు నీ ప్రపంచమున గనుబడుటలేదు. నేనే నిత్య నిరతిశయానన్ద రూపమగు పరమాత్మ, బ్రహ్మము, తదితర మేదియు వాస్తవముగ లేదు. వాస్తవ స్వరూపుడనగు నన్ను యీ అవాస్తవ అనిత్య దృశ్యము, దృశ్యసంబంధములు ఎట్లు బంధింపగలవు. స్వప్న సింహము జాగ్రతయందున్న మూషికమునైనను బంధింప గలదా! అట్లే జాగ్రత్ జాగ్రత గలిగిన ఆత్మజ్ఞానముగల అట్టి విద్వాంసుని యీ ప్రపంచము, ప్రపంచానుభవములు బంధింపజాలవు. ఈ ప్రపంచమున నాకు వాస్తవమున కావలసిన దేదియునులేదు. అవాస్తవానుభవములు నన్ను బంధింపజాలవు. వాస్తవమాలోచించిన యీ దృశ్యమంతయు నా యందే మాయాకల్పితమై భాసించుచున్నది గాని వాస్తవమున నా కన్న వేరేదియును లేదను దృఢజ్ఞానదృష్టితో యీ ఆత్మకాముడు నిరన్తరము అనుసన్ధానాదుల గావించుచుండిన ప్రారబ్ధాంతమున తప్పక విదేహముక్తియగు పరమముక్తిని పొందును. ఇది శాస్త్రప్రమాణము. సందియము లేదు. ఈ విద్యాభ్యాస మహిమను గురించి శ్రీ వశిష్ఠ భగవానులు :—

శ్లో॥ స్నాతంతేన సమస్త తీర్ధసలిలై, స్సర్వాపి దత్తాఽవనిర్యజ్ఞానాంచ కృతం సహస్ర మఖిలా, దేవాశ్చ సంపూజితాః। సంసారాచ్చ సముద్ధృతాః స్వపితర, స్త్రైలోక్య పూజ్యోప్యసౌ, యస్య బ్రహ్మవిచారణే క్షణమపి, స్థైర్యం మనః ప్రాప్నుయాత్ ॥

ఎవ్వనిచిత్తము, బ్రహ్మవిచారమునందు క్షణమునేపైనను స్థైర్యమునొందునో అట్టివాడు సమస్త తీర్థములయందు, స్నానము చేసిన వాడును, సమస్త భూమిని దానముచేసినవాడును, సహస్ర యజ్ఞ

ములు చేసినవాడును, సకల దేవతల పూజించినవాడగును. వాని పితరులు సంసారమునుండి యుద్ధరింపబడుదురు. వాడు ముల్లోకములందును పూజ్యుడునగుచున్నాడు అని తెలుపుచున్నారు. కావున మానవునకు యీ విద్యా లాభముకన్న పొందదగిన లాభము మరేమియును యీ పదు నాల్గు భువనములలో వెదకి జూచినను లేదు. కాన ఆత్మకాములగు జిజ్ఞాసువులు దీనిని బాగుగ నభ్యసించి కాలక్రమమున వారి ఆత్మ లాభము నొందుదురుగాక.

శ్లో॥ జ్ఞానసారమిదం కౌతా, మోహన్నామ బుధోదితమ్ ।
అధ్యేయం వేదవన్నిత్యం, మోక్షప్రాప్తి సుసాధనమ్ ॥

ఇతి శ్రీ కౌతా వంశోద్భవ, మోహన్నామశాస్త్రి విరచిత

" ఆత్మాను సన్ధాన రత్నావళి "

స మా ప్త ము

ఓం తత్సత్

# ను సన్ధాన రత్నావళి

(ఒక బ్రహ్మాభ్యాసకుని మనన సంగ్రహ వాక్యసంపుటి)

గ్రంథకర్త

కౌతా మోహనరామశాస్త్రి



ఆత్మ విద్యాశ్రమము

విజయవాడ :: సికింద్రాబాదు

1976